





# ధర్మము

## విచారణ

# సనాతన ధర్మం దాని విశిష్టత





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సనాతన ధర్మము దాని విశిష్టత



" రామో విగ్రహవాన్ ధర్మః "

## స్వామి ముకుందానంద

# ధర్మోరక్షతి రక్షితః

పూజ్యశ్రీ ముకుందానంద సరస్వతీ స్వాముల వారు శ్రీ శివానందాశ్రమవాసి మరియు నాకు గురుభాయి. వారితో ఎంతో కాలము నుండి నాకు సన్నిహిత సంబంధమున్న కారణముచే శ్రీశ్రీశ్రీ దేవానంద-చిన్న స్వాములవారు మహాసమాధి నొందిన తర్వాత "శ్రీ శివానందవాణి" పత్రికకు ప్రచురణకర్తగా నుండుమని కోరగా ఎంతో దయతో వారు ఆ కార్యము నొనర్చుటకు అంగీకరించిరి. అంతేకాదు, వారు "గీత ఆశించిన పరిపూర్ణ మానవుడు" అను శీర్షికతో శ్రీ శివానందవాణి యందు ధారావాహికముగా వ్యాసరచన గావించుచున్నారు.

ప్రస్తుతము శ్రీ స్వామి ముకుందానంద సరస్వతి గారు "సనాతన ధర్మము-దాని విశిష్టత" యనెడి అత్యంత ఉత్తమమైన గ్రంథరచన మొనర్చిరి. శ్రీ శివానందాశ్రమ కార్యాలయ సేవా కార్యము ముగిసిన తర్వాత వారు తమ కాలమును సద్వినియోగ మొనర్చిన దాని ఫలితమే ఈ సద్గ్రంథము. ఈ గ్రంథము యొక్క వైశిష్ట్యము చెప్పకనే చెప్పచున్నది. శ్రీ సద్గురు శివానంద స్వాముల వారు భారతీయుల కొరకు"ఆల్ ఎబౌట్ హిందూఇజం" అను గ్రంథమును రచించిరి. దాని యొక్క సారము "సనాతన మత ప్రబోధమే" యను విషయము దానిని ఆమూలాగ్రముగా చదివిన వారికి తెలియక పోదు.

"సనాతన ధర్మము -దాని విశిష్టత" అను ఈ గ్రంథమునందు శ్రీ ముకుందానంద స్వాములవారు ఆరు అధ్యాయములను రూపొందించిరి. ధర్మము-సనాతన ధర్మముల యొక్క నిర్వచనానంతరము

వారు సనాతన ధర్మము యొక్క ప్రబోధములపై తమ దృష్టిని సారించి, విపులమైన వ్యాఖ్యానము నొనర్చిరి. తదనంతరము వానప్రస్థాశ్రమ-సన్యాసాశ్రమ ధర్మములను ప్రతిపాదించిరి. తర్వాత ధర్మాచరణ-సనాతన ధర్మము యొక్క విశిష్టతలను గూర్చి వివేచించిరి. చివరికి ధర్మరాహిత్యము యొక్క దుష్ఫలితములను గూర్చి విపులీకరించిరి. ధర్మమును ఎవరు రక్షింతురో, వారిని ఆ ధర్మమే రక్షించుననను విషయమును ప్రతిపాదించిరి. (ధర్మోరక్షతి రక్షితః)

ఈ గ్రంథము భారతీయ సంస్కృతికి ఆణిముత్యము వంటిది. దీనిని పఠించిన సాధకులు సనాతన మతము యొక్క గాంభీర్యమును, ఔన్నత్యమును, లోతుపాతులను గూర్చి తెలిసికొనజాలుదురు. దీనిని పఠించిన ముముక్షువులు తమ జీవిత లక్ష్యమును గ్రహింపజాలుదురు. దీనిని పఠించిన జిజ్ఞాసువులు తమ అజ్ఞాన కవాటమును దాటజాలుదురు. ఏతద్గ్రంథమును పఠించిన వారందరును శ్రీ ముకుందానంద స్వామి వారికి కృతజ్ఞతలను తెలుపుకొనవలసియున్నది. శ్రీ స్వాముల వారిట్టి గ్రంథములను పెక్కింటిని రచించుటకై తగిన శక్తి సామర్థ్యములను శ్రీ సద్గురు శివానంద స్వాముల వారు ప్రసాదింతురు గాక!

ఓం తత్సత్

ఓం శాంతిః శాంతిః శాంతిః

**తేది : 3-12-2003**

**అఖండ మహామంత్ర**

**జపయజ్ఞ షష్ట్యబ్ద పూర్త్యుత్సవము**

**ఇట్లు**

**స్వామి హంసానంద**

# ప్రశస్తి

శ్రీమత్ స్వామి ముకుందానంద సరస్వతీ మహారాజు గారు హిమాలయాల్లో భాగీరథీ ఒడ్డున తపస్సు చేసికుంటూ, ఆంధ్రప్రజల ముక్తికి కావలసిన మార్గమును చెప్ప "సనాతన ధర్మము-దాని విశిష్టత" అను గ్రంథరాజమును రచించిరి. దాని ముద్రణ సందర్భము లో రెండుమాటలు వ్రాయుచున్నాను.

"ధార్యతే ఇతి ధర్మః" - అందరినీ ధరించి పాలించునట్టి ఏ పరమాత్మ స్వరూపమున్నదో, దానినే పరమార్థ దృష్టిలో ధర్మమందురు. కాని, వ్యవహార దశలో పుణ్యమును పెంచి మానవమాత్రుని తనయొక్క స్వరూపానుభవమునకు తోడ్పడు అలవాట్లను (సంస్కారములను) ధర్మమందురు. ఈ ధర్మములందు కొన్ని తప్పక పాటించవలయును. మరికొన్నింటిని వదిలివేయవలయును. ఎందులకనగా, అవి అధర్మ సంస్కారములు. వేనిని ఆచరించ వలయునో వాని విశిష్టతలను స్వాములవారు చక్కని శ్లోకముల ద్వారా వ్యాఖ్యానించిరి. ఉదాహరణకు ధర్మపాలన విశిష్టత, సత్యవాక్ పరిపాలన, పరోపకారము, క్షమ, సుశీలత, శాంతి, త్యాగము, వైరాగ్యము, అహింస, దయ, బ్రహ్మచర్యము, దానము, ఆహారశుద్ధి, విధ్యుక్త కర్మాచరణ, కాలసద్వినియోగము మొదలైన అత్యావశ్యక ధర్మములను గురించి చాలా విపులముగా వర్ణించిరి. వీటిని పఠించినవారు, తప్పక తాము జీవితములో పాటించు విధముగా హృదయమునకు హత్తుకొనునట్లు వ్రాసిరి. అట్లే లోభము, క్రోధము, ద్వేషము, కామము మొదలగు అధర్మ సంస్కారముల వల్ల కలుగు నష్టములను, వాటిని వదిలివేయుటకు తోడ్పడు మార్గములను శ్లోకముల ద్వారా ఉద్ధరించిరి.

ఏది స్వధర్మమో తెలియని ఈ రోజులలో జనులకు ఈ పుస్తకము కరదీపిక మనుటలో అతిశయోక్తి లేదు. ఇంతేగాక, వర్ణాశ్రమ ధర్మములు చక్కగా వ్యాఖ్యానించిరి. గృహస్థ ధర్మములను గురించి చెప్పుచూ, వివాహ సంస్కారము ఎందులకు, అది ఆధ్యాత్మిక అభివృద్ధికి ఎట్లు తోడ్పడును అను విషయమును తేటతెల్లముగా నుడివిరి. గృహస్థులకు అతిథిసత్కారము యొక్క ఆవశ్యకత, ఎట్లు అతిథులను సత్కరించవలయునో గూడ చెప్పిరి. ఉపసంహారములో ఉపపత్తి రూపములో సనాతనధర్మము యొక్క విశిష్టతను చెప్పుచూ ధర్మాచరణ ఫలము, అధర్మపాలన దుష్ఫలితము గూడ వక్కాణించిరి.

వారు ఉదాహరించిన శ్లోకములలో మూడింటిని సాధకుల ధర్మాచరణ అభిరుచికి అర్థసహితముగా వ్రాసెదను.

**శ్లో॥ అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయమ్ ।**
**పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్॥**

పదునెనిమిది పురాణముల సారము వ్యాసులవారు ఈ విధముగా చెప్పిరి. మనోవాక్కాయ కర్మల ద్వారా ఏ ప్రాణినీ కష్టపెట్ట రాదు. అందరిలో, అన్నింటిలో పరమాత్మని చూచుచూ, ఆ నారాయణ స్వరూపునికి తగిన గౌరవమిచ్చి మెలగుటయే ముఖ్య ధర్మము మరియు పుణ్యపుంజముల సేకరణ. దీనికి విపరీతముగా ఆచరించుటయే పాపమునకు వడిగట్టుట.

సత్యమును గురించి చెప్పుచూ, చక్కని ఉదాహరణ ఈ విధముగా వ్రాసిరి.

**శ్లో॥ దన్తి దన్త సమానం హి నిఃసృతం మహతాం వచః ।**
**కూర్మగ్రీవేవ నీచానాం పునరాయాతి యాతి చ॥**

మహాత్ముల వచనములు ఏనుగు దంతము వలె ఒకసారి పలికిన పలుకులు జవదాటరు. కాని, నీచులు తాబేలు మెడ వలె



వచనము చెప్పి మరల వెనుకాడెదరు. అనగా సత్యవాక్ పరిపాలన గావించరు. (అసత్యమునే పలికెదరు).

క్షమా గుణమును గురించి వ్రాయుచూ, ఈ విధముగా వ్రాసిరి.

**శ్లో॥ నరస్యాభరణం రూపం రూపస్యాభరణం గుణః।**
**గుణస్యాభరణం జ్ఞానం జ్ఞానస్యాభరణం క్షమా ॥**

మనుష్యులకు రూపమే ఆభరణము. కాని, గుణహీనులకు రూపము వ్యర్థము. మంచిగుణములుండి శాస్త్ర జ్ఞానము లేని వారు రాణించరు. శాస్త్రజ్ఞానమున్ననూ క్షమాగుణము లేనిచో వారు గమ్యమును చేరజాలరు. అందుకే శాస్త్రములలో "విద్యా దదాతి వినయం" అనినారు. శాస్త్రములన్నియు ఏకధాటిగా పరమాత్మ ఒక్కడే సత్యము, ఈ జగత్తు అనిత్యము, అసుఖము అని చాటుచుండగా శరీరేంద్రియములందు అభిమానము వహించి, క్షమాగుణము లేనివారు గమ్యమునెట్లు జేరగలరు?

అందులకే మహాత్ముడైన శ్రీ రామకృష్ణ పరమహంస వారు 'స, స, స' అనిరి. అంటే క్షమాశీలుడవై సహించు, సహించు, సహించు అని అర్థము. దానినే మన ముకుందానంద స్వామి వారు చక్కని శ్లోకమునుదాహరించి వక్కాణించిరి.

ఈ పుస్తక రచయితను పరమాత్మ గమ్యము జేర్చుగాక! ప్రచురణకర్తలను భగవంతుడు ఆశీర్వదించుగాక! పాఠకుల యందు ధర్మము ఆవహించు గాక!

భవదీయ
**స్వామీ మేధానందపురీ,**
**మేనేజర్**
**కైలాసాశ్రమము, మునీ-కీ-రేతి,**
**హృషీకేశ్, (హిమాలయాస్)**




# విన్నపము

"రామో విగ్రహవాన్ ధర్మః" అని ఖ్యాతిని బొంది, ఏనాడున్నూ ధర్మము నుల్లంఘించిగాని, మర్యాదను తప్పిగాని నడవక మాన వాళికి ఆదర్శప్రాయుడై, మర్యాదపురుషోత్తముడని కీర్తింపబడుచున్న ఆ శ్రీరామచంద్ర ప్రభుని పాదారవిందములకు సాష్టాంగ ప్రణా మములర్పిస్తూ విన్నవించుకుంటున్న విన్నపము.

ఈ సేవకుడు తనకున్న అల్పబుద్ధితో వ్యాసరచనలు గావించి "శ్రీ శివానంద వాణి" పత్రికలో ప్రచురించుట "శ్రీ శివానందవాణి" పాఠకులకు విదితమే.

యథాప్రకారముగా సనాతన ధర్మమును గురించి ఒక వ్యాసమును వ్రాసి పత్రికలో ప్రచురించవలయుననెడి సంకల్పము తో, వ్యాసమును ప్రారంభించుట జరిగినది. రచనా కాలాంతర్గతము లో, సనాతన ధర్మమునకు మూలాధారములైన శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములను పరిశీలించినపుడు, మానవుడు ధర్మవ్రతుడు -సదాచార సంపన్నుడగుటకుగాను, తానభివృద్ధి జేసికొనవలసిన సద్గుణములను గురించియు మరియు త్యజించవలసిన దుర్గుణములను గురించియు వాటిలో చాలా విస్తృతముగా చెప్పబడియుండుట గమనించిన పిదప, చర్చనీయాంశమును కొంచెము విపులంగాను, సుదీర్ఘంగాను, ప్రమాణయుక్తంగాను (మంత్ర, శ్లోకాది ప్రమాణములతో) వ్రాయవలెననెడి భగవత్ప్రేరణ ఉత్పన్నమయినది. తదనుసారముగా కృషిచేయుట జరిగినది. తత్ఫలమే ఈ చిన్న పుస్తక రూపము ధరించినది.

ఈ పొత్తములోని దోషములను పాఠకులు సహృదయతతో మన్నింతురని ఆశించుచున్నాను. వ్రాత ప్రతిని సరిదిద్ది, సహకరించిన పూజ్యశ్రీ హంసానందస్వామి, స్వర్గాశ్రమవాసియైన పూజ్యశ్రీ నారాయణానంద స్వామి, పూజ్యశ్రీ మేధానందస్వామి వారి పాదారవిందములకు నమస్కరిస్తూ ధన్యవాదము లర్పిస్తున్నాను.

ఈ పుస్తక ముద్రణకు ఆర్థికముగా సహకరించిన గౌరవ నీయులైన శ్రీ కాటబత్తిన జనార్థన గారికి, ఇతరులకు నా హార్థిక ధన్యవాదములు అర్పిస్తున్నాను. వారికి, వారి కుటుంబ సభ్యు లందరకు దైవానుగ్రహము లభించును గాక!

ఈ పుస్తకమును పఠించి, పాఠకులు లాభాన్వితులయి; ధర్మ వ్రతులును, సదాచార సంపన్నులును అయినచో నా కృషి ఫలించినదనియు, నేను మిక్కిలి ధన్యుడనైతిననియు భావింతును.

శుభమస్తు

సత్యం వద ధర్మం చర

ఓం తత్సత్

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

ఇట్లు

బుధజన విధేయుడు

18.2.2004

మహాశివరాత్రి

**స్వామి ముకుందానంద సరస్వతి**

**ప్రస్తుత చర్చనీయాంశమగు "సనాతన ధర్మము-దాని విశిష్టత"ను షడ్విధములుగా విభజించవచ్చును. (1) ధర్మము-దాని నిర్వచనము, (2) సనాతన ధర్మము-దాని నిర్వచనము, (3) సనాతన ధర్మము యొక్క ప్రబోధములు, (4) ధర్మాచరణ యొక్క విశిష్టత, (5) సనాతన ధర్మము యొక్క విశిష్టత, (6) ధర్మరాహిత్యము యొక్క దుష్ఫలితము.**

పై విషయములను క్రమముగా ఒక్కొక్కటి సవిస్తారముగా చర్చించెదము.

## I. ధర్మము-దానియొక్క నిర్వచనము

ప్రప్రథముగా ధర్మమననేమి, దానియొక్క నిర్వచనమేమి యను విషయమును విచారించెదము.

'ధర్మ'మను పదము సంస్కృతములోని 'ధృ' యను బీజశబ్దము నుండి పుట్టినది. 'ధృ' యను శబ్దమునకు అర్థము 'ధరించునది' లేక 'భరించునది' లేక 'సంరక్షించునది'. కాబట్టి 'ధర్మ' పదమును ఈ క్రింది విధముగా నిర్వచించిరి.

1) **'ధరతి విశ్వం ఇతి ధర్మః'** – విశ్వమును ధరించునది లేక సంరక్షించునది ధర్మం.

2) **'ధరతి లోకం వేతి ధర్మః'** – లోకమును లేక ప్రపంచమును ధరించునది లేక సంరక్షించునది ధర్మమని తెలియబడును.

3) **'యతోఽభ్యుదయ నిఃశ్రేయ స సిద్ధిః స ధర్మః'** – ఇహలోకమునందు అభ్యుదయమును, పరలోకమునందు శ్రేయస్సును కల్గించునది ధర్మం.

4) సంవర్త స్మృతి క్రింది విధముగా నిర్వచించుచున్నది

**'యస్మిన్ దేశే య ఆచారః పారంపర్య క్రమాగతః !**
**ఆమ్నాయై రవిరుద్ధ శ్చ స ధర్మః పరికీర్తితః ॥**

'వేద విరుద్ధము కానటువంటిదియు, దేశములోని ఏ ప్రాంతములోనైనను పారంపర్యముగా అనుసరింపబడుతూ వస్తున్న సదాచారమును ధర్మమందురు'.

5) మరియు, భగవాన్ శ్రీ వ్యాసమహర్షి మహాభారతములో క్రిందివిధముగా నిర్వచించినాడు.

**'ధారణాద్ధర్మ ఇత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః।**
**యత్ స్యాద్ధారణ సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః॥**

'ఏదైతే ధరించునో లేక సంరక్షించునో దానిని ధర్మమందురు. ధర్మము ప్రజలను సంరక్షించును. ఏదైతే రక్షణాయుతమై (రక్షణతో గూడి) యున్నదో దానినే ధర్మమందురు. ఇది నిశ్చయము.

కనుక, మానవాళి మనుగడకు ధర్మమే ఆధారం. ధర్మము యొక్క బలము చేతనే విశ్వము నడచుచున్నది. ధర్మము పూర్తిగా నశించినపుడు, మానవాళి మనుగడకే ముప్పు వాటిల్లి, విశ్వము గూడ నశించును. అందులకే "సత్యం వద, ధర్మం చర" యను వేదవాక్కు అతి ప్రసిద్ధమయినది. ప్రతి మానవుడు "సత్యాన్ని పలకాలి, ధర్మాన్ని ఆచరించాలి" యని శ్రుతిమాత ప్రబోధించుచున్నది. ఇదియే మన భారతీయ సంస్కృతికి పునాది.

## II. సనాతన ధర్మము - దాని యొక్క నిర్వచనము

ఇపుడు, సనాతన ధర్మమననేమి, దాని యొక్క నిర్వచనమేమి యను విషయమును తెలిసికొందము.

సనాతన ధర్మమును చతుర్విధములుగా నిర్వచించవచ్చును.

మొదటిది :-

**"సనాతనస్య ధర్మ ఇతి సనాతన ధర్మః"** - 'సనాతునుని (శాశ్వతుని లేక పరమాత్ముని) యొక్క ధర్మమును సనాతన ధర్మమందురు'. ఇది షష్ఠీతత్పురుష సమాసము. స్థాపిత, స్థాపక సంబంధమును తెలుపుచున్నది. సనాతనుడైన భగవానుని చేత స్థాపింపబడినదగుటచే దీనిని సనాతన ధర్మమందురు. ఉదా హరణకు క్రైస్తవులు, మహమ్మదీయులు, బౌద్ధులు-క్రీస్తును, మహమ్మదును, బుద్ధుని ఆయా మతముల యొక్క స్థాపకులుగా విశ్వసింతురు. అలాగుననే, సనాతన ధర్మము సనాతనుడైన భగవానునిచేతనే అమలు జరపబడినది గాని మరి ఏ మానవుని చేతను గాదని స్పష్టమగుచున్నది.

సనాతన ధర్మము తప్ప మిగిలిన ధర్మములను రెండు విధములుగా విభజించ వచ్చును. (1) భూతకాలములో ఉండి వర్తమానములో లేనివి, (2) భూతకాలములో

లేక వర్తమానములో ఉన్నవి. సనాతన ధర్మము ఈ రెండు తెగలకు సంబంధించినది గాదు. సనాతన ధర్మము అన్ని ధర్మముల కంటె ముందునుండి ఉన్నది, ఇపుడు గూడ జీవించియున్నది. కాని, దీనియొక్క భవిష్యత్తు ఏమిటి? యను ప్రశ్న రావచ్చును. దీనికి సమాధానమిచ్చునపుడు మనము ప్రకృతి నియమమును మనస్సులో నుంచు కొనవలయును. ఏదైతే పుట్టుతుందో అది గిట్టక తప్పదు–**"యజ్జన్యమ్ తదనిత్యమ్"**. ఈ నియమమును ఉల్లంఘించుటకు ఎవరికిని సాధ్యము కాదు. ఉల్లంఘించుట ఇంతకు ముందు జరిగియుండలేదు; భవిష్యత్తులో గూడ జరగబోదు. ఉదాహరణకు భగవానుడు సహితము ధర్మసంస్థాపనార్థమై అనేక రూపములలో అవతరించినపుడు గూడ ఆ కార్యము నెరవేరిన వెంటనే తన అవతారమును చాలించుచున్నాడు. ప్రకృతి నియమమును ఉల్లంఘింప భగవానునికి సహితము సాధ్యము కాదు.

సనాతన ధర్మమునకు పుట్టుక అంటూ లేదు గాబట్టి, గిట్టుట గూడ ఉండదు. ఇది శాశ్వతమైనది, ఆద్యంతములు లేనిది.

## రెండవ నిర్వచనము

**"సనాతనశ్చాసౌ ధర్మశ్చ ఇతి సనాతన ధర్మః"** – సనాతనమైనది (శాశ్వతమైనది) మరియు ధర్మమును అయినదగుటచే దీనిని సనాతనధర్మమందురు. ఇది కర్మధారయ సమాసము.

సనాతనుడైన భగవానునిచేత స్థాపింపబడుటచేతనే దీనిని సనాతనధర్మ మనలేదు, ఇది స్వతః సనాతన మగుటచేతను దీనిని సనాతన ధర్మమనిరి. సనాతన ధర్మమునకు ఆద్యంతములు లేవు. ఇది సృష్టితో పాటు ఆవిర్భవించుచున్నది. సృష్టి యున్నంతవరకు ఇదియు నిలిచియే యుండును. ప్రళయకాలములో సహితము ఇది నశించుట లేదు. అపుడు గూడ ఇది బీజరూపములో ఉండి, మరల సృష్టి మొదలయినపుడు ఇది గూడ ప్రజలను సంరక్షించుటకున్ను, వారి నైతిక విలువలను పెంచుటకున్ను ఆవిర్భవించుచున్నది. సృష్టితో పాటు ఇదియు భ్రమించుచునే యుండును. అందువలన సనాతనధర్మమునకు ఆదియును, అంతమును లేదు. శాశ్వతమైనది.

అంతియే గాక, ప్రజల యొక్క నైతిక విలువలను పెంచుటకు కావలసిన ప్రబోధములను చేయుచున్నది. అందుచే ఇది ధర్మమును అయియున్నది. కాబట్టి, ఇది సనాతనము అయి యున్నది మరియు ధర్మమును అయి యున్నది. కనుక, దీనిని "సనాతన ధర్మ"మనిరి.

## మూడవ నిర్వచనము

ఇచట గూడ "సనాతన ధర్మము" కర్మధారయ సమాసములోనే చెప్పబడినది. కాని, "సనాతన"యను పదమునకు రెండవ నిర్వచనములో చెప్పినదానికంటే,కొంత విశేషమైన అర్థమును ప్రతిపాదించుట జరిగినది. ఇచట దీనిని ఈ క్రింది విధముగ నిర్వచించవచ్చును.

**"సదా భవః సనాతనః, సనాతనం కరోతి ఇతి సనాతనయతి! సనాతన యతీతి సనాతనః ! సనాతనశ్చాసౌ ధర్మశ్చ ఇతి సనాతన ధర్మః ।"** 'శాశ్వతముగా నిలిచి యుండునది సనాతనము, ఒక వ్యక్తిని సనాతనునిగా జేయునది గూడ సనాతనము, ఏదైతే సనాతనము మరియు ధర్మము అయియున్నదో అది సనాతన ధర్మము.

సనాతన ధర్మము, సనాతనుడైన భగవానునిచేత స్థాపింపబడిన దగుటయే గాక, తాను స్వతః సనాతనమగుటయు మరియు దానిని విశ్వసించి, ఆచరించిన వారిని 'సనాతనులను'గా గూడ జేయును -అనగ వారికి అమృతత్వమును ప్రసాదించును. ఇన్ని కారణములచే దీనిని "సనాతన ధర్మ"మనిరి.

ఇపుడు, సనాతన ధర్మము నాచరించువారికి ఏ విధమైన అమృతత్వము లభించును? అనిన ప్రశ్న ఉదయించును. దానికి సమాధానము నాల్గవ నిర్వచనము లో విపులీకరించబడినది.

## నాల్గవ నిర్వచనము

**"సనాతనయతి ఇతి సనాతనః"** 'సనాతనుని చేయును గాన సనాతన'మని పైన చెప్పబడినది. ఏవిధమైన సనాతనత్వమును ప్రసాదించును అనిన-ఆ విషయము ఇపుడు విపులముగా వివరించబడినది. "సనాతనయతి" అనిన పదమునకు అర్థము **"సనాతనం పరమాత్మ స్వరూపం ప్రాపయతి ఇతి"** అనగా పరమాత్మ స్వరూపమును పొందుటకు సనాతన ధర్మము మనకు సహకరించును.

త్రికరణశుద్ధితో సనాతన ధర్మము నాచరించు వ్యక్తులు ఆత్మ సాక్షాత్కారమును పొంది, పరమాత్మలో లీనమగుదురు. మోక్షమును బొందుదురు. ఇదియే సనాతన ధర్మము యొక్క గొప్పతనము. భారతదేశము ఆధ్యాత్మికముగ ఉచ్ఛస్థితిలో నుండుటకు ఇదియే కారణము.

భారతీయ సంస్కృతీ భవనము విదేశీయదాడులను ప్రతిఘటించి, ఈనాటికిని చెక్కుచెదరక, తన శోభను కోల్పోవక నిలిచియున్నదంటే, దానికి కారణము సనాతన ధర్మము వేసిన దృఢమైన, బలీయమైన పునాదులే.

సనాతనధర్మము శ్రుతి, స్మృతి, పురాణాలలో మహోన్నతమైన దైవీయ దృష్టితో దర్శనాత్మకముగా ప్రవచించిన సర్వధర్మ క్రోడీకరణ.

సనాతన ధర్మమునకు మూలాధారములను మనుస్మృతి ఈ క్రింది విధముగ సూచించుచున్నది.

**శ్లో ॥ వేదః స్మృతిః సదాచారః స్వ స్య చ ప్రియమాత్మనః ।**
**ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్ ॥**

(మను. **II**–12)

1) వేదములు, 2) స్మృతులు, 3) సాధుసంత్‌ల యొక్క ఆచార వ్యవహారములు, 4) ఆత్మకు ఆహ్లాదమును కలిగించు సత్కర్మలు – ఈ నాల్గు లక్షణములపై సనాతన ధర్మము ఆధారపడియున్నది.

## సనాతన ధర్మము జీవుడు తన ఉపాధిగతమైన పరిధులలో ఎలా ప్రవర్తిస్తే తరిస్తాడో బోధిస్తుంది.

సనాతన ధర్మము ముఖ్యముగా సత్యవాక్పరిపాలన, అహింసాపాలన, సత్ప్రవర్తన (సచ్ఛీలత), శాంతి, త్యాగము, దయ, క్షమించుట, ఇంద్రియ నిగ్రహము, పరోపకార పరాయణత, క్షమ (ఓర్పు లేక సహనము), ద్వేషరహితము, క్రోధరహితము, అస్తేయము (పరుల వస్తువులను దొంగిలించకుండుట), నీతి, నియమము, ధర్మతత్పరత మొదలగు దైవీ సంపత్తిని పెంపొందించుకొని, మానవుడు తన జీవితమును దివ్యమయ మొనర్చుకొని, జీవిత పరమ లక్ష్యమైన 'మోక్షమును' బడయుటకు కావలసిన ప్రేరణనిచ్చును.

దైవీ సంపత్తికి కావలసిన గుణములను శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో క్రింది విధముగా పేర్కొన్నాడు.

**శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥**

**శ్లో॥ అహింసా సత్య మక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునమ్।**
**దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్॥**

**శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత ! ॥ (16-1,2,3)**

'అర్జునా! అభయము, చిత్తశుద్ధి, జ్ఞానోపాయమునందు దృఢమగు నిష్ఠ, దానము, ఇంద్రియ నిగ్రహము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, సరళత, అహింస, సత్యవాక్పాలన, అక్రోధము, త్యాగము, శాంతస్వభావము, పరనిందను విడచుట, భూతదయ, లోభము లేకుండుట, మృదుత్వము, లజ్జ కలిగియుండుట, చాంచల్యము లేకుండుట, తేజస్సు, ఓర్పు, ధైర్యము, పరిశుభ్రత, వైరభావము లేకుండుట నిరభిమానిత్వము-ఈ గుణములన్నియు దైవీసంపదలో పుట్టినవానికి ఉండెడి లక్షణములు'.

మనుస్మృతి ధర్మము యొక్క ముఖ్యమైన పది లక్షణములను సూచించుచున్నది.

**శ్లో॥ ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచమింద్రియ నిగ్రహః ।**
**ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మ లక్షణమ్ ॥** (మను. **VI**-92)

'ఓర్పు, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియనిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము (క్రోధరహితము) ఇవి ధర్మము యొక్క పది లక్షణములు'.

సనాతన ధర్మము ప్రప్రథమముగా మనుష్యజన్మము యొక్క వైశిష్ట్యమును వేనోళ్ళ పొగడుచున్నది. మరియు ధర్మాచరణ చేత ఈ మానవజన్మను ఎలా సార్థకము చేసికొనవలయునో బోధించుచున్నది.

మనుష్యజన్మ అతి దుర్లభమైనదనియు, అది దైవకృప వలననే లభించుననియు సనాతన ధర్మము చాటుచున్నది.

**శ్లో॥ దుర్లభం త్రయమేవై తత్ దైవానుగ్రహ హేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥**

'మనుష్యత్వము, మోక్షమునందు కోరిక, మహాపురుషులనాశ్రయించుట - ఇవి మూడును లభించుట చాలాకష్టము. అవి దైవానుగ్రహం వలనగాని లభింపవు'. అందుచేత మానవజన్మను సార్థకము చేసికొనవలయును.

మానవుడు విషయభోగములను త్యజించి, దైవచింతనయందు నిమగ్నుడైయుండి, మోక్షమును బడయవలయునని సనాతనధర్మము నొక్కి వక్కాణించుచున్నది.

**"ఏహి తన కర ఫల విషయ న భా ఈ ।**
**స్వర్గఉ స్వల్ప అంత దుఃఖదాఈ" ॥ (తులసీదాసు)**

ఈ మనుష్యజన్మ విషయభోగముల ననుభవించుటకు మనకు లభించలేదు. ఈ జన్మ స్వర్గవాసుల కంటెను చాలా ప్రశస్తమైనది. స్వర్గవాసులు తమ సత్కర్మల యొక్క ఫలమును స్వల్పకాలము ననుభవించి, మరల మర్త్యలోకము (భూలోకము) నకు తిరిగి రావలసినదే (క్షీణే పుణ్యేమర్త్యలోకం విశంతి –గీత), కాని మానవుడు ధర్మాచరణ చేతను, తపస్సుచేతను మోక్షమును బడయుటకు అవకాశమున్నది. ఈ అవకాశము స్వర్గలోకవాసులకు గూడలేదు. వారియొక్క అంతిమదశ దుఃఖదాయకమైనది. కాబట్టి, మనుష్యజన్మ దేవతల కంటెను మిన్నయైనదని శ్రీతులసీ దాసు వెల్లడిచేయుచున్నాడు.

ఇదే విషయమును శ్రీకృష్ణ పరమాత్మ గూడ భగవద్గీతలో అర్జునునికి బోధించినాడు.

**శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।**
**ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః**
**గతాగతం కామకామా లభంతే ॥ (9–21)**

'వారు విశాలమగు స్వర్గసుఖము ననుభవించి, పుణ్యము క్షీణించినంతట మనుష్య లోకమున ప్రవేశింతురు. వేదత్రయ కర్మకాండను శరణుబొందు కామదాసులకు రాకపోకల యాతనలు తప్పవు'.

కాబట్టి, మానవుడు లౌకిక సుఖముల కొరకు కర్మకాండను శరణుబొందక, రాకపోకల యాతనల ననుభవింపక, అనన్య చింతనతో భగవానుని సేవించి, మోక్షమును బడయవలయునని సనాతనధర్మము బోధించుచున్నది.



## III. సనాతన ధర్మము యొక్క ప్రబోధములు

మనమిపుడు సనాతనధర్మము యొక్క ముఖ్యమైన కొన్ని ప్రబోధములను విచారించెదము.

### 1. సత్యవాక్పరిపాలన :-

1) "నహి సత్యాత్ పరో ధర్మః" - సత్యము కంటె ఉత్కృష్టమైన ధర్మము లేదు.

2) "సత్యం వద ధర్మంచర"- సత్యమును వచింపుము, ధర్మము నాచరింపుము

3) "సత్యమేవ జయతే నానృతమ్" - సత్యము మాత్రమే జయించును కాని, అసత్యము కాదు (అనగా అసత్యము జయించలేదు అని అర్థము)

పై నుదాహరించిన శ్రుతి వాక్యములను బట్టి సత్యవాక్పరిపాలన యొక్క ప్రాముఖ్యత మనకర్థమగుచున్నది.

సత్యము యొక్క ప్రాశస్త్యమును శ్రుతి ఇట్లు వర్ణించుచున్నది.

**మం॥ సత్యాన్నాస్తి పరో ధర్మః । సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ ।**
**సత్యేన వాయురావాతి । సత్యేనాదిత్యో రోచతే ।**
**దివి సత్యం వాచః ప్రతిష్ఠా । సత్యే సర్వం ప్రతిష్ఠితమ్ ।**
**సత్యేన న సువర్గా ల్లోకాత్ చ్యవంతే కదాచన ।**
**సతాగ్ంహి హి సత్యమ్ । తస్మాత్సత్యే రమంతే ।**

'సత్యమును మించిన ధర్మము లేదు. సత్యమే జ్ఞానము, అనంతమునైన బ్రహ్మ స్వరూపము. సత్యము వలననే వాయువు వీచుచున్నది. సత్యము వలననే సూర్యుడు ప్రకాశించుచున్నాడు. సత్యము వలననే వాక్కు శాశ్వతమగుచున్నది. సత్యమునందే సర్వజగత్తును సుప్రతిష్ఠమై యున్నది. సత్యము వలననే స్వర్గాదుల నుండి మానవులు ఎన్నడూచ్యుతులుగాకుందురు. సత్యమే శాశ్వతము. అందుచేతనే మహాత్ములు సత్యమునందే రమించుచున్నారు.'

కావున, సత్యమే సర్వశ్రేయంబైన ధర్మము. సత్యమే ఉత్కృష్టమైనది. శ్రేష్ఠమైనది కూడా.

సత్యము వేరు ధర్మము వేరు కాదు. ధర్మమే సత్యము లేక సత్యమే ధర్మము అని

వాటి యొక్క అద్వయ స్థితిని బృహదారణ్యకోపనిషత్తు సూచించుచున్నది **(యోవై ధర్మః స సత్యంవై తత్).** కాబట్టి, సత్యమును త్యజించిన ధర్మమునకు మనుగడ లేదు. ధర్మము వినా సత్యమునకు మనుగడ లేదు. ధర్మయుక్తమైన సత్యమే నిజమైన సత్యము.

సత్యవాక్పాలనను గురించి మనుస్మృతి ఈ క్రింది విధముగా ప్రవచించుచున్నది.

శ్లో॥ సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయాత్
న బ్రూయా త్సత్య మప్రియమ్ ।
ప్రియం చ నాఽనృతం బ్రూయాత్
ఏష ధర్మః సనాతనః ॥ (మను. **IV**-138)

'సత్యమునే పలుకుము; ప్రియమునే మాటాడుము. సత్యమైనను అప్రియమును పలుకకుము. ప్రియము గదా యని అనృతము నాడకుము. ఇదే సనాతన ధర్మము'.

కావున, సత్యమయినప్పటికి ఇతరులకు అప్రియమైన విషయమును వచింప వలదని శాస్త్ర నిర్ణయము.

సమాజమునకు కీడును సంభవింపజేయు సత్యమును, సత్యమైనప్పటికి దానిని వర్జింపవలయును. సమాజాభ్యుదయమునకు తోడ్పడుటలోనే సత్యం దాగి ఉంది. **(సత్ కళ్యాణ హితం సత్యం).** అంతియేగాని కేవలం ఉన్నది ఉన్నట్లు వచించుటయే సత్యం కాజాలదు. **(సత్యం సర్వహితం ప్రోక్తం యథార్థ కథనం న).**

ఇదే ఉద్దేశ్యమును శ్రీ కృష్ణపరమాత్మ కూడ భగవద్గీతలో దృఢపరచినాడు :

**శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥**

**(భ.గీ. 17-15)**

'మనము పలుకు వాక్యము సత్యమైనదియు, ప్రియమైనదియు మరియు హితకర మైనది (మేలు చేయునది)గా ఉండవలయును'.

## "సత్యభాషణం ఇతర ధర్మాలకు విరుద్ధంగా ఉండకూడదు"

ఉదాహరణకు : స్త్రీ రక్షణ, బ్రాహ్మణ రక్షణ, గోరక్షణ మానవ విధ్యుక్త ధర్మముగా వచింపబడుచున్నది. పైనుదాహరించిన వాటిలో దేనికైనను ముప్పు వాటిల్లినపుడు

దాని యొక్క రక్షణకై సత్యము నుల్లంఘించినప్పటికి తప్పులేదని మున్నుడి. కనుక, ధర్మసూత్రములు అతిసూక్ష్మములైనవి. దేశ కాలపరిస్థితిని బట్టి ధర్మమును నిర్ణయింప వలయును.

ఒక్కొక్క పరిస్థితిలో ధర్మమనుకొనినది అధర్మమగును. అధర్మమనుకొనినది ధర్మ మగును. కావున, అతిసూక్ష్మబుద్ధితో ఆలోచించినగాని ధర్మమును నిర్ణయింపలేము.

పై సత్యమును మనుస్మృతి క్రింది విధముగ సమర్థించుచున్నది:

**"యస్తర్కేణానుసన్ధత్తే స ధర్మం వేద నేతర ః "**

'తర్కము నుపయోగించి సూక్ష్మముగా ఆలోచించిన వ్యక్తి మాత్రమే ధర్మమును నిర్ణయింపగలడు, ఇతరులకు అది సాధ్యము కాదు' యని మను మహర్షి తెలియ జేయుచున్నాడు.

ఏమైనప్పటికి, భారతీయ సంస్కృతిలో సత్యవాక్పాలనకు ఉచ్ఛస్థాన మీయ బడినది. సత్యము కొరకే శ్రీరామచంద్రమూర్తి అనేక ఇక్కట్లు పాలవవలసివచ్చినది. ఎన్ని బాధలు పడవలసి వచ్చినప్పటికి శ్రీరాముడు సత్యాన్ని ధర్మాన్ని త్యజించలేదు. ఏనాడూ మర్యాదను తప్పలేదు. అందులకే **"రామో విగ్రహవాన్ ధర్మః"** 'రాముడు ధర్మ విగ్రహము' (అనగా ధర్మముతో పోతపోసిన విగ్రహము) లాంటివాడని ఖ్యాతిని బడసి, భారతీయులందరికి ఆదర్శమూర్తి అయినాడు. ఎన్ని బాధలు వచ్చినప్పటికి ధర్మపథములో ఎలా నడవాలో ప్రత్యక్షముగా చూపించిన ఆదర్శమూర్తి శ్రీరాముడు. భారతీయులు ఆయనను "ఆదర్శ పురుషోత్తముడు" అనియు "మర్యాద పురు షోత్తముడు" అనియు కొనియాడుచుందురు.

శ్రీ హరిశ్చంద్ర మహారాజు తాను రాజ్యమును కోల్పోయి, భార్యను, బిడ్డను విక్రయించి; తాను కాటికాపరి అయినప్పటికి సత్యమును వర్జించలేదు. మెడలోని మంగళసూత్రమును విక్రయించి కాటిశుల్కమును చెల్లింపమని తన భార్యను శాసించిన సత్యపరాక్రముడు. అటువంటి మహానీయులను కన్నభూమి భారతావని.

సత్యవాక్పాలన కొరకే బలిచక్రవర్తి తన సర్వస్వమును కోల్పోయినాడు. తన గురువు వారించినప్పటికి, గురువు యొక్క శాపమునకు గూడ వెరువక, సత్యమును పాలించి, శ్రీ మహావిష్ణువు యొక్క అనుగ్రహమునకు పాత్రుడైనాడు.

అలాగుననే, శిబి చక్రవర్తి, రాజా రంతిదేవుడు మొదలగు అనేకమంది మహా పురుషులు సత్యవాక్పాలనను పాటించి, మన చరిత్రలో వన్నెకెక్కినారు. ఇదియే సనాతన ధర్మము యొక్క ఘనత.

సత్యవ్రతుడైన మహాపురుషుడు ఎలా ప్రవర్తించాలి అనిన విషయమును గురించి సనాతన ధర్మము ఈ క్రింది విధముగా చెప్పుచున్నది :

**"మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మానామ్"**

'మహాపురుషులు మనో వాక్కాయ కర్మలలో ఏకరూపులుగా ఉంటారు'.

ఈ సత్యమునే ఈ క్రింది సూక్తి గూడ విశదీకరించుచున్నది :

**శ్లో ॥దన్తి దన్త సమానం హి నిః సృతం మహతాం వచః ।**
**కూర్మగ్రీవేవ నీచానాం పునరాయాతి యాతి చ ॥**

మహాత్ములు ఒక మాట అన్నారంటే ఆ మాట మీదే నిలబడతారు. వారిలో రెండు నాల్కల ధోరణి ఉండదు. ఏనుగుదంతం ఒకసారి ఉద్భవించిందంటే మరల లోపలకు వెళ్ళదు. తాబేలు మెడ అలా కాదు. అది ఎన్నిసారులైనా వెలుపలికి వచ్చి, మళ్లీ లోపలికి వెళ్ళిపోతుంది. నీచ మానవుల స్థితి తాబేలు వలె ఉంటుంది. వారు ఒక మాట చెప్పి దాని వలన ప్రయోజనం లేదనుకుంటే మళ్ళీ మాటను ఉపసంహరించుకొంటారు.

**"సత్యాన్ని మించిన కర్తవ్యం లేదు; అసత్యాన్ని మించిన నికృష్టమైన పాపం లేదు"** అని శ్రీ స్వామి వివేకానంద అంటారు

"సత్యవ్రతుడైన యోగి ఏ కర్మల నాచరించకపోయినా, కోరిన కర్మఫలాలను పొందే శక్తిగలవాడై ఉంటాడు" అని శ్రీ పతంజలి మహర్షి యోగ సూత్రములలో సూచించినాడు.

**"సత్య ప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వమ్" (ప.యో.సూ.2-36)**

ఒక సందర్భములో శ్రీరామచంద్రుడు ధర్మము యొక్క ప్రాముఖ్యతను మరియు సత్యధర్మములకు గల అవినాభావ సంబంధమును చక్కగా నుడివినాడు.

**"ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్"**

'లోకములో ధర్మమే శ్రేష్ఠమైనది. సత్యం ధర్మములోనే ప్రతిష్ఠితమై యున్నది.

సత్యము యొక్క ప్రాశస్త్యమును సనాతనధర్మము ఎంత చక్కగా వర్ణించినదో గమనింపుడు.

**శ్లో॥ సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితం సదా।**
**సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరంపదమ్ ॥**

లోకమున పాలిస్తున్న ప్రభువు సత్యమే. సత్యము ఎచట ఉండునో అచట లక్ష్మి (ఐశ్వర్యము) ఉండును. లక్ష్మి ఎల్లప్పుడు సత్యాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. అన్నిటికీ సత్యమే మూలం. సత్యానికి మించిన పరమపదం లేదు'.

**"ఆచారః పరమో ధర్మః" – (మనుస్మృతి I-108)**

'సదాచారమే ఉత్కృష్టమైన ధర్మం' అని మను మహర్షి వచనం. కావున, మానవులందరు సదాచార సంపన్నులై, సత్యవాక్పాలనా దక్షులై పరమపదమును పొందుదురు గాక!

## 2. అహింసా పాలన :-

'అహింస' యను పదమునకు నిర్వచనమును విచారించెదము.

1) **"అహింసా అపీడా ప్రాణినాం"** – 'జీవులకు ఏవిధమైన కష్టమును (పీడను) కలిగించకపోవడమే అహింస' యని శ్రీశంకర భగవత్పాదులు నిర్వచించిరి.

2) **"సర్వభూతేభ్యోఽభయం అహింసా"** – ఏ జీవికీ భయం గాని, బాధగాని కలిగించననే అభయ ప్రదానము అహింస' యని మరియొక నిర్వచనం.

సనాతన ధర్మము "అహింసా పరమో ధర్మః" 'ఏ ప్రాణినైనను మనోవాక్కాయ కర్మల ద్వారా ఏవిధముగను హింసించకుండుటయే మానవుని యొక్క పరమధర్మము' అని బోధించుచున్నది.

శ్రీ వ్యాస మహర్షి అహింస యొక్క శ్రేష్ఠత్వమును మహాభారతములో ఇట్లు వర్ణించినారు :

**శ్లో॥ అహింసా పరమోధర్మ స్తథాఽహింసా పరం తపః ।**
**అహింసా పరమం జ్ఞాన మహింసా పరమార్జవమ్ ॥**

'అహింస పరమశ్రేష్ఠమగు ధర్మము, అహింస పరమశ్రేష్ఠమగు తపస్సు, అహింస పరమశ్రేష్ఠమగు జ్ఞానము, అహింస పరమ శ్రేష్ఠమగు ఋజుత్వము'.

భగవానునికి అతిప్రీతికరమైన అష్టపుష్పములలోగూడ 'అహింస'కు ప్రథమ స్థానమీయబడినది. భక్తిమార్గంలో మానసిక పూజ విశిష్టమైనది. ఈ పూజలో అష్టభావనా సుమాలతో భగవానుని అర్చిస్తారు. ఆ అష్టపుష్పాలు ఇవే.

**శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం పుష్పమిన్ద్రియ నిగ్రహః**
**సర్వభూతదయా పుష్పం క్షమాపుష్పం విశేషతః ।**
**శాంతిపుష్పం తపఃపుష్పం ధ్యానపుష్పం తథైవచ**
**సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥**

కావున, అహింసాపాలన సర్వోత్కృష్టమైన విధ్యుక్తధర్మముగా గణింపబడుచున్నది.

'అహింస' యొక్క ప్రాముఖ్యతను ప్రజల దృష్టికి తెచ్చి, ప్రపంచవ్యాప్తముగా జనులందరు దానిని పాటించునట్లు చేయుటకే ధర్మప్రచారము జరుగుతుందని శ్రీవ్యాస భగవానుడు మహాభారతములో పేర్కొన్నాడు.

**శ్లో॥ అహింసార్థాయ భూతానాం ధర్మప్రవచనం కృతమ్ ।**
**యస్మాత్ అహింసా సంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః ॥**
**(శాంతి పర్వం. 109-15)**

'లోకములోని సమస్తజీవులు హింసింపబడకుండా ఉండుట కొరకే ధర్మప్రచారం చేయబడుతుంది. అహింసను ఇముడ్చుకొన్న సత్యమే ధర్మము. ఇది నిశ్చయము'.

శ్రీ పతంజలి మహర్షి అహింసావ్రతులైన మహాత్ముల సాన్నిధ్యములో శత్రుత్వమును వీడి అన్ని ప్రాణులు హింసారాహిత్యంగా, శాంతంగా మనుగడ సాగిస్తాయని యోగ సూత్రములలో సూచించినారు.

**"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" (ప.యో.సూ.2-35)**

ఉదాహరణకు : శివ కుటుంబమును గురించి విచారింతుము. పాము, మయూరం, వృషభం, మూషికం -వాటి సహజ వైరమును మరచి, భయ ద్వేషాదులను వీడి శివుని సాన్నిధ్యములో ప్రశాంతంగా, హింసారాహిత్యంగా జీవనమును సాగిస్తున్నాయి. ఇదియే శివ కుటుంబము యొక్క ప్రత్యేకత, వైభవం.

దర్శనోపనిషత్తు, అహింసను మరియొక కోణములో దర్శించి, వేదాంతపరంగా నిర్వచించినది.

**"ఆత్మా సర్వగతోఽచ్ఛేద్యః నగ్రాహ్యః ఇతి యా మతిః సా చా హింసా"**

'ఆత్మ సర్వవ్యాపకమైనది, ఛేదింపరానిది, అగ్రాహ్యామైనది అను భావనను కలిగియుండుటయే శ్రేష్ఠమైన అహింస' యని వేదాంతులు నిర్వచించినారు.

అనగా, ఆత్మ సర్వవ్యాపకమైనదను భావనను కలిగియుండమని శ్రుతి బోధించు చున్నది. ఈ భావనను కలిగియున్న వ్యక్తి తనలో ఉన్న ఆత్మయే సర్వజీవులలో ఉన్నదను భావనను కలిగియుండును. ఆ భావనను కలిగియున్న వ్యక్తి ఏ ప్రాణిని హింసించలేదు. కనుక, ఆ వ్యక్తి అహింసా ధర్మమును పాటించును.

కావున, లోకములోని మానవులందరు పరమధర్మమైన 'అహింస'ను పాటించి, తరింతురు గాక!

## 3. పరోపకార పరాయణత :-

సనాతన ధర్మము పరోపకారమును గురించి ఏమి చెప్పుచున్నదో విచారించెదము.

ఒకప్పుడు భగవాన్ శ్రీ వ్యాసమహర్షిని "ఓ మహనీయా! నీవు వేదవిభజన గావించి ప్రచారము చేసినావు, అష్టాదశ పురాణములు రచించినావు, మహా భారతమును రచించి నావు, వీటన్నిటి యొక్క సారాంశమేమి?" యని ప్రశ్నించగా, ఆయన "పరోపకారమే ఉత్కృష్టమగు పుణ్యము, పరపీడనమే (పరులను హింసించుటయే) నికృష్టమగు పాపము- ఇదియే వాటన్నిటి యొక్క సారము" యని సమాధానమిచ్చినాడట.

**శ్లో॥ అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయమ్ ।**
**పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥**

కావున, పరోపకారమునకు మించిన ధర్మము లేదు. సనాతన ధర్మములో పరోప కారమునకు అతి ముఖ్యమైన స్థానమీయబడినది.

**"పరోపకారార్థ మిదం శరీరమ్"** అని శ్రుతివాక్యము. 'పరులకు ఉపకారము చేయుటకే మానవునికి ఈ శరీరము లభించినది' యని సనాతన ధర్మము బోధించు చున్నది.

మరియు, ఎవరి శక్తి కొలది వారు ఉపకారంతో పరులకు సహకరించవలయు ననియు, అదియే మనుష్యజీవన పరమార్థమనియు సనాతన ధర్మము ప్రవచించుచున్నది.

28657



శ్లో॥ పరోపకారః కర్తవ్యః ప్రాణైరపి ధనైరపి ।
పరోపకారజం పుణ్యం న స్యాత్ క్రతు శతైరపి ॥

'ప్రాణములను త్యజించియైనను, ధనమును వ్యయము చేసియైనను పరోపకారము చేయుటయే మానవ విధ్యుక్త కర్తవ్యం. పరోపకారము వలన లభించిన పుణ్యముతో వందలాది యజ్ఞములు గూడ సరితూగవు'.

శ్లో॥ సోదరాణాం మానవానాం హితకారి చ సద్వచః ।
ఉక్త్వా సంసేవ్య తద్దుఃఖం యావచ్ఛక్యపనోదయ ॥

'సోదర మానవులకు హితకరములైన సేవలను చేయుచు, నీ శక్తికొలది వారికి దుఃఖోపశమనమును గావింపవలయును'

శ్లో॥ స్వసుఖంతు పరిత్యజ్య అన్యాంస్తు సుఖయే త్సదా ।
ప్రజాహిత కరాణ్యేవ సత్కార్యాణి సమాచరేత్ ॥

'స్వసుఖమును (తన సుఖమును) త్యజించియైనను సర్వదా పరోపకారమును జేయవలయును. ప్రజాహితకరములైన సత్కార్యములను ఎల్లప్పుడు ఆచరించ వలయును అని సనాతన ధర్మము బోధించుచున్నది.

శ్లో॥ హే బాల! లోక సేవార్థం కృత్స్నం త్వజ్జీవితం సదా ।
అర్పయిత్వా చ హర్షేణ సార్థకం కురు యత్నతః ॥

'హే మానవ! ఎల్లప్పుడు పరోపకారార్థము నీ జీవితమునంతటిని సంతోషముతో నర్పించి, ప్రయత్నపూర్వకముగ నీ జీవితమును సార్థకము జేసికొనుము'.

ఇచట రెండుపదములు–'సంతోషముతో' మరియు 'ప్రయత్నపూర్వకముగా' జాగ్రత్తగా గమనించదగినవి. పరోపకారమును ఏదో బలాత్కారము చేత చేసినట్లుగా కాక, సంతోషముతో చేయవలయునని మొదటి పదము సూచించుచున్నది. ఏదో అవకాశము దొరికితే చేస్తామన్నట్లుగాక, ప్రయత్నము ద్వారా అవకాశమును కల్పింపచేసికొని ధార్మిక కార్యములను ఆచరించి, జీవితమును సార్థకము జేసికొన వలయునని రెండవ పదము తెలియజేయుచున్నది. మన సనాతన ధర్మము బోధించుచున్న ఎంత ఉత్కృష్టమైన భావన ఇది!

**శ్లో॥ దీనా ననాథాన్ సేవస్వ హిత్వా ప్రతిఫలం సదా।**

**త్యక్త్వా త్వం స్వార్థచింతాంచ ప్రాణినాం సుఖదం కురు॥**

'దీనులను, దిక్కులేనివారిని ఎల్లవేళల ప్రతిఫలాపేక్ష లేక సేవింపుము. స్వార్థత్వమును త్యజించి ప్రాణులకు సుఖమును కలుగజేయుము' అని సనాతన ధర్మము బోధించుచున్నది.

**"శాన్తో మహాన్తో నివసన్తి సన్తో వసంతవ ల్లోకహితం చరన్తః"**

**-శ్రీ ఆదిశంకరాచార్య**

'శాంతస్వభావులు, మహాత్ములు అయిన సంతపురుషులు వసంత ఋతువులాగ లోకానికి ఉపకారం చేస్తూ చరిస్తారు' అని శ్రీ శంకర భగవత్పాదులు అంటారు.

ప్రకృతిలోని ప్రతీది పరోపకారమునే ధ్యేయముగా నెంచి చరిస్తున్నది. సూర్యుడు మానవులకు వెలుగు నిస్తున్నాడు. చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. చెట్లు నీడను, ఫలాల నిస్తున్నాయి. పొదలు పూలనిస్తున్నాయి. మేఘాలు వర్షాన్నిస్తున్నాయి. ఇంకా ఎన్నో...ఎన్నో ఉపకారములు చేస్తున్నాయి.

ఇవియన్నియు ప్రతిఫలాపేక్ష లేకుండానే మానవులకు ఉపకారము చేయుచున్నవి. మానవుడు వాటిని చూచియైనను నేర్చుకొనవలయును.

కావున, ప్రతి మానవుడు పరోపకార పరాయణుడై చరించి, తరించు గాక!

## 4. క్షమ :-

క్షమ యనగా ఓర్పు లేక సహనము. కష్ట, నష్టములను గాని, పరుషవాక్యములను గాని సహించుటయే క్షమయందురు.

క్షమ యొక్క విశిష్టతను సనాతన ధర్మము ఎంత చక్కగా వర్ణించినదో గమనింపుడు.

**శ్లో॥ నరస్యాభరణం రూపం రూపస్యాభరణం గుణః।**

**గుణస్యాభరణం జ్ఞానం జ్ఞానస్యాభరణం క్షమా॥**

'మానవుని యొక్క ఆభరణము రూపము. రూపము యొక్క ఆభరణము గుణము. గుణము యొక్క ఆభరణము జ్ఞానము. జ్ఞానము యొక్క ఆభరణము క్షమ'.

మానవునికి రూప, గుణ, జ్ఞానముల కంటెను క్షమయే ఉత్కృష్టమైన ఆభరణమని

పై శ్లోకము చెప్పుచున్నది. మానవుడు రూప,గుణ, జ్ఞానములు కలిగియున్నప్పటికి క్షమ లేని యెడల శోభింపజాలడు. సత్పురుషులు క్షమను తమ సహజ స్వభావముగ కలిగియుందురు. కావున, క్షమ ఉత్తమోత్తమమైన మరియు వాంఛనీయమైన సద్గుణము.

క్షమవలన లభించు లాభమును ఈ క్రింది శ్లోకము చక్కగా సూచించుచున్నది.

**శ్లో॥ క్షమా సత్యం కరేయస్య దుర్జనః కిం కరిష్యతి ।**
**అతృణే పతితో వహ్నిః స్వయమేవోప శామ్యతి ॥**

'సహనము అనే ఖడ్గమును ఎవరు చేతియందు ధరింతురో వారిని దుర్జను డేమియు చేయజాలడు. అదెట్లనగా, గడ్డిలేనిచోట పడిన అగ్ని దానంతటదియే శమియించు (ఆరిపోవు) చున్నది గదా !'

ఇచట క్షమ యొక్క లాభమును చక్కని ఉపమానముతో విశదీకరించుట జరిగినది. అగ్ని పడినచోట గడ్డి ఉన్నయెడల అది రగుల్కొని, పెద్దమంటగా తయారగును. అచట గడ్డియే లేనపుడు అగ్ని ఏమి చేయగలదు? దానంతటదియే ఆరిపోవును. అలాగుననే, దుర్జనుడు కష్టనష్టములు కలిగించినపుడు గాని, పరుషవాక్యము లాడినపుడుగాని, రెండవవ్యక్తి మారు మాటాడక సహించినయెడల ఆ దుర్జనుడు తనంతట తానే శాంతించును. అటులగాక, రెండవ వ్యక్తి కలహించిన యెడల, వైరము లేక శత్రుత్వము పెరిగి విపత్కర పరిణామములకు దారితీయును. కనుక క్షమ (సహనము) చాలా అవసరము.

**శ్లో॥ సద్గుణేషు చ సర్వేషు క్షమా శ్రేష్ఠతమా మతా।**
**ఆదర్శదేవతా ప్రోక్తా క్షమాయాం భూమి రేవ హి॥**

'సద్గుణములన్నింటిలో క్షమ (సహనము) శ్రేష్ఠతమమైనదని పెద్దలు చెప్పుదురు. క్షమయందు భూమి ఆదర్శదేవతయని చెప్పబడినది'.

సహనమునందు భూమాతకు మించినవారు లేరు. మనము భూగర్భమును చీల్చి బంగారము, వెండి, బొగ్గు, గంధకము మొదలగు అనేక ఖనిజములను పొందు చున్నాము. భూమిలో అగాధమైన బావులు త్రవ్వి పెట్రోలు, డీజలు, కిరోసిన్ మొదలగు ఇంధనములను తీయుచున్నాము. నీటి కొరకు భూ గర్భములోనికి గొట్టములను

దింపుచున్నాము. రైతు నాగలితో దుక్కి దున్ని భూగర్భమును చీల్చుచున్నాడు. మనము ఎన్నివిధములుగ బాధించినప్పటికిని భూమాత నుండి ఏవిధమైన ఫిర్యాదు లేదు. కావున, మానవులు భూమాతను ఆదర్శప్రాయముగా తీసికొని, సహనశీలురై ప్రవర్తించవలయునని సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

**శ్లో॥ సర్వాణి కష్టకార్యాణి క్షమావాన్ సాధయే త్స్వయమ్ ।**
**క్షమావాన్ లోకపూజ్యస్స్యాత్ కీర్తిం విందతి శాశ్వతమ్ ॥**

'సహనము గలవాడు ఎంతటి కష్టకార్యములనైన స్వయముగ సాధించి తీరగలడు. సహనవంతుడు లోక ప్రజలచేత పూజింపబడి, శాశ్వతమైన కీర్తిని బడయగలడు'.

ఈనాడు మానవుడు సాధించిన భౌతికశాస్త్రాభివృద్ధికి 'క్షమ'యే కారణమై యున్నది. భౌతికశాస్త్రజ్ఞులు పరిశోధన చేయునపుడు అనేకసార్లు విఫలురయి నప్పటికి, వారు ఓర్పును కోల్పోవక, పరిశోధనలు సాగించుచునే యుందురు. వారు అనేక కష్టనష్టముల కోర్చి, సహనశీలురై పరిశ్రమించుట వలననే, ఈనాటి మానవులు అనేక విధములైన సౌకర్యములను అనుభవించగలుగుచున్నారు.

కావున, సహనము మానవునకు అతిముఖ్యమైన ఆభరణము.

**శ్లో॥ సాధనేషు చ కష్టేషు చేష్టాసు వచనేషు చ।**
**క్షమా సాక్షా చ్చ దృశ్యేత కృచ్ఛ్రేణాపి క్షమాం భజ ॥**

'ఓర్పు (సహనము) సాధనలయందును, కష్టములయందును, చేతలయందును (పనులు జేయునపుడు), మాటలయందును ప్రత్యక్షముగ కనపడవలెను. కావున, కష్టించియైనను 'సహనమును సాధింపుము' అని సనాతన ధర్మము ప్రబోధించు చున్నది.

**క్షమయా ప్రాప్యతే లోకాన్ బ్రహ్మణః సమనంతరాన్"**

**(మహాభారతం.1-42.10)**

'ఓర్పు (సహనము) ఉన్నవానికే ఈలోకం, పరలోకం రెండును సిద్ధించును' అని శ్రీవ్యాస మహర్షి మహాభారతములో నుడివినాడు.

కావున, మానవులందరు సహనశీలురై ప్రవర్తించుచు, తరింతురు గాక!

## 5. సుశీలము లేక సచ్ఛీలము లేక సౌశీల్యము

సచ్ఛీలము యొక్క ఆవశ్యకతను, దానివలన మానవునికి కలుగు ప్రయోజనములను గురించి సనాతన ధర్మము క్రింది విధముగా బోధించుచున్నది.

**శ్లో॥ సర్వథా మానవం శీలం రక్షత్యేవ న సంశయః ।**
**శీలహీనో నరో నస్యా ద్దానవశ్చేతి కథ్యతే ॥**

'సచ్ఛీలము (సత్ప్రవర్తన) మానవుని అన్నివిధముల తప్పక రక్షించును. దానిలో సంశయమేమియు లేదు. సత్ప్రవర్తన లేని మానవుడు మానవుడెన్నటికి కానేరడు. వాడు రాక్షసుడని చెప్పబడుచున్నాడు'.

శీలము కలిగిన వ్యక్తి ఓర్పు, దయ, శాంతము,వినయము, భక్తి, పెద్దలయెడ గౌరవము, అహింస, మానసిక సంతులనము, నిగర్వము, హృదయ నిర్మలత, సద్భావము, ఇంద్రియ నిగ్రహము, తృప్తి, ధీరత్వము, దృఢత్వము, సదాచారము మొదలగు సద్గుణములను కలిగియుండును.

శీలహీనుడు పై గుణములకు వ్యతిరిక్తములైన దుర్గుణములను కలిగియుండును.

సచ్ఛీలము వలన కలుగు ప్రయోజనములను క్రింది సూక్తి తెలుపుచున్నది.

**శ్లో॥ సుఖం లాభశ్చ కీర్తిశ్చ శాంతిః జర్జ్ఞానం తథైవ చ।**
**త్యాగో దైవానుగ్రహశ్చ సత్ప్రవర్తనయా భవేత్ ॥**

'సత్ప్రవర్తన వలన సుఖము, లాభము, కీర్తి, శాంతి, జ్ఞానము, త్యాగము, దైవానుగ్రహము కలుగును'.

శ్రీమద్రామాయణములోని కొన్ని పాత్రలు సౌశీల్యమునకు మచ్చుతునకలు.

శ్రీరాముడు పితృవాక్యపరిపాలనకై పదునాల్గు సంవత్సరములు వనవాసము చేయుట, తనకు సంక్రమించవలసిన రాజ్యాధికారాన్ని రాకుండా అడ్డుపడిన కైకేయిని సహితం ఆప్యాయతతో పలుకరించి, తన శ్రేయోభిలాషిగా భావించడం, ఏకపత్నీవ్రతుడై పరస్త్రీని కన్నెత్తియైనను చూడకుండుట, యుద్ధానంతరము సీతతో పాటు వానరబలాన్ని కూడ అయోధ్యకు తీసికొని వెళ్ళి, ఉచితరీతిని గౌరవించి, సన్మానించి, కానుకలు సమర్పించి ఆదర్శ స్నేహశీలమును ప్రదర్శించుట-ఇవి యన్నియు శ్రీరాముని సౌశీల్యమునకు తార్కాణములు.

శ్రీరాముని సౌశీల్యము యెడల శత్రువులకు సహితం అత్యున్నతమైన విశ్వాసం, గౌరవం ఉండేవి. మేఘనాథుని మరణానంతరము, అతని భార్య సులోచన సహ గమనము చేయదలంచినది. కాని, శవం యుద్ధభూమిలో ఉండిపోయినది. శత్రు శిబిరానికి వెళ్ళి శవమును తెచ్చికొనుట కొఱకు, ఆమె ఒంటరిగా వెళ్ళుటకు సంకోచిస్తుంది, సంశయిస్తుంది. అపుడు రావణుడు పూర్తి విశ్వాసంతో, ఆత్మస్థైర్యముతో ఇలా అంటాడు. "బాల బ్రహ్మచారి హనుమంతుడు, జితేంద్రియుడు లక్ష్మణుడు, ఏకపత్నీవ్రతుడు శ్రీరాముడు ఉన్నచోటుకి నీవు నిర్భయముగా వెళ్ళవచ్చును". అపుడు మంత్రులు "శ్రీరాముని భార్యను బలవంతముగ మీరు తెచ్చారే? అలాంటి రాముని వద్దకు సులోచన ఒంటరిగా వెళ్ళుట ఉచితమా"? యని శంకను వెల్లడిస్తారు. అపుడు రావణుడు "పర స్త్రీని అవమానించుట రాక్షసుల పని; రాముని పనికాదు" అని ప్రశంసాపూర్వకముగా చెపుతాడు. దీనినిబట్టి శ్రీరాముని శీలం యెడల శత్రువులకు సహితం ఎటువంటి సద్భావం, విశ్వాసం ఉండేదో అర్థమగుచున్నది. పరస్త్రీలను తన స్వంత సోదరీమణులుగా భావింప గలిగిన శీలసంపత్తిని సంపాదించిన ఉత్తమ పురుషుడు శ్రీరాముడు.

సీతాదేవిని అడవులకు పంపిన పిమ్మట శ్రీరాముడు అశ్వమేథయాగం చేయ నిర్ణయించుతాడు. ఈ యాగమును సతీసమేతముగా చేయవలయును. అటువంటి సంకట పరిస్థితిలో కూడ ద్వితీయ పత్నిని పరిగ్రహించడానికి అంగీకరించని శ్రీరాముడు సువర్ణ సీతామూర్తిని ప్రక్కన పెట్టుకొని యాగం పూర్తిచేస్తాడు. ఆనాటి సమాజంలో బహు భార్యాత్వం సర్వసాధారణమయినది. అటువంటి సమాజ పరిస్థితులలో కూడ శ్రీరాముడు ఏకపత్నీవ్రతాన్ని వదలలేదు. ఈ సంఘటన శ్రీరాముని సచ్ఛీలమును ఇనుమడింపచేస్తున్నది.

లక్ష్మణుడు సచ్ఛీలములో శ్రీరాముని కెట్టి విధముగను తీసిపోడు. అయోధ్యలో పండ్రెండు సంవత్సరములు, అరణ్యములో పదమూడు సంవత్సరములు సీతా రాముల సహచరుడుగా ఉండియు, సీతాదేవి యొక్క మోమును లక్ష్మణుడు చూచి యెఱుగడు. స్వంత వదినయొక్క మోమును గూడ కన్నెత్తి చూడని సౌశీల్య సంపన్నుడు లక్ష్మణుడు. ఇక పరస్త్రీల విషయములో వేరే చెప్పవలయునా!

పై విషయము, ఋష్యమూక పర్వతముపై సీతాదేవి వదిలిన నగలమూటను పరీక్షించమని శ్రీరాముడు లక్ష్మణుని ఆదేశించినపుడు, లక్ష్మణుడిచ్చిన సమాధానమును బట్టి వెల్లడియగుచున్నది.

మరియొక సంఘటన గూడ లక్ష్మణుని సౌశీల్యమును ఋజువు చేయుచున్నది. శ్రీరాముని ఆజ్ఞానుసారము సీతాదేవిని అడవిలో వదిలి, తిరిగి వెళ్ళనున్న లక్ష్మణునితో "నాయనా! నీ అన్న నన్ను విడిచినందులకు నాకు ఆయనపై ఎట్టి కోపమును లేదు. నా యొక్క శీలమును తెలిసియు, లోకాపవాదమును భరించలేక ఈ విధముగా చేసినాడు. ప్రాణముల త్యజించియైనను భార్య భర్తయొక్క ఆశయమును నెర వేర్చవలెను. నా శరీరమును గురించి నేను బాధ పడుట లేదు. కాని గర్భవతియగు నన్ను చూచి, నీవు విడిచి వెళ్ళకుము" అని సీతాదేవి దీనురాలై పలుకగా, లక్ష్మణుడు హృదయము బ్రద్ధలయినట్లు బాధపడి, కుమిలి కుమిలి ఏడ్చి, చివరికి దుఃఖమును దిగమ్రింగి ఇట్లు చెప్పెను.

**శ్లో॥ దృష్ట పూర్వం నతే రూపం పాదౌ దృష్ట్వా తవానఘే ।**
**కథ మత్రహి పశ్యామి రామేణ రహితాం వనే ॥**

'ఓ పూజ్యురాలా! ఇదివరకు యెన్నడును నీ పాదములను తప్ప రూపమును చూచి ఎరుగను. ఇప్పుడు రాముడు ప్రక్కన లేని సమయమున నిన్ను నేనెట్లు చూడగలను?'

పై సంఘటనలను బట్టి లక్ష్మణుని శీల సంపదను మనమర్ధము చేసికొన వచ్చును. పరస్త్రీలను కన్నెత్తియయినా చూడని ఉత్తమ శీలసంపన్నుడు లక్ష్మణుడు. శీలము ఉండవలసినది ఒక్క స్త్రీలకే కాదు, పురుషులకు కూడ అత్యవసరమని లోకమునకు చాటిన ఆదర్శమూర్తులు రామలక్ష్మణులు.

సీతాదేవి యొక్క శీలము కూడ ప్రశంసనీయమైనది. "భర్త లేని స్వర్గసుఖముల కంటే, భర్తతో అరణ్యవాస దుఃఖమే మేలు" యని చెప్పి, భర్త వెంట అరణ్యములకు వెళ్ళిన శీలవతి సీతాదేవి.

అశోకవనములో రాక్షస స్త్రీలు కలిగించిన బాధలకోర్చి, వారి మాయాజాలాలకు మోసపోక, రావణుని బెదిరింపులకు లొంగక, పన్నెండు నెలలపాటు యమయాతనల ననుభవించియైననూ, తన 'శీలాన్ని' కాపాడుకున్న మహాసాధ్వి సీతాదేవి. ఎన్ని కష్టము లొచ్చినను వాటిని ఎదిరించి పోరాడగల ఆత్మబలం, నైతికశక్తి స్త్రీలకు కలదని ఋజువు చేసింది సీతాదేవి. సౌశీల్యమనే మహాశక్తిని గలిగియున్నవారు భౌతికశక్తికి తలవంచ నవసరం లేదని ప్రపంచానికి చాటిచెప్పినది సీతాదేవి.

యుద్ధానంతరం, సీతాదేవిని బాధించిన రాక్షస స్త్రీలను హనుమంతుడు ప్రతీకారముగా తుదముట్టింపబూనగా, రాజసేవాతత్పరులైన ఆ భృత్యుల తప్పులేదనియు ప్రభువుని కోల్పోయి నిస్సహాయులై యున్న ఆ దాసీజనుల శిక్షించుట తగదనియు హనుమంతుని వారించి, శత్రువులయందు సహితం ఆమె చూపిన దయ, కరుణ సీతాదేవి యొక్క సౌశీల్యమును చాటుచున్నవి.

శ్రీరాముడు పెట్టిన అగ్నిపరీక్షలో గూడ విజయమును పొంది తన శీలమును ఋజువు చేసింది సీతాదేవి.

కావున, శీలమే జీవునికి అలంకారము. సౌశీల్యమే ధనం. సదాచారమే సంపద. ప్రతి జీవికి 'శీలం' ప్రాణాధారం. శీలం లేని శక్తి నిష్ప్రయోజనమని రావణాసురుని విషయంలో ఋజువైనది. శీలం లేని మానవుడు అప్రతిష్ఠపాలవుతాడు. శీలరహితుడు సమాజం పాలిట చీడపురుగు. శీలముపైననే సమస్తమూ ఆధారపడి యున్నది.

సీతారామ లక్ష్మణుల వలె ప్రతి వ్యక్తి శీలసంపన్నుడై ఉండాలని సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

సచ్ఛీలము వలన ఇహలోక సుఖము, పరలోక సద్గతి లభించును. కావున మానవులు శీలమును గలిగియుండి పరమ పదమును బడయుదురు గాక!

### 6. శాంతి :-

శాంతి, త్యాగము, దయ- ఈ మూడును దైవీసంపత్తిలో ఉత్కృష్టమైన స్థానము నలంకరించుకొని యున్నవి. ఇవి మానవునికి అత్యంత వాంఛనీయమైన సద్గుణములని సనాతన ధర్మము నుడువుచున్నది.

**శ్లో॥ శాంతి స్త్యాగో దయాచేతి మానవానాం త్రయ స్సదా ।**
**అతీవ ముఖ్యనియమాః భవేయు రితి నిశ్చయః ॥**

'శాంతి, త్యాగము, దయ-ఈ మూడును మానవుడు ఎల్లప్పుడు పాటింపదగిన అతి ముఖ్యమైన నియమములై యున్నవి. ఇది నిశ్చయము'.

శాంతచిత్తుడు సమస్త దుఃఖములను ఓర్పుతో భరించి, స్థిరత్వమును పొంద గలడని కృష్ణపరమాత్మ గీతలో బోధించినాడు.

**శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోప జాయతే ।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ (2-65)**

'ప్రసన్నత్వము (శాంతము) వలన సమస్త దుఃఖములు నశించిపోవును. ప్రసన్న చిత్తుని (శాంతచిత్తుని) యొక్క బుద్ధికి సత్వరమే స్థిరత్వ మేర్పడును.

మనస్సుయొక్క ఆందోళనయే దుఃఖమునకు కారణము, మరేమియు కాదు. మనస్సు ఎక్కువ కలవరపడిన యెడల ఎక్కువ దుఃఖము కలుగును. మనస్సు నిర్మలముగాను, ప్రసన్నముగా (శాంతముగా) నున్నయెడల ఆనందము కలుగును. కాబట్టి, అంతర్యము శాంతముగాను, స్థిరముగా నున్నయెడల సమస్త దుఃఖములు అంతమొందును.

శ్రీమద్రామాయణములోని శ్రీరామచంద్ర ప్రభువు శాంతగుణము మూర్తీ భవించిన పరమ పురుషుడు. ఆయన ఎటువంటి విపత్తులలోను శాంతమును కోల్పోయెడివాడు కాదు. ఆయన మానవజాతికి ఆదర్శమూర్తి. అలాగుననే, మహా భారతములోని యుధిష్ఠిరుడు గూడ శాంతమునకు, స్థిరత్వమునకు, ధర్మాచరణకు ఆదర్శమూర్తి.

కావున, ప్రతిమానవుడు శ్రీరామచంద్రుని వలెను, యుధిష్ఠిరుని వలెను శాంతము నలవరచుకొనవలయునని సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

## 7. దయ :-

దయాగుణము యొక్క ప్రాముఖ్యతను ఈ క్రింది సూక్తి చక్కగా వర్ణించుచున్నది.

**శ్లో॥ మానవస్య సువర్ణాది భూషణాని న భూషణమ్।**
**దయా సద్భూషణం తస్మా ద్దయాహీనో న మానవః ॥**

'మానవునికి సువర్ణాభరణములు, భూషణము కాదు. దయయే నిజమైన భూషణము. అందువలన దయాహీనుడు మానవుడు కాదు'.

ఈ సద్గుణము యొక్క వైశిష్ట్యమును శ్రీవాల్మీకి రామాయణ పాత్రలైన శ్రీరామచంద్రుని, సీతాదేవి యొక్క ప్రవర్తన ద్వారా సనాతన ధర్మము మనకు బోధించుచున్నది. శ్రీమద్రామాయణము ఆదికావ్యము మరియు వేదసారము. వేదమే రామాయణరూపమున వెలువడినదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ వేద వేద్యేపరేపుంసి జాతే దశరథాత్మజే,**
**వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"**

'వేదములచే తెలియబడు పరమాత్మ దశరథుని తనయుడుగ దివినుండి భువికి దిగి వచ్చినపుడు వేదము వాల్మీకి మహర్షి నుండి రామాయణ రూపమున వెలువడినది'

శ్రీరాముడు, సీతాదేవి దయాగుణ స్వరూపులు. ఇతరులకు కలిగిన కష్టములను చూచి శ్రీరాముడు అవి తనకు వచ్చినట్లుగనే భావించి దుఃఖించెడి వాడు. ఇతరులకు శుభములు కలిగినపుడు వారి యభివృద్ధిని జూచి తండ్రివలె సంతోషించెడి వాడు. ఇది ఆయన దయాగుణమునకు నిదర్శనము.

**"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః ।**
**ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి ॥"**

'పట్టణములోని మనుష్యుల కెవ్వరికైనా కష్టములు కలిగినచో రాముడే ఎక్కువగా దుఃఖించును. వారికి ఆనందము కలిగినచో తండ్రి వలె సంతోషించును'.

ఒక్క మానవులయందే గాక, సర్వభూతములయందును అపారమైన దయ కలిగినవాడు శ్రీరాముడు.

అట్లే, సీతాదేవి యొక్క దయాస్వభావం నిరుపమానమైనది. ఈ క్రింది సంఘటన ఈ విషయమును నిరూపించును.

శ్రీరాముడు లంకాపురిని జయించిన తరువాత, సీతాదేవిని అనేక బాధలు పెట్టిన రాక్షస స్త్రీల మీద ప్రతీకారచర్యగా హనుమంతుడు వారందరిని తుద ముట్టించెదనని ఆమె యొక్క అనుమతిని కోరతాడు. అపుడు సీతాదేవి ఆంజనేయుని వారించి, రాజసేవా తత్పరులైన ఆ భృత్యులపై ప్రతీకారం తీసికోవడం ధర్మం కాదని చెప్పుతుంది. తన ప్రారబ్ధవశాత్తు ఇటువంటి కష్టములు తనకు దాపురించి ఉంటాయని, దానికి వారు బాధ్యులు కారని వాదిస్తుంది. ప్రభువాజ్ఞను మన్నించడం వారి ధర్మమని చెప్పుతుంది. ప్రభువుని కోల్పోయి నిస్సహాయులైయున్న ఆ దాసీ జనాన్ని హింసించడం వివేకులకు తగిన పని కాదని స్పష్టం చేస్తుంది. ప్రాజ్ఞులైనవారు ప్రత్యపకారం చేయడం విజ్ఞత లక్షణం కాదని వాదిస్తుంది. శత్రువులయందు కూడా ఆమె చూపిన కరుణ, దయ నిరూపమానమైనది.

కాబట్టి, ప్రతి వ్యక్తియు శ్రీరాముడు, సీతాదేవి వలె దయాగుణ సంపన్నుడై మెలగుచు, మానవుడనిపించు కొనవలయునని సనాతన ధర్మము బోధించుచున్నది.

## 8. త్యాగము :-

లభించినదానిని, లభించనున్నదానిని పరోపకారార్థమై త్యజించుటనే త్యాగ మందురు.

శ్లో॥ సర్వసద్గుణజాతానాం త్యాగం సర్వోత్తమం ధ్రువమ్।
త్యాగశూన్యః పుమాన్లోకే మానవేషు న గణ్యతే॥

'సకల సద్గుణ సముదాయములో త్యాగము సర్వోత్తమమైనది. ఇది నిశ్చయము. త్యాగహీనుడు ప్రపంచమున మానవులలో గణింపబడడు'.

త్యాగానికి పరాకాష్ఠ రామాయణపాత్రలైన శ్రీరాముడు, అతని సోదరులు, సీతాదేవి మరియు ఆంజనేయుని యొక్క ఆచరణ, వీరందరు త్యాగధనులు.

పితృవాక్యపరిపాలన పుత్రుల కర్తవ్యమని, అది అత్యంత పరమోత్కృష్టమైన ధర్మమని శ్రీరాముడు తనకు లభించనున్న రాజ్యమును, రాజభోగములను త్యాగముచేసి, పదునాల్గు సంవత్సరాలు వనవాసం చేసినాడు. భరతుడు వనమున కేగి, శ్రీరాముని తిరిగి అయోధ్యకు రమ్మని, రాజ్యమును స్వీకరించమని పరిపరి విధముల కోరినప్పటికి, అవకాశము వచ్చినది గదాయని ప్రలోభమునకు లొంగక, రాజ్యమును రాజ భోగములను త్యజించిన త్యాగశీలి.

"స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీ మపి ।
ఆధారనాయ లోకస్య ముఞ్చతో నాస్తిమే వ్యథా ॥"

–భవభూతి "ఉత్తర రామచరిత్ర"

'ప్రజాసేవ కొఱకు స్నేహమును, దయను, సుఖమును అవసరమైతే జానకినైనను కూడా విడచుటకు నాకు బాధలేదు' యని చెప్పిన త్యాగధనుడు శ్రీరామచంద్రమూర్తి.

లక్ష్మణుడు తన అనుంగు ప్రియురాలిని, జన్మనిచ్చిన తల్లిని వదలి అన్నయగు శ్రీరాముని వెంట అరణ్యములకు వెళ్ళి, శ్రీరాముని సుఖము కొఱకు తన స్వసుఖము లను త్యజించి, కష్టములను నవ్వుతూ నవ్వుతూ స్వీకరించి, తన సర్వస్వాన్ని శ్రీరాముని చరణారవిందములకు సమర్పించి, లోకమునకు త్యాగము యొక్క పరాకాష్ఠను చూపించి, తన జీవితమును సార్ధక్య మొనర్చుకొనిన మహాత్యాగశీలి. లక్ష్మణుని లాంటి స్వార్థత్యాగులు మహాఅరుదుగా కన్పట్టుదురు.

శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన పిమ్మట, లక్ష్మణుని యువరాజు పదవిని స్వీకరించమని కోరుతాడు. ఎంత బలవంతం చేసినప్పటికి లక్ష్మణుడు అంగీకరించడు. శ్రీరాముడు నిష్ఫలుడై యౌవరాజ్యాభిషిక్తునిగా భరతుడినే చేస్తాడు. యువరాజు పదవిని కూడా త్యజించి శ్రీరాముని సేవకే అంకితమయిన త్యాగశీలి లక్ష్మణుడు.

శ్రీరాముడు ఒక పర్యాయం బ్రాహ్మణ వేషములో వచ్చిన కాలయవనునితో రహస్య సంభాషణలు చేయవలసి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని ద్వారం వద్ద కాపలా ఉంచి, ఎవరైనా ఆ సమయంలో లోపలికి వచ్చినగాని, తమ సంభాషణలు వినిన గాని, అట్టివాని తల తీసివేయడం జరుగుతుందని హెచ్చరిస్తాడు. దురదృష్టవశాత్తు అదే సమయంలో దుర్వాసమహాముని విచ్చేసి, తాను తత్‌క్షణమే శ్రీరాముని దర్శించాలని వత్తిడి చేస్తాడు. అపుడు లక్ష్మణునికి సంకట పరిస్థితి ఏర్పడుతుంది. తాను నిరాకరించిన యెడల దుర్వాసముని అయోధ్యారాజ్యమును, రాజ్యప్రజలను సర్వ నాశనమగునట్లు శపించును. అటువంటి దుర్ఘటన సంభవించకుండుటకు గాను, తన ప్రాణమును త్యజించుటకైనను సిద్ధపడి, శ్రీరామునితో దుర్వాసముని రాకను గురించి తెలియపరుస్తాడు. శ్రీరాముడు కాలయవనుని పంపించి, దుర్వాసమునిని తగురీతి సత్కరించి, తృప్తిపరచి అతనిని గూడ పంపిస్తాడు. శ్రీరాముని ఆజ్ఞ నుల్లంఘించిన కారణముగా లక్ష్మణుని దేశబహిష్కారం చేయవలసి వస్తుంది. రాజ్యమును, రాజ్యప్రజలను దుర్వాసముని శాపమునుండి రక్షించుటకై తన ప్రాణములనైనా త్యజించుటకు సిద్ధపడిన మహాత్యాగశీలి లక్ష్మణుడు.

భరతుడు తనకు లభించిన రాజ్యాన్ని సహితం తృణప్రాయంగా నెంచి, రాజ్యాధి కారాన్ని స్వీకరించక, వనమున కేగి తన యన్న పాదాలపై బడి పదునాలుగు సంవత్సరములు తానే వనవాసం చేయుదునని ప్రాధేయపడిన త్యాగశీలి. శ్రీరాముని యనుజ్ఞ ననుసరించి శ్రీరాముని పాదుకలకే పట్టాభిషేకం చేసి, అయోధ్యను వదలి నందిగ్రామంలో నివసిస్తూ, సకల రాజభోగములను వదలుకొని, నారబట్టలను మాత్రమే ధరించి, కందమూల ఫలములను మాత్రమే భుజిస్తూ, శ్రీరాముని ప్రతినిధిగా పదునాలుగు సంవత్సరములు రాజ్యపాలన చేసి, రావణుని వధించి తిరిగివచ్చిన శ్రీరామునికి రాజ్యమును సంతోషముగా ఒప్పగించిన నిస్వార్థ త్యాగశీలుడు భరతుడు.

శత్రుఘ్నుడు గూడ త్యాగములో అన్నల ముగ్గురి కంటె తక్కువైన వాడేమియు కాదు. లవణాసురుని వధించి వచ్చిన శత్రుఘ్నునికి శ్రీరాముడు మధురానగర రాజ్యమును పాలింపుమని ఆజ్ఞాపించగా, అతడు సిగ్గుతో "కథం తిష్ఠత్సు జ్యేష్ఠేషు కనీయానభిషిచ్యతే" –'నా కంటె పెద్దలుండగ నా కేల యీ రాజ్యాభిషేక' మని తన త్యాగశీలతను అన్నల యందలి గౌరవమును వెల్లడించెను.

ఎలాగైతే లక్ష్మణుడు శ్రీరాముడు కోరినప్పటికి యువరాజ పదవిని స్వీకరించక,

శ్రీరాముని యొక్క సేవయే తన ఆశయముగా పెట్టుకున్నాడో, అదేవిధముగా శత్రుఘ్నుడు ఏవిధమైన అధికార పదవులను అభిలషించకుండా భరతుని యొక్క సేవయే తన లక్ష్యంగా స్వీకరించిన త్యాగశీలుడు.

సమస్త భోగభాగ్యములను త్యజించి, భర్తతో అరణ్యముల కేగి, అనేక కష్టనష్టముల కోర్చి, భర్త ననుసరించడం ఒక్కటే సతుల ధర్మమని ఋజువు చేసిన మహోత్యాగ శీలి సీతాదేవి. భర్త లేని స్వర్గసుఖముల కంటే, భర్తతో అరణ్యవాస దుఃఖమే మేలని చాటిచెప్పి, దుఃఖమునే స్వీకరించిన త్యాగశీలి **సీతాదేవి.**

ప్రతిఫలాపేక్ష లేకుండా తన జీవిత సర్వస్వమును శ్రీరాముని యొక్క సేవ కొరకు అర్పించిన త్యాగధనుడు **హనుమంతుడు.**

లక్ష్మణుడు సీతారాములతో వనవాసానికి పోవ సంకల్పించుకున్నప్పుడు, సుమిత్రాదేవి అడ్డు చెప్పలేదు సరిగదా, పై పెచ్చు లక్ష్మణునికి బుద్ధులు గరిపి, ధైర్యం చెప్పి సాగనంపిన త్యాగశీలి **సుమిత్రాదేవి.**

సుమిత్రాదేవి లక్ష్మణునికి బోధించిన సూక్తులను గమనింపుడు

**శ్లో॥ రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్ ।**
**అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత ! యథా సుఖమ్ ॥**

**(అయో. 40-9)**

'నాయనా! అరణ్యములో శ్రీరాముని తండ్రియగు దశరథునిగాను, సీతను తల్లియగు నన్నుగాను, అడవిని అయోధ్యగాను భావించి మసలుకొమ్ము' అని లక్ష్మణునికి ప్రబోధించి, ఆశీర్వదించి, తన అనుంగు బిడ్డ యొక్క వియోగమును గూడ లెక్కింపక, తన బిడ్డను శ్రీరాముని సేవకొరకు వినియోగించిన త్యాగశీలి సుమిత్రాదేవి.

కావున, ప్రతి మానవుడు పై నుదాహరించిన రామాయణపాత్రల వలె త్యాగబుద్ధిని కలిగియుండవలెనని సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

ఈ ప్రపంచమునందు విషయవాసనలను పూర్తిగా త్యజించి పరమాత్మను అనుసంధాన మొనర్చుటయు ఉత్కృష్టమైన త్యాగమేనని **తేజోబిందూపనిషత్తు** తెలుపుచున్నది.

శ్లో॥ త్యాగః ప్రపంచ రూపస్య సచ్చిదానందాత్మావలోకనాత్ ।
త్యాగో హి మహతాం పూజ్యః సద్యో మోక్షప్రదాయకః ॥

'త్యాగమన దృశ్యమానమగు జగత్తునందు సచ్చిదానంద పరమాత్మను అనుష్ఠాన మొనర్చుచు, ప్రపంచదృష్టిని త్యజించుట. ఇట్టి మహత్తర త్యాగమునే పరమపూజ్యులగు మహాత్ములు ప్రశంసించుదురు. ఈ ఉత్కృష్టమైన త్యాగము వలన మోక్షము సిద్ధించును'.

ఎవడైతే శ్రీశంకరాచార్యుల వారు చెప్పిన "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అను భావమును కలిగియుండి, జగత్తునందు దోషదృష్టిని పెంపొందించుకొని, వైరాగ్యమును పొంది, విషయవాంఛలను పూర్తిగా త్యజించి, సత్యవస్తువగు బ్రహ్మము నందు స్థితుడై ఉండునో, అట్టివానికి మోక్షము తత్క్షణమే సిద్ధించునని సనాతన ధర్మము బోధించుచున్నది.

కావున, **'విషయత్యాగము'** అన్నిటికంటే సర్వోత్కృష్టమైన త్యాగము.

**కైవల్యోపనిషత్తు** గూడ త్యాగము వలననే మోక్షము సిద్ధించునని దృఢీకరించు చున్నది.

**"త్యాగేనైకే అమృతత్వ మానశుః"**

'ఒక్క త్యాగరూపమగు సన్న్యాసము చేతనే విద్వాంసులు (జ్ఞానులు) అమృ తత్వమును (మోక్షమును) పొందగలరు'.

ఇదే సత్యమును **అవధూతోపనిషత్తు** గూడ ప్రబోధించుచున్నది.

**మం॥** న కర్మణా న ప్రజయా ధనేన **త్యాగేనైకే అమృతత్వ మానశుః** ।

'అమృతత్వమును కర్మచే పొందలేరు, సంతానముచే పొందలేరు. ధనముచే పొందలేరు; కొందరు త్యాగముచే అమృతత్వమును పొందుదురు'.

భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ భిన్నదృక్కోణములో నిర్వచించినాడు.

**"సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః" (18-2)**

'సమస్త కర్మల యొక్క ఫలమును త్యజించుటనే త్యాగమందురు' అని శ్రీకృష్ణ పరమాత్మ చెప్పినాడు.

మానవుడు కర్మల ఫలము నాశింపక, తన విధ్యుక్త కర్మలను భగవదర్పణ బుద్ధితో నాచరించిన యెడల పరమపదమును పొందగలడని భగవద్గీత బోధించుచున్నది.

శాంతి, దయ, త్యాగ గుణముల వలన కలుగు ప్రయోజనములను విచారించెదము.

**శ్లో॥ విశాల దృష్టి ర్దయయాహి లభ్యతే**
**సుఖం హి శాంత్యా భవితా హ్యనుత్తమమ్ ।**
**ప్రకాశతే తత్త్వమహో పరాత్మన**
**స్సుఖేన లోకే ఖలు త్యాగ సంపదా ॥**

'దయచేత విశాలదృష్టియు, శాంతిచేత సర్వోత్కృష్టమైన సుఖమున్ను, త్యాగ సంపదచేత పరమాత్మ తత్త్వమున్ను తేలికగా తెలియబడును' యని సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

## 9. వైరాగ్యము :-

జగత్తునందు దోషదృష్టిని గలిగియుండి, విషయముల యెడ జుగప్సాభావమును పొంది, ప్రపంచ వస్తువులను వాంఛించకుండుటనే వైరాగ్యమందురు.

ఇది దైవీ సంపత్తిలో అతి ముఖ్యమైనది, ఉత్కృష్టమైనది. ఈ గుణము ముఖ్యముగా సాధకులకు అత్యంత అవసరమైనది. వైరాగ్యము లేనియెడల సాధకుడు బ్రహ్మమునందు ప్రతిష్ఠితుడు కాజాలడు. విషయాసక్తుడైన మానవుడు భగవానుని యందు మనస్సును కేంద్రీకరింపజాలడు గదా! విషయలంపటుడైన వ్యక్తి రజోగుణ సంపన్నుడై విషయా న్వేషణలోనే కాలమునంతను వ్యయము చేయును గాని, భగవానుని యందు మనస్సును నిలపజాలడు. అందువలన విషయవాంఛను త్యజించి, పూర్తి వైరాగ్యమును గలిగిన వ్యక్తియే భగవదన్వేషణలో విజయమును సాధించగలడు. కావున సాధకులకు, భగవద్భక్తులకు వైరాగ్యము అత్యావశ్యకమైనది.

మనస్సు అతి చంచలమైనది, వాయువువలె మిక్కిలి దుష్కరమైనది, దానిని నిరోధించుట ఎట్లు? అని అర్జునుడు ప్రశ్నించినపుడు, కృష్ణభగవానుడు భగవద్గీతలో **"అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే"** – 'అభ్యాస వైరాగ్యములచే దానిని నిరోధింపవచ్చును' యని సమాధానమిచ్చినాడు. కనుక, మనస్సును కేంద్రీకరించుటకు వైరాగ్యము అత్యవసరము.

మరియు, అష్టాదశాధ్యాయములో మానవుడు బ్రహ్మానుభవమునకు యోగ్యుడ గుటకు ఏ గుణముల నాశ్రయింపవలయునో తెలుపుతూ, శ్రీకృష్ణపరమాత్మ **"నిత్యం వైరాగ్యం సముపాశ్రితః" 'ఎల్లప్పుడు వైరాగ్యము నాశ్రయింపుము'** యని చెప్పినాడు.

మానవునికి వైరాగ్యము అనేక కారణములచేత గలుగును. దుఃఖముచేత, భయము చేత, విచారము (వివేకము) చేత, సాధనచేత, పరబ్రహ్మతత్త్వమును అర్ధము చేసి కొనుట చేత –వీటిలో ఏదో ఒక కారణము చేత వైరాగ్యము కల్గుట కవకాశమున్నది.

**దుఃఖముచేత గలుగు వైరాగ్యము** : ధన నష్టము, గృహ నష్టము, భార్యాపుత్రుల వియోగము, భార్యాపుత్రుల ప్రతికూలత, కుటుంబములో అశాంతి మొదలగు ప్రతికూల వాతావరణములో దుఃఖితుడై, ప్రపంచమునందు దోషదృష్టి గలిగి, సంసారమును త్యజించవలయునను భావన జనించుటయే దుఃఖముచేత గలుగు వైరాగ్యము. ఈ వైరాగ్యము అనిత్యమైనది. ఇది ఎక్కువ కాలము నిలుచునది కాదు. ఇది యథార్ధమైన వైరాగ్యము కాదు. దుఃఖకారణమైన పరిస్థితులు మారిపోయి, అనుకూల స్థితి యేర్పడిన వెంటనే ఈ వైరాగ్యము నశించును.

అందులకే **"యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవజేత్"** 'ఏ దినము, ఏ క్షణము, వైరాగ్యము కలిగిన ఆ క్షణముననే సర్వము త్యజించవలెను' యని పెద్దలు చెప్పినారు. అట్లు చేసినయెడల, ఆ సమయములో సత్సాంగత్యము లభించిన యెడల, వైరాగ్యము అధికమయి ఆత్మోద్ధారణకు దారితీయవచ్చును. కావున, ఈ వైరాగ్యము గూడ ఒక విధముగా మంచిదనియే చెప్పవచ్చును.

**భయము చేత కల్గు వైరాగ్యము :–** దుఃఖము చేత గల్గు వైరాగ్యము కంటె భయము చేత గల్గు వైరాగ్యము శ్రేష్ఠమైనది. ఆరోగ్యభయము, రాజదండన భయము, సమాజ భయము, గౌరవ-ప్రతిష్ఠల భయము, జన్మమరణముల భయము మరియు నరకముల భయము మొదలగు అనేక విధముల భయముచేత కలుగు వైరాగ్యమును 'భయముచేత కల్గు వైరాగ్యము' అని చెప్పుదురు.

పై చెప్పిన వైరాగ్యము లన్నింటిలో నరకముల యొక్క భయముచేత గల్గు వైరాగ్యము శ్రేష్ఠమైనది మరియు స్థిరమైనది. కాని, ఇది గూడ యథార్ధమైన వైరాగ్యము కాదు ఎందువలనంటే–ఇందులో గూడ విషయములపై గల రాగము నశించదు. కేవలము భయము చేత మాత్రమే విషయములను త్యజించుట జరుగును. కావున, ఇది భయము చేత గల్గు వైరాగ్యము మాత్రమే. భయము లేని యెడల ఇది నిలుచుట గూడ కఠినము.

**విచారము (వివేకము) చేత కల్గు వైరాగ్యము :–** దుఃఖము, భయముల చేత గల్గు వైరాగ్యముల కంటె వివేకము చేత గల్గు వైరాగ్యము చాలా శ్రేష్ఠమైనది.

విచారమనగా అర్థము సత్-అసత్, సార-అసారము, హేయ-ఉపాదేయము మరియు కర్తవ్యము-అకర్తవ్యము మొదలగు వానియొక్క వివేకము. ఈ వివేకము చేత అసత్తయిన దానిని, సారహీనమయిన దానిని, హేయమైన దానిని మరియు అకర్తవ్యమును మనస్సు నుండి పరిత్యజించి, వాటియందు గల అనురాగమును వర్జించుటనే 'విచారము చేత గల్గు వైరాగ్యము' అందురు.

విషయముల ననుభవించుట వలన గల్గు పరిణామమేమనగా వాటియందు ఆసక్తి వృద్ధియగును. అదియే సకల దుఃఖములకు కారణమగును. ఎందువలననగా- విషయముల యందు సుఖమనునది లేనే లేదు. కేవలము ఆరంభములో సుఖమున్నట్లు కన్పించును. కాని వాటియొక్క పర్యవసానము దుఃఖమే. శ్రీకృష్ణపరమాత్మ గీతలో ఇట్లు చెప్పినాడు.

**శ్లో॥ యేహి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవతే ।**
**ఆద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః ॥ (భగ.5-22)**

'కౌంతేయ! విషయముల నుండి పుట్టిన సుఖములన్నియు యథార్థముగ దుఃఖ హేతువులు, ఆద్యంతములు కలిగినవి అనగా అనిత్యములు. కావున జ్ఞానులు వాటియందనురక్తులు గారు'.

మరియు -

**శ్లో॥ విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రే ఽమృతోపమమ్।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ (భ.గ.18-38)**

'విషయముల యొక్క, ఇంద్రియముల యొక్క సంయోగము వలన లభించు సుఖము మొదట అమృతము వలెను, చివరకు విషము వలెను ఉండును. అట్టి సుఖము రాజసమని చెప్పబడుచున్నది'.

విషయములలో సుఖమున్నయెడల గొప్ప గొప్ప ధనికులు, భోగులు, ఉన్నతాధికారులు సుఖముగా ఉండవలసినది. కాని, విచారించిన యెడల వారు కూడ దుఃఖితులై యున్నారని తెలుస్తుంది. ఎందుకనగా-పదార్థములలో శాంతి లేదు, ఉండదు, ఉండబోదు, ఉండలేదు. ఈ సత్యము విచారశీల వ్యక్తికి అడుగడుగునా గోచరిస్తూనే ఉంటుంది.

పదార్థములు ఎన్ని ఉన్నప్పటికి మానవునికి తృప్తి ఉండదు. 'ఇంకా ఉంటే బాగుండును', 'ఇంకా ఉంటే బాగుండును' అని ఆశ పెరుగుచునే యుండును. ఈ ప్రపంచములో ఎంత ధనధాన్యము ఉన్నదో, ఎంతమంది స్త్రీలు ఉన్నారో, ఎంత సామగ్రి ఉన్నదో అవి మొత్తము ఒక్కసారిగా ఒక వ్యక్తికి లభించినప్పటికి ఆ వ్యక్తికి తృప్తి కలగదు. శాస్త్రంలో ఇలా చేప్పబడినది.

**శ్లో॥ యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః ।**
**ఏకస్యాపి న పర్యాప్తమితి మత్వా శమం వ్రజేత్ ॥**

దీనికి కారణమేమనగా–జీవుడు పరమాత్మయొక్క అంశమును మరియు చైతన్య వంతమునై యున్నాడు. పదార్థములు జడమైనవి. అందువలన చైతన్యవంతుని ఆకలిని జడపదార్థములు తృప్తిపరచలేవు. జడపదార్థములు ఎన్ని ఇచ్చినప్పటికి ఆ ఆకలి తృప్తిచెందదు. ఈ ఆకలి ఏమిటి? ఇది కోరికల సముదాయము. కావున కోరికలను నశింపచేసిన ఈ ఆకలి తీరును. ఈ కోరికలను **వైరాగ్యమను** ఖడ్గముతో నశింప చేయవలయును.

వైరాగ్య సంపన్నుడైన మునికి ఉన్న సుఖము దేవేంద్రునకు గాని, చక్రవర్తి సమ్రాట్‌నకు గాని లేదని శ్రుతి చెప్పుచున్నది;

**శ్లో॥ న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తి నః ।**
**యత్ సుఖం వీతరాగస్య మునేరేకాన్త శీలిన ః ॥**

"ఏకాంతవాసియు, వైరాగ్యసంపన్నుడును అయిన మునికి ఉన్న సుఖము దేవేంద్రునకుగాని, చక్రవర్తి సమ్రాట్‌నకు గాని లేదు".

ఒకప్పుడు 'పింగళ'యను ఒక వేశ్య యుండెను. ఆమె చాలా ప్రసిద్ధిచెందినది. ఆమె వద్దకు చాలామంది భోగలాలసులు, ధనవంతులు వచ్చి ధనము నిచ్చుచుండిరి. ఒక దినము రాత్రి ఎంత సేపు వేచియున్నప్పటికిని ధనము నిచ్చువాడెవ్వడును రాకుండెను. దానివలన ఆమె చాలా ఉద్విగ్నమనస్కయై యుండెను. ఇంతలో ఆమె దత్తాత్రేయ మహర్షులవారు బ్రహ్మానందములో డోలలాడుచు అటుగా వచ్చుచుండుట గాంచెను. వెంటనే ఆమెలో ఊహాతీతమైన మార్పు వచ్చెను. ఆమె ఇట్లు విచారించ మొదలిడెను. "ఈ విదేహనగరిలో పరపురుషుల నుండి సుఖమును, తృప్తిని ఆశించు మూర్ఖురాలను నేను. వారు నాకు ఏమి సుఖము నీయగలరు, నన్నేమి తృప్తిపరచ

గలరు? వారి వద్ద సుఖమంటూ ఉండి, వారు నాకు సుఖము నీయగలిగి నట్లయితే, వారు ఆ సుఖమును నా వద్దనుండి తీసికొనుటకు ఎందుకు వస్తున్నారు? తన దాహమును తీర్చుకోలేని వ్యక్తి ఇతరుల దాహమును ఏమి తీర్చగలడు? రొట్టెముక్కకై వెదకు శునకము వలె తాను స్వయంగా సుఖము కొరకు వెదకుచున్న వ్యక్తి ఇతరులకు ఏమి సుఖము నీయగలడు?" దత్తాత్రేయ మహర్షి యొక్క బ్రహ్మానందమును చూచి ఆమె మనస్సులో పై విధముగా తలంచినదయి, ఆమెలో వైరాగ్యము తత్క్షణమే ఉత్పన్నమాయెను.

ఆమె అప్పుడు ఇట్లు ఆలోచించినది "ఇంతవరకు నేను గొప్ప తప్పిదము నొనర్చినాను, ఇప్పుడు నాయొక్క అమూల్యమైన సమయమును వ్యర్థము చేయను". ఈ విషయమును శ్రీశుకమహర్షి భాగవతములో చక్కగా వర్ణించినాడు.

**శ్లో॥ ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్ ।**

**యథా సంఛిద్య కాంతాశాం సుఖం సుష్వాప పింగళా ॥**

'ఆశయే అన్నిటికంటె గొప్ప దుఃఖము, నిరాశయే అన్నిటికంటె గొప్ప సుఖము. పింగళ వేశ్య ఎప్పుడైతే పురుషుల కొరకు ఆశను త్యజించినదో, అప్పుడు హాయిగా (సుఖముగా) నిద్రింపగలిగినది'.

కావున, యథార్థముగా ఆశయే సకల దుఃఖములకు, పాపములకు మూలము. భగవద్గీతలో అర్జునుడు కృష్ణపరమాత్మను ప్రశ్నించినాడు "మానవుడు పాపము చేయుటకు ఇష్టపడడు. అయినప్పటికి బలవంతముగా ఎవరి ప్రేరణ ద్వారా అతడు పాపమును చేయుచున్నాడు?" దానికి సమాధానముగా భగవానుడు పాపమును చేయించుటకు కారణము ఒక్క **కామము** మాత్రమేనని చెప్పినాడు.

ఆశ ఏ ప్రకారముగా సర్వ దుఃఖములకు కారణమగుచున్నదో, అదే ప్రకారముగా నిరాశ లేక వైరాగ్యము సకల సుఖములకు కారణమగుచున్నది. ఈ సత్యమును తెలిసికొని పింగళ తన ధనసంపత్తిని పూర్తిగా త్యజించి, వైరాగ్యమును ఆశ్రయించి భగవానుని యొక్క భజన కీర్తనలలో, ధ్యానములో సమయమును వెచ్చించి, పరమ సుఖమును బడయుటకు నిశ్చయించుకొని, అచటినుండి వెడలిపోయెను.

విషయములలో లేక పదార్థములలో నిజముగా సుఖమున్న యెడల రాజులు-మహారాజులు తమ రాజ్యములను, పదార్థములను త్యజించి, అడవులకు జని ఎందుకు

తపస్సు చేయుచున్నారు? ఈ విషయమై రాజా భర్తృహరి తన కోరికను చక్కగా వర్ణించినాడు.

**శ్లో॥ ఏకాకీ నిఃస్పృహః శాన్తః పాణిపాత్రో దిగంబరః ।**
**కదా శంభో భవిష్యామి కర్మ నిర్మూలనే క్షమః ॥**

'హే శంభో! నేను ఏకాకినై, నిఃస్పృహుడనై, శాంతచిత్తుడనై, హస్తమందు భిక్షాపాత్రను ధరించినవాడనై మరియు దిగంబరుడనై నా యొక్క సకల కర్మలను నిర్మూలన మొనర్చుటకు సమర్థునెపుడగుదును?'

భర్తృహరి ఒక గొప్ప చక్రవర్తి అయియుండియు, తాను సకల కర్మలను త్యజించి ఏకాకియై, వాంఛారహితుడై, దిగంబరుడై, భిక్షాటనచే ఉదరపోషణ చేయుచు శాంతిని బడయుటకై కోరుచున్నాడు. ఇదియే వైరాగ్యము యొక్క పరాకాష్ఠ.

దీనికి కారణము–ఈ ప్రపంచములో ప్రతి వస్తువునందు ఏదో ఒక అవగుణము (దుర్గుణము) కనిపించుచునే యుండును. ఆ దుర్గుణము వలన ఆ వస్తువు యెడల భయముత్పన్నమగుచున్నది. కావున, ఈ జగత్తులో ప్రతి వస్తువునందు ఏదో ఒక విధమైన భయము ఉండనే ఉంది. భయము లేని వస్తువు ఒక్కటే ఒకటి ఉన్నది అదియే **వైరాగ్యము.** వైరాగ్యము భయరహితమైనది. ఈ విషయమునే భర్తృహరి ఇట్లు వర్ణించుచున్నాడు.

**శ్లో॥ భోగే రోగభయం కులే చ్యుతి భయం విత్తే నృపాలాద్భయం**
**మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయమ్ ।**
**శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం**
**సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్ ॥**

'భోగికి రోగభయము, ఉత్తమకులవంతునికి కులహీనత యొక్క భయము, ధనవంతునికి రాజుయొక్క భయము, గౌరవ-ప్రతిష్ఠలు గలవానికి దీనత్వము యొక్క భయము, బలవంతునికి శత్రుభయము, రూపవంతునికి వృద్ధాప్యము యొక్క భయము, శాస్త్రజ్ఞునికి వాదభయము, గుణవంతునికి దుష్టుల భయము, శరీరానికి మృత్యు భయము ఎల్లప్పుడు ఉండియే ఉండును. ఈ భువిలో మానవులకు సకల వస్తువులు భయముతో గూడినవై యున్నవి. ఒక్క వైరాగ్యము మాత్రమే ఎల్లప్పుడు భయరహితమై యున్నది'.

రాజా భర్తృహరి తన గత జీవితములో నొనర్చిన కార్యముల పట్ల పశ్చాత్తాపమును జెందినాడు. ఆ పశ్చాత్తాప ఫలమే వైరాగ్యము. వైరాగ్యము వలన ఆయన అంతిమ దశలో ఆనందముననుభవించినాడు. అయన ఇట్లు చెప్పినాడు.

**శ్లో॥ భోగా న భుక్తా వయమేవ భుక్తా స్తపో న తప్తం వయమేవ తప్తాః ॥**
**కాలో న యాతో వయమేవ యాతా స్తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణాః ॥**

'భోగములను నేను అనుభవించలేదు, భోగములే నన్ను అనుభవించినవి. అవియే నన్ను నశింపచేసినవి' యని భర్తృహరి పశ్చాత్తాపపడినాడు. తదనంతరము ఆయనలో వైరాగ్య ముత్పన్నమయినది.

గొప్ప గొప్ప రాజులు-మహారాజులు గతించినారు. వారి సుందరమైన రాజ-మహలులు ఈనాడు శిథిలావస్థలో నిలిచియున్నవి. వాటిని చూచినపుడు మనస్సులో వైరాగ్యముత్పన్నమగును. ఈ వైరాగ్యము సర్వదా అభయప్రదమైనది. ఎవని హృదయములో వైరాగ్యముండునో వానికి ఈ శరీరము పోతుందనే భయమెప్పుడును ఉండదు. అటువంటి వానికి నశించిపోయే పదార్థములపై భ్రమయే ముండును?

ఎందువలనంటే -

**శ్లో॥ అవశ్యం యాతారశ్చిరతరముషిత్వాపి విషయా**
**వియోగే కో భేదస్త్యజతిన జనో యత్ స్వయమమూన్ ।**
**వ్రజంతః స్వాతంత్ర్యాదతుల పరితాపాయ మనసః**
**స్వయం త్యక్తా హ్యేతే శమ సుఖమనన్తం విదధతి ॥**

'విషయ-పదార్థములు దీర్ఘకాలమున్నప్పటికీ, ఏదో ఒక రోజు అవి నశింపక తప్పదు. మనము వాటిని త్యజించవచ్చు. లేక అవే మనలను త్యజించవచ్చును. ఏమైనప్పటికి, వాటి వియోగము మాత్రము అవశ్యము జరిగితీరును. సాధారణముగా ఈ సంసారములో మానవుడు స్వయంగా వాటిని త్యజించడు. ఎప్పుడైతే విషయ-పదార్థములు స్వతంత్రించి అతనిని త్యజించినవో, అప్పుడు అతని మనస్సుకు చాలా సంతాపము గలుగును; అట్లుగాక అతడే వాటిని త్యజించినట్లయితే వానికి అనంతమైన సుఖ-శాంతులు ప్రాప్తింపగలవు'.

ఎప్పుడైతే మనస్సునుండి తొలగింపబడినవో, అవే పదార్థములు మనకు అనంతమైన సుఖమునివ్వగలవు. ఎట్లనగా పది రూపాయలు దొంగిలింపబడిన

యెడల మనకు దుఃఖము గలుగును; అవే పదిరూపాయలు మన ఇచ్ఛానుసారముగా దానమిచ్చిన యెడల సంతోషమును కలిగించును. ఈ రెండు స్థితులలోను పదార్థ-వియోగములో ఎటువంటి భేదమును లేదు. కాని, పదార్థములను స్వయముగా త్యజించుటలో-అనగా త్యాగములో పరమశాంతి లభించును.

విషయ త్యాగములో ఆనందమున్నదనియు, విషయ సంగములో దుఃఖమున్న దనియు తెలిసికూడ, మానవుడు విషయాకర్షణలో చిక్కుకొనిపోయి, బందీయై దుఃఖముననుభవించుచునే యున్నాడు.

ఈ విషయమును భర్తృహరి చక్కగా వర్ణించినాడు.

**శ్లో॥ అజానన్ దాహార్తి పతతి శలభస్తీవ్రదహనే**

**న మీనోఽపి జ్ఞాత్వా బడిశయుతమశ్నాతి పిశితమ్ ।**

**విజానన్తోఽప్యేతే వయమిహ విపజ్జాలజటిలాన్**

**న ముంచామః కామానహహ ! గహనో మోహమహిమా ॥**

'శలభము (మిడుత) కాలుట వలన ఎంత బాధ కలుగుతుందో తెలియక ప్రచండ అగ్నిలో దూకుతుంది, పతనమవుతుంది. అలాగుననే చేప గాలానికి తగిలించిన మాంసపుముక్కను తినునపుడు, దాని లోపల తనను పట్టుకొనుటకు ముల్లు ఉన్నదని తెలిసికొనలేక, మాంసపు ముక్కను తినుటకు ప్రయత్నించి, గాలానికి చిక్కిపోతుంది. ఇవి రెండును అజ్ఞానముచేత కష్టముల పాలవును. కాని, మనము విషయ-భోగము వలన విపత్తి-వలయంలో చిక్కుతామని తెలిసినప్పటికీ, ఆ విషయములను త్యజింపలేకున్నాము. అహో! మనది ఎంతఘనమైన అజ్ఞానము!'

ఎన్నోసార్లు పదార్థాలను చూచాము, అనేకసార్లు అనుభవించాము. అయినప్పటికి, వాటి వెనుక పడుతూనే ఉన్నాము. శలభము మొదలగు జీవులు విషయసంగము చేత ఒక్కసారి మాత్రమే మరణించును. కాని, మనము పదార్థములను భోగించి, అడుగడుగున మరణిస్తూనే యున్నాము. అయినప్పటికి, మనలో జ్ఞానముదయించుట లేదు. అడుగడుగున దెబ్బ తింటున్నప్పటికి జాగ్రత్త పడుటలేదు. ఆఖరుకు మనకు బుద్ధి వచ్చునప్పటికి వృద్ధాప్యము రానే వస్తుంది, జీవితము యొక్క అమూల్యమైన కాలము గతించిపోతుంది. ఇప్పుడు గూడ విషయములను ఇంద్రియములతో భోగించనప్పటికి, విషయ-లోలత్వము మనస్సులో నుండి మాత్రము పోవుట లేదు.

కాబట్టి, ప్రయత్నపూర్వకముగా విషయ-లాలసను త్యజింపవలయును. కోరికలను త్యజించుటలోనే-అనగా వైరాగ్యములోనే సుఖమున్నది.

వైరాగ్యపురుషుని యొక్క సుఖమయ స్థితిని శ్రీభర్తృహరి క్రింది విధముగా వర్ణించినాడు.

**శ్లో|| మహీ రమ్యా శయ్యా మసృణముపధానం భుజలతా**
**వితానశ్చాకాశో వ్యజనమనుకూలోఽయమ నిలః ।**
**స్ఫురద్దీపశ్చంద్రో విరతి వనితా సంగముదితః**
**సుఖీ శాంతః శేతే విగతభవభీతిర్నృప ఇవ ॥**

'పృథ్వియే రమ్యమైన శయ్యగా గలిగి, తన యొక్క హస్తమునే సుందరమైన తలగడగా గలిగి, ఆకాశమే అంగవస్త్రముగా గలిగి, చల్లని పిల్లవాయువునే విసనకఱ్ఱగా గలిగి, చంద్రుని రూప సుందరదీపమును గలిగి, విరక్తిరూపిణి కాంత యొక్క సంగములో నాహ్లాదము ననుభవించుచు, భవభయవిముక్తుడైన పురుషుడు శాంతచిత్తుడై మహారాజు వలె సుఖముగా నిద్రించుచున్నాడు'.

పర్వతములు, వేశ్యయొక్క సుఖము-దూరమునుండి చూచుటకు అతి సుందర ముగా కనిపించును. అలాగుననే రణము యొక్క వర్ణన దూరము నుండి వినుటకు అతి రమ్యముగా నుండును. కాని దగ్గరకు వెళ్ళినయెడల వాటియొక్క నిజ స్వరూపము- వాటిలో నున్న బాధలు అర్థమగును. అదేవిధముగ విషయ-భోగములు చూచుటకు రమ్యముగా నుండును, అనుభవించిన వెనుక వానిలో నున్న బాధ బోధపడును.

శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ఈ జగత్తు **"దుఃఖాలయము మరియు అశాశ్వతము"** యని చెప్పినాడు. అటువంటి దుఃఖాలయములో సుఖము కొఱకు వెదకిన, ఎచ్చట దొరుకును! కావున 'దుఃఖాలయము మరియు అశాశ్వతము' అయిన ఈ జగత్తును త్యజించి, వైరాగ్యమునాశ్రయించినపుడే మానవునికి సుఖ-శాంతులు లభించును.

వైరాగ్యము యొక్క ఫలమును గురించి సనాతనధర్మము క్రిందివిధముగ బోధించుచున్నది :

శ్లో॥ వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలమ్ ।
స్వానందానుభవా చ్ఛాంతి రేషై వోపరతేః ఫలమ్ ॥

(అధ్యాత్మోపనిషత్తు -28)

'వైరాగ్యమునకు ఫలము జ్ఞానము, జ్ఞానమునకు ఫలం ఉపరతి. ఉపరతికి ఫలం స్వానందానుభవము, స్వానందానుభవమునకు ఫలం పరమ శాంతి'.

వైరాగ్యము వలన గలుగు అంతిమ ఫలము **పరమశాంతి.** అదియే మోక్షము. కావున పరమశాంతికి మూలకారణము వైరాగ్యము. కాబట్టి, మానవుడు పరమశాంతిని పొందవలెననిన, తాను వైరాగ్యమును గలిగియుండవలెను.

వైరాగ్యమును పొందుటెట్లు? విషయ–భోగములయందు, జగత్తునందు దోషదృష్టిని గలిగియుండవలెను; మరియు వైరాగ్య పురుషుల యొక్క, భగవత్ప్రాప్తిని పొందిన మహాత్ముల యొక్క సంగములో ఉండి, వారియొక్క వాక్కులలోని మరియు చేష్టలలోని అంతరార్థమును గ్రహించుచు ప్రవర్తించిన యెడల వైరాగ్యముత్పన్నమగును.

ఇంతవరకు భారతావనిలో ఉద్భవించిన మహాయోగులు, మహర్షులు, మహాత్ములు వైరాగ్యము వలననే తాము అంత గొప్పవారు కాగలిగినారు. శ్రీవేమన యోగి, శ్రీ భర్తృహరి, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీరమణ మహర్షి, శ్రీ శివానందస్వామి, శ్రీ మళయాళస్వామి మొదలగు వారందరు తమ జీవితములలో పూర్తి వైరాగ్యమును పొంది, ఆధ్యాత్మిక సాధనను కొనసాగించి, ఆత్మసాక్షాత్కారమును పొంది, పరమ పదమును జేరిరి. ఆధ్యాత్మిక రంగములో వారి యొక్క విజయమునకు ముఖ్యకారణము **వైరాగ్యము** మాత్రమే.

కావున, సాధకులందరు తమ తమ జీవితములలో వైరాగ్యమును గలిగియుండి, ఆధ్యాత్మిక విజయమును సాధించుదురు గాక!

## 10. దానము :-

దానమును గురించి సనాతనధర్మము ఏమి బోధించుచున్నదో విచారింతము.

యుగమును బట్టి యుగధర్మము మారుచున్నది. కలియుగములో 'దానము' ముఖ్యమైన ధర్మముగా పరాశర స్మృతి ప్రకటించుచున్నది.

శ్లో॥ తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే ।
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌయుగే ॥ (1-23)

'కృతయుగములో తపస్సు, త్రేతాయుగములో జ్ఞానము, ద్వాపరయుగములో యజ్ఞము, కలియుగములో దానము ముఖ్యమైన ధర్మములు'.

కావున, కలియుగములో దానము వలన అత్యధిక ఫలము లభించునని దాని అర్థము.

ఇపుడు దానమననేమి, దానియొక్క నిర్వచనమేమిటో విచారింతము.

**"గోహిరణ్యాదీనాం స్వకీయానాం మూల్యగ్రహణం వినా**

**శాస్త్రోక్త వర్త్మనా స్వస్వత్వపరిత్యాగ పూర్వకం పరస్వత్వాపాదనం దానమ్"**

'స్వంతములగు గోవు,బంగారము మొదలగువానిని మూల్యము తీసికొనకయే శాస్త్రోక్తముగా తన యొక్క హక్కును వదలుకొని, యోగ్యుడగు ఇతరునికి వానిపై హక్కును కలిగించుటయే దానమనబడును'.

దానమును శాస్త్రీయముగా నీయవలెను. "పాత్రనెఱిగి దానమిమ్ము'యని శాస్త్రము నుడువుచున్నది. యోగ్యుడగువ్యక్తిని ఆహ్వానించి, అర్ఘ్యపాద్యాదులచే సత్కరించి, ప్రేమపూర్వకముగా దానము నీయవలయును. ఇచట భావము ముఖ్యము.

దానమును పాత్రుడగువాని కిచ్చిన యెడలనే అది సద్వినియోగింపబడును. అపాత్రునకిచ్చిన యెడల దానిని దుర్వినియోగపఱచును.

ఈ వాస్తవమును దృఢపరుస్తూ పరాశరస్మృతి ఇట్లు చెప్పుచున్నది:

**శ్లో॥ సుక్షేత్రే వాపయేద్బీజం సుపాత్రే నిక్షిపేద్ధనమ్ ।**

**సుక్షేత్రే చ సుపాత్రే చ హ్యుప్తం దత్తం న నశ్యతి ॥ (పరాశర. I-47)**

'ఏ విధముగా ఉత్తమమైన (సారవంతమైన) భూమిలో నాటిన బీజము ఎప్పటికిని నష్టపోక, సమయానుకూలముగా పుష్ప-ఫలముల నొసంగునో, అదేవిధముగా యోగ్యుడును మరియు పాత్రుడయిన వానికిచ్చిన ధనమున్ను వృథాగా పోక, అపేక్షిత (ఆశించిన) ఫలమునిచ్చును. మరియొక శబ్దములో చెప్పాలంటే, ఏ ప్రకారము నిస్సారమైన భూమిలో వేసిన విత్తనము నశించిపోవునో, అదేప్రకారము అయోగ్యుడును మరియు అపాత్రుడయిన వ్యక్తి కిచ్చిన దానము నిష్ఫలమైపోవును.

ఈ సందర్భముగా, ఏఏ వ్యక్తులకు ఏఏ వస్తువుల దానము నివ్వగూడదో పరాశర మహర్షి చక్కగా వివరించినాడు :

**శ్లో॥ యతయే కాంచనం దత్వా తాంబూలం బ్రహ్మచారిణే ।**
**చౌరేభ్యోఽ ప్యభయం దత్వా దాతాపి నరకం వ్రజేత్ ॥**

**(పరాశర I-61)**

సన్యాసికి స్వర్ణమును (బంగారమును), బ్రహ్మచారికి తాంబూలమును, చోరులకు (దొంగలకు) అభయదానము నిచ్చుదాత నరకమునకు పోవలసియుండును.

సన్యాసికి స్వర్ణము లభించిన యెడల, దానియొక్క సంరక్షణా భారమో లేక దానిని దుర్వినియోగపరచు ప్రవృత్తియో ఉత్పన్నమగును. ఈ రెండున్నూ అతనిని సన్మార్గచ్యుతుని గావించి, ఆచారహీనుని జేయ సంభవమగును. దానికి బాధ్యుడు దాతయే యగును.

అదేవిధముగా, తాంబూలము కామోత్తేజక పదార్థమగుటచేత, దానిని బ్రహ్మచారి చేత తినిపించి, అతని యొక్క వ్రతమును భంగమొనర్చినట్లగును.

అటులనే, దొంగలకు అభయదానమిచ్చి, రక్షించిన యెడల, వారు జేయు నికృష్ట కర్మకు వారిని ప్రోత్సహించినట్లగును. దాని వలన ధర్మమును, న్యాయమును హత్యజేసినట్లగును.

కాబట్టి, వివేకశీలియైన వ్యక్తి పై నుదాహరించిన మూడు దానముల నివ్వగూడదని పరాశర మహర్షి బోధించుచున్నాడు.

దానము సాత్త్విక, రాజసిక, తామసిక మని త్రివిధముగా చెప్పబడినది. వాటిలో సాత్త్విక దానము ఉత్తమమైనది. సాత్త్వికదానమును గురించి కృష్ణపరమాత్మ భగవద్గీతలో క్రిందివిధముగా చెప్పినాడు.

**శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేఽ నుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ (17-20)**

'విద్యాది సద్గుణయుక్తుడు, ప్రత్యుపకారము చేయనసమర్ధుడునగు వ్యక్తికి తీర్థ స్థానములయందు, పుణ్యకాలమందు చేయబడు దానము సాత్త్వికమని చెప్ప బడుచున్నది'.

దానమును ప్రతిఫలాపేక్షను వదలి చేయవలయును. మరియు, గుప్తదానము చాలా శ్రేష్ఠమైనది. చేసిన దానమును వెల్లడిచేసిన యెడల దానియొక్క ఫలము నశించునని మనుస్మృతి తేటతెల్లము జేయుచున్నది.

శ్లో॥ యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్ ।
ఆయుర్విప్రాపవాదేన దానం చ పరికీర్తినాత్ ॥ (మను.IV-237)

'యజ్ఞము అసత్యము వలన, తపస్సు పొగడ్తవలన, ఆయుష్షు బ్రాహ్మణులను దూషించుట వలన, దానము వెల్లడిచేయుట వలన ఫలము నీయక నశించును'.

కావున, గుప్తదానము ఉత్తమోత్తమమైనది.

గుప్తదానము యొక్క శ్రేష్ఠత్వమును వెల్లడిస్తూ పరాశరస్మృతి క్రిందివిధముగా నుడువుచున్నది :

శ్లో॥ అభిగమ్యోత్తమం దానమాహూతశ్చైవ మధ్యమమ్ ।
అధమం యాచమానం స్యాత్సేవాదానం తు నిష్ఫలమ్ ॥
(పరాశర.I -29)

'ఎవరి యెఱుక లేకుండా అనగా రహస్యముగా బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళి, అతనికి దానమిచ్చుట ఉత్తమోత్తమమైనది. ఇది నిర్వివాదాంశము, ఎందువలననగా- ఇందులో దాతయొక్క అహంకార భావముగాని, గ్రహీత యొక్క హీనత్వభావముగాని ప్రకటింపబడుట లేదు.

బ్రాహ్మణుని ఇంటికి పిలిచి, దానమిచ్చుట మధ్యమకోటికి సంబంధించినది. - ఎందువలననగా ఇందులో దాతయొక్క ఉన్నతస్థానము (సుపీరియార్టీ కాంప్లెక్స్) యొక్క దూషితభావము నిగూఢమై యున్నది. ఇచట గ్రహీత యొక్క హీనత్వభావమును ప్రకటించు ప్రవృత్తి నిబిడమైయున్నది.

యాచించిన బ్రాహ్మణునికి దానమిచ్చుట మూడవ కోటికి లేక అధమ ప్రకృతికి సంబంధించిన దానము. దీనిలో స్వతఃస్ఫూర్తి భావన లేదు. ఇచట ఉదారత గాని, హృదయ కోమలతగాని లేవు, సహృదయత లోపించుచున్నది.

ఇకపోతే, పై మూడింటికి విపరీతమైనది, భిన్నమైనది. సేవచేయించుకొని బదులుగా దానమిచ్చుట. దీనిని దానమనుటకే వీలులేదు. ఇది పరిశ్రమకు మూల్యము ఇచ్చినట్లగును. ఇది నిష్ఫలమైన దానము.

ఇపుడు మనము దానము ఎన్నిరకములు, వాటిలో శ్రేష్ఠమైనవి ఏవి అను విషయమును చర్చించెదము.

దానములో భూదానము, అన్నదానము, గోదానము, ధనదానము, వస్త్రదానము, విద్యాదానము, శ్రమదానము మొదలగు పలురకములు గలవు. వాటన్నింటిలో భూదానము, గోదానము, అన్నదానము శ్రేష్ఠమైనవని పెద్దలు చెప్పుదురు. ఈ మూడింటిలోను భూదానము శ్రేష్ఠతమమైనదని చెప్పుచున్నారు. యోగ్యుడైనవానికి భూమిని దానము చేసినచో, దానివలన లభించు ఫలసహాయముతో అతడు తనకు తన కుటుంబమునకు అవసరమగు మిగిలిన వస్తు సామాగ్రినన్నింటిని సమకూర్చు కొనగలడు. కావున భూమినిచ్చిన యెడల తక్కినవానినన్నింటిని ఇచ్చినట్లేయగును. మిగిలిన దానములన్నియు దానియందిమిడియే యున్నవి.

**భూదానము** గురించి మహాభారతములో శ్రీవ్యాసభగవానుడు క్రిందివిధముగా చెప్పియున్నాడు :

**శ్లో॥ సర్వేషామేవ దానానాం భూమిదానం పరం స్మృతమ్ ।**
**సర్వపాపహరం తద్వత్స్వర్గమాహుర్మనీషిణః ॥ (–మ.భార)**

'సమస్త దానములలో భూదానము పరమశ్రేష్ఠమైనదని ఋషుల యభిమతము. ఇది సమస్త పాపములను హరించును. మానవునకు స్వర్గప్రాప్తిని గలిగించును'.

భూదానము మహాపాపముల సహితము హరించునని శాస్త్రము నుడువుచున్నది. ఇక సామాన్య పాపముల గురించి విచారించనేల!

**శ్లో॥ ముచ్యతే బ్రహ్మహా గోఘ్నః పితృఘ్నో గురుతల్పగః ।**
**భూమిం సర్వగుణోపేతాం దత్త్వా నాత్ర విచారణా ॥ (మ.భార)**

'బ్రహ్మహత్యాపాతకుడైననూ, గోహత్యాపాతకుడైననూ, పితృహత్యాపాతకుడైననూ, గురుద్రోహియైననూ, సర్వగుణోపేతమయిన (సకల వనరులు గలిగిన) భూమిని యోగ్యుడైనవానికి దానమిచ్చిన యెడల తన మహాపాపము నుండి విముక్తుడగును. దానిలో సంశయమేమియు లేదు'.

## గోదానము :

గోదానము గూడ మిక్కిలి శ్రేష్ఠమైనదియే యగును. దానివలన గూడ విశేషమైన పుణ్యము లభించును. భీష్ముడు గోదానమును గురించి యుధిష్ఠిరునితో నిట్లుచెప్పెను.

**శ్లో॥ న గోదానాత్పరం దానం కించిదస్తీతి మే మతిః ।**
**సా గౌర్న్యాయార్జితా దత్తాకృత్స్నం తారయతే కులమ్ ॥ (మ.భార.)**

'గోదానమునకు మించిన దానమేదియు లేదని నాయొక్క అభిప్రాయము. కాని, ఆ గోవు న్యాయార్జితమైయుండవలయును. అట్టి గోవును యోగ్యుడైనవానికి దానమిచ్చినయెడల, తత్ఫలితము దాత యొక్క వంశమునంతటిని తరింపచేయును'.

మరియు, గోదానము వలన బ్రహ్మలోకమును సహితము పొందవచ్చునని మహాభారతము చెప్పుచున్నది.

**శ్లో॥ గోప్రదానాన్నరో యాతి బ్రహ్మలోకం సనాతనమ్ ।**
**విమానేనార్కవర్ణేన దివ్యరత్నవిరాజతా ॥ (-మ.భారతం)**

'శుభలక్షణములు గలిగిన గోవును దానమిచ్చిన నరుడు ధవళవర్ణమును బొంది, దివ్యర్నతములతో నలంకరింపబడిన విమానమునందు విరాజమానుడై శాశ్వతమగు బ్రహ్మలోకమునకు బోవును. అచట బ్రహ్మతో సమానముగా సకల భోగముల ననుభవించును'.

## అన్నదానము :

భూదాన, గోదానముల వలె అన్నదానము గూడ మిక్కిలి శ్రేష్ఠమైనది యనియే చెప్పవచ్చును. ఇతర దానములకంటె దీనిలో ఒక విశేషమైన లక్షణమున్నది. ఇతర దానములలో మనము ఎంత ఇచ్చినప్పటికీ మానవుని తృప్తిపరచలేము. కాని, అన్నదానమట్లుగాదు. వ్యక్తి తనకు కావలసినంత భుజించిన వెనుక తృప్తిచెందును. తీవ్రమైన ఆకలితో నున్న వ్యక్తికి అన్నమిడుట వలన ప్రాణరక్షణ గూడ జరుగును. అందుచేత అన్నదానము తృప్తికరమును మరియు ప్రాణదాయకమును అగుచున్నది.

అన్నదానమును గురించి భీష్మపితామహుడు యుధిష్ఠిరునితో నిట్లు వచించినాడు.

**శ్లో॥ నాన్న దానాత్పరం దానం కించిదస్తి నరేశ్వర! ।**
**అన్నేన ధార్యతే కృత్స్నం చరాచరమిదం జగత్ ॥ (మ.భార.)**

'ఓ రాజా! అన్నదానము కంటె ఉత్తమమైన దానము మరియొకటి లేదు. ఈ జగత్తులోని ప్రాణికోటియంతయు అన్నముచేతనే సంరక్షింపబడుచున్నది'.

అన్నము లేనియెడల ప్రాణులు జీవింపజాలవు. కావున, అన్నదాత ప్రాణదాతయే యగుచున్నాడు.

మరియు, భీష్ముడిట్లు బోధించెను :

**శ్లో॥ అన్నేన సదృశం దానం న భూతం న భవిష్యతి ।**
**తస్మాదన్నం విశేషేణ దాతుమిచ్ఛంతి సాధవ ః ॥ (-మ.భార.)**

'అన్నదానముతో సమానమగు దానము భూతకాలములో ఉండియుండలేదు. భవిష్యత్తులో ఉండబోదు. కనుక సత్పురుషులు అన్నదానమొనర్చుటకు ఉత్సుకులై యుందురు'.

దానము చేయబడు ఆహారము న్యాయార్జితమైనదియు, సాత్త్వికమైనదియు, పరిపక్వమైనదియునై యుండవలెను.

దానము (దానము చేయకపోవుట) వలన గలుగు దోషమును మన ఇంటికి భిక్షకైవచ్చు యాచకుడు మనకు బోధించుచున్నాడు. అతను "నేను గతజన్మలో దానం చేయకపోవుట వలన, దరిద్రంతో ఈ సంచి నా చేతికి వచ్చినది. మీరు ఈ జన్మలో దానం చేయని యెడల వచ్చే జన్మలో ఈ సంచి మీ చేతికి వస్తుంది". అని మనకు బోధిస్తున్నాడు :

**శ్లో॥ అదాన దోషేణ భవేద్దరిద్రో దారిద్ర్య దోషేణ కరోతి పాపమ్ ।**
**పాపాదవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రః పునరేవ పాపీ ॥**

'దానం చేయకపోవుటవలన దరిద్రం సంభవిస్తుంది. దరిద్రం పాపపు పనులు చేయిస్తుంది. దానివలన నరకం ప్రాప్తిస్తుంది. నరకం తరువాత మరల దరిద్రుడుగానే జన్మించి పాపపు పనులే చేస్తూయుంటాడు'.

కావున, ఈ విషచక్రమునుండి తప్పించుకొనవలయునంటే, మానవుడు తన శక్తికొలది ఏదో ఒకదానమును చేస్తూయుండవలయును. అప్పుడే ఈ విషవలయ మును ఛేదించి బయటపడగలడు.

సజ్జనులు తమ శక్త్యానుసారముగా దానమొనర్చి, భగవత్కృపాపాత్రులై మోక్షమును బడయుదురు గాక!

## 11. ఆహార నియమము :-

సనాతన ధర్మము ఆహారము యొక్క ప్రాముఖ్యతను, దానిని భుజించు విధానమును చక్కగా బోధించుచున్నది.

**"లోకస్య ఆహారం స్థిత్యుత్పత్తి వినాశ హేతుః, ఆహారాదేవ అభివృద్ధిః బలం ఆరోగ్యం వర్ణేంద్రియ ప్రసాదశ్చ". -(సుశ్రుత సంహిత, సూత్రం -46)**

28657



'మనము భుజించే ఆహారమే ప్రపంచములో ఉత్పత్తి, స్థితి, వినాశాలకి కారణము. ఆహారము శరీరవృద్ధిని, శరీర బలమును, శరీరారోగ్యమును, శరీర వర్ణమును, ఇంద్రియములకు ప్రసన్నత్వమును ప్రసాదించును' అని సుశ్రుత సంహిత వివరించుచున్నది.

మనము ఎటువంటి ఆహారమును భుజించవలయును, ఏవిధముగ భుజించ వలయును అనిన విషయమును ఈ క్రిందిశ్లోకము చక్కగా తెలుపుచున్నది.

**శ్లో॥ హితం భుంజ్యా న్మితం భుంజ్యాత్ న భుంజ్యాదమితం హితమ్ ।**
**హిత మిష్టం చ భుంజీయాత్ ఏష ధర్మ స్సనాతనః ॥**

'హితమైన పదార్థములనే భుజించవలయును. అవైనా మితంగానే భుజించ వలయును. హితమైనదిగదా యని అమితముగా భుజింపరాదు. హితమైనవి ఇష్టంగా వున్నంతవరకే భుజించాలి. ఇదే సనాతనమైన ధర్మము.'

సాత్త్విక ప్రకృతిగల సజ్జనులు ఎటువంటి ఆహారమును ఇష్టపడుదురో కృష్ణ పరమాత్మ భగవద్గీతలో వివరించినాడు.

**శ్లో॥ ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।**
**రస్యా స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః॥ (భగ.17-8)**

'ఆయుస్సును, ఉత్సాహమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధిపొందించునవియు, రసయుక్తములు, స్నిగ్ధములు, స్థిరముగా నుండునవి, మనోహరములైనవి అగు ఆహారములు సాత్త్విక ప్రకృతిగలవారికి ఇష్టములు'.

కావున, హితమైన సాత్త్విక ఆహారమును మితముగా భుజించవలయునని సనాతనధర్మము బోధించుచున్నది.

ప్రతివ్యక్తియు ఏఏ మోతాదులలో ఆహారమును భుజించవలయునో ఈ క్రింది సూక్తి బోధించుచున్నది.

**శ్లో॥ ద్వౌ భాగౌ పూరయేదన్నై స్తోయేనైకం ప్రపూరయేత్ ।**
**మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్ ॥**

'ఉదరములో రెండుభాగములు అనగ సగము అన్నముచేతను, ఒక భాగము జలము చేతను నింపవలయును. మిగిలిన ఒక భాగము గాలి సంచరించుటకై వదల వలయును'.

మనచేత భుజింపబడిన ఆహారము ఉదరములో ఏవిధముగ పరివర్తన జెందు చున్నది ఈ క్రింది సూక్తులు చక్కగా వర్ణించుచున్నవి :

**శ్లో॥ అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్ని నా ।**
**మలం స్థవిష్ఠో భాగ స్స్యాత్ మధ్యమో మాంస తాం వ్రజేత్ ॥**

**శ్లో॥ మనః కనిష్ఠో భాగ స్స్యాత్ తస్మా దన్నమయం మనః ॥**

'మానవుడు భుజించు ఆహారము జఠరాగ్నిచేత జీర్ణింపబడి మూడువిధములుగ పరిణమించును. అందులో స్థూలభాగము మలముగను, మధ్యమభాగము మాంసముగాను, ఆఖరిభాగము మనస్సుగను పరివర్తన చెందును. అందువలన మనస్సు అన్నమయమే యగుచున్నది.

ఇదే సత్యమును ఛాందోగ్యోపనిషత్తు దృఢీకరించుచున్నది.

**శ్లో॥ అన్నమశిత స్త్రేధా విదీయతే తస్య యః స్థవిష్ఠో ధాతు**
**స్తత్పురీషం భవతి యోమధ్యమ స్తన్మాగ్ంసం యోఽణిష్ఠస్తన్మనః**

'మానవునిచేత భుజింపబడిన ఆహారము మూడువిధములుగ మారుచున్నది. స్థూలభాగము మలమగుచున్నది. మధ్యమభాగము మాంసముగను, సూక్ష్మాంశము మనస్సుగను అగుచున్నది'.

పై సూక్తులను బట్టి మనస్సు మనము భుజించు ఆహారముపై ఆధారపడి యున్నట్లు నిర్ధారణమగుచున్నది.

మానవుని వ్యక్తిత్వము అతని యొక్క స్వభావముపైనను, స్వభావము మనస్సుపై నను, మనస్సు అతను భుజించు ఆహారముపైనను ఆధారపడియున్నవి. కావున, మానవుని వ్యక్తిత్వము అతను భుజించు ఆహారముపై ఆధారపడియున్నట్లు తెలియుచున్నది. మానవుడు సాత్త్విక ఆహారము భుజించుచున్న ఎడల సాత్త్వికమైన వ్యక్తిత్వమును, తామసిక ఆహారమును భుజించుచున్న యెడల తామసిక వ్యక్తిత్వమును కలిగియుండును.

కాబట్టి, ప్రతి మానవుడు సాత్త్వికాహారమును భుజించుచు, సాత్త్వికమైన వ్యక్తిత్వమును గలిగియుండమని సనాతనధర్మము బోధించుచున్నది.

యతీశ్వరులకు ప్రత్యేకముగ యీ క్రింది భోజన నియమములను శాస్త్రము విధించుచున్నది :

**శ్లో॥ హితం మితం సదాఽశ్నీయాత్ యత్సుఖేనైవ జీర్యతే ।**
**ధాతః ప్రకుప్యతే యేన తదన్నం వర్జయే ద్యతిః ॥**

'యతీశ్వరుడు హితమైనదియు, మితమైనదియు, సులభముగ జీర్ణమగునది యునగు ఆహారమును భుజించవలయును. ధాతు ప్రకోపమును (కామోద్రేకమును) గలిగించు ఆహారమును అతడు విసర్జింపవలయును'.

**శ్లో॥ మితాశనో భవేన్నిత్యం భిక్షుః మోక్షపరాయణః ।**
**కామక్రోధాదయో దోషా న భవంతి మితాశనాత్ ॥**

'మోక్షమును గోరు యతి ఎల్లప్పుడు మితాహారియై యుండవలయును. మితముగ భుజించుట వలన కామక్రోధాది దోషములు జనింపవు'.

మానవుడు అధికముగ భుజించుట వలన తామస ప్రవృత్తి ప్రబలమై దుష్టులతో సహవాసమొనరించుచు, విషయలోలుడై దుష్టకార్యముల జేయుచు భ్రష్టుడగు చున్నాడు.

అధికముగా భుజించుట వలన సంభవించు నష్టములను క్రింది శ్లోకము వివరించుచున్నది :

**శ్లో॥ అత్యాహారః ప్రయాస శ్చ ప్రజల్పో నియమగ్రహః ।**
**జనసంగ శ్చ లౌల్యం చ షడ్భి ర్యోగో వినశ్యతి ॥ (-హఠయోగ ప్రదీపక)**

'అతిగా భుజించుట వలన ఆయాసము, లౌకిక ప్రసంగమునందాసక్తి, సభా భోజనాదులకు కాచుకొనుట, జిహ్వాచాపల్యము, దుష్టసాంగత్యము, విషయ లోలత్వము అను ఆరుదోషములు కలుగుచున్నవి. అందువలన యోగము నశించుచున్నది'.

యోగాభ్యాసపరుడు ఎలా భుజించాలి అనిన, ఆ విషయమును **గణేశగీత** చక్కగా తెలుపుచున్నది :

**శ్లో॥ నాతిభుంజ స్సదా యోగీ నాభుంజ న్నాతినిద్రితః ।**
**నాతిజాగ్రత్సిద్ధి మేతి భూప! యోగం సదాభ్యసన్॥ (-గణేశగీత)**

'ఓ రాజా! ఎల్లప్పుడు యోగియైనవాడు అతిగ భుజింపరాదు, కేవలము ఉప వసింపను రాదు. ఎక్కువగా నిద్రింపరాదు, అటులని అతిగా మేల్కొని యుండను రాదు. ఇట్టి నియమములను పాటించు యోగి సిద్ధిని బొందును'.

మోక్షమును గోరువాడు ఆధ్యాత్మసాధనకు అనుకూలమైన ఆహారమును మిత ముగ భుజించవలయును. అతిగ భుజించువానికి గాని, అసలు భుజింపనివానికి గాని ఆత్మనిష్ఠయందు మనస్సు స్థిరత్వమును బొందజాలదు.

ఇదే విషయమును శ్రీకృష్ణపరమాత్మ గూడ భగవద్గీతలో బోధించినాడు.

**శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।**
**యుక్త స్వప్నావబోధస్య యోగీ భవతి దుఃఖహా ॥ (భ.గ. 6-17)**

'పరిమితమగు ఆహారవిహారములు, పరిమితమగు నిద్రాజాగరణములు యోగికి అత్యవసరమని గీత నుడువుచున్నది.

సాధారణమానవులు, యోగాభ్యాసపరులు ఆచరించవలసిన ఆహార నియమము లను పై సూక్తుల ద్వారా సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

## 12. ఇంద్రియ నిగ్రహము :

మానవుని యొక్క పురోభివృద్ధికి ఇంద్రియ నిగ్రహము అత్యవసరము. ముఖ్యముగా సాధకుల విషయములో ఇది అనివార్యమైనది. ఇంద్రియ నిగ్రహము లేని వ్యక్తి ఏ కార్యమునైనను సాధింపజాలడు. ఇంద్రియ నిగ్రహము లేని మానవుడు వ్యక్తిత్వమును కోల్పోవును. ఇంద్రియ నిగ్రహము గలిగిన వ్యక్తియే పురుషార్థములను సాధించగలడు.

పురుషార్థములను సాధింపదలచినవానికి ఇంద్రియములు పరమశత్రువులని కృష్ణ పరమాత్మ భగవద్గీతలో పేర్కొన్నాడు :

**శ్లో॥ ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్నవశమాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ ॥ (3-34)**

'ప్రతి ఇంద్రియమునకు అనుకూల విషయములయందు రాగము, ప్రతికూల విషయములయందు ద్వేషము విశేషముగ నుండును. కావున మానవుడు ఇంద్రియ ములకు వశము కాగూడదు. పురుషార్థములను సాధింపదలచిన వానికి ఇవి పరమశత్రువులు'.

మానవుని యొక్క పతనమునకు ఒక్క ఇంద్రియమే చాలును. ఏ ఒక్క ఇంద్రి యమునకున్నూ మానవుడు లొంగిన యెడల, ఆ ఒక్క ఇంద్రియమే మానవుని సర్వనాశనము చేయగలదు. ఇదే సత్యమును కృష్ణపరమాత్మ భగవద్గీతలో చక్కగా వర్ణించినాడు :

**శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనో౽నువిధీయతే ।**

**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభ సి ॥ (2-67)**

'విషయములందు సంచరించు ఇంద్రియములలో ఏ ఒక్క ఇంద్రియమునైననూ మనస్సు అనుసరించినచో, ఆ ఇంద్రియము వాయువు నీటిలో నావికుడు లేని నావను వలె జితేంద్రియుడు కానివాని బుద్ధిని హరించును'.

ఇంద్రియములు అతి బలవత్తరములైనవి. ప్రపంచములో మానవుడు ఎంత జాగ్రత్తగా మెలగుచున్నప్పటికి, ఇంద్రియములు బలవంతముగ అతని యొక్క మనస్సును విషయములలోనికి ఆకర్షింపజూచును. కావున మనిషి జాగరూకుడై యుండవలెను.

ఇదే విషయమును కృష్ణ పరమాత్మ భగవద్గీతలో ఇట్లు చెప్పినాడు.

**శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।**

**ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ (భగ.2-60)**

'అర్జునా! ప్రయత్నశీలుడును, వివేకియునగు పురుషుని యొక్క మనస్సును సహితము వినాశకరములగు ఇంద్రియములు బలవంతముగ విషయములలోనికి లాగగలవు (ఆకర్షింపగలవు)'.

ఈ ఆకర్షణనుండి తప్పించుకొనుటకు మార్గమును కృష్ణ పరమాత్మ ఉపమాన పూర్వకముగ చక్కగా బోధించినాడు :

**శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మో౽ంగా నీవ సర్వశః ।**

**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ (భగ.2-58)**

'తాబేలు తన అవయవములను లోనికి లాగుకొనునట్లు, ఎవ్వడు శబ్దాది విషయములనుండి తన ఇంద్రియములను ఉపసంహరించుకొనునో వాని ప్రజ్ఞ స్థిరముగ నుండును'.

ఇంద్రియ-విషయములను ఎంత అనుభవించినప్పటికిని, మానవునికి తృప్తి కల గదు. అనుభవించు కొలది ఇంకను అనుభవించవలయుననెడి కోరిక వృద్ధి పొందు చునే యుండును. దీనినే మనుస్మృతి సోదాహరణ పూర్వకముగా వివరించుచున్నది

**శ్లో॥ న జాతు కామః కామానాముప భోగేన శామ్యతి ।**

**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ (మను. II-94)**

'అగ్నిలో హవిస్సును పోసినపుడు అగ్ని ఇంకను వృద్ధిపొందినట్లు, ఇంద్రియ-విషయముల ననుభవించుకొలది విషయ-వాంఛ వృద్ధియగునే కాని తగ్గదు'

ఇంద్రియములనెట్లు వశపఱచుకొనవలయునో మనుస్మృతి బోధించుచున్నది

**శ్లో॥ న తథైతాని శక్యన్తే సంనియన్తుమసేవయా ।**

**విషయేషు ప్రజుష్టాని యథా జ్ఞానేన నిత్యశః ॥ (మను. II-96)**

'విషయములలో విహరించు ఇంద్రియములు నిరోధించుట చేత వశపరచు కొనబడవు. వాటిని జ్ఞానము (వివేకము) చేత వశపరచుకొనవలయును'.

పంచేంద్రియములలో ఏ ఒక్క ఇంద్రియమైననూ మన మనస్సును వశపరచుకొనిన యెడల, ఆ ఒక్క ఇంద్రియమే వినాశకారకమగునని కృష్ణపరమాత్మ భగవద్గీతలో నుడివినట్లుగానే, మనుస్మృతి గూడ ఈ విషయమును చక్కని ఉపమానముతో వివరించినది :

**శ్లో॥ ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్ ।**

**తేనాస్య క్షరతి ప్రజ్ఞా ధృతేః పాదాదివోదకమ్ ॥ (మను. II-99)**

'ఘటమునకు ఏ ఒక్క చిన్నరంధ్రమున్నప్పటికి ఘటములోని నీటిని ఖాళీ చేయునట్లు, పంచేంద్రియములలో ఏ ఒక్క ఇంద్రియమైనను విషయాసక్తమై యుండిన యెడల ఆ ఒక్క ఇంద్రియమే వివేకమును నశింపచేసి, పతన కారణమగును'.

ఇప్పుడు మనుస్మృతి జితేంద్రియునియొక్క లక్షణములను చక్కగా వర్ణించుచున్నది

**శ్లో॥ శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః ।**

**న హృష్యతి గ్లాయతివా స విజ్ఞేయో జితేంద్రియః ॥ (మను. II-98)**

'ఏ మానవుడైతే ఇంద్రియ-విషయములలో మెలగుచు గూడ వాటిచేత

ప్రభావితుడు గాక ఆహ్లాదమును గాని, దుఃఖమును గాని పొందక యుండునో, అతడు 'జితేంద్రియుడు'గా తెలియబడును.

తరువాత, మానవుడు పురుషార్థములను ఎలా సాధించవలయునో చక్కగా బోధించుచున్నది :

**శ్లో॥ వశే కృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మనస్తథా ।**
**సర్వాన్ సంసాధయేదర్థా న క్షిణ్వన్యోగతస్తనుమ్ ॥**

'యోగముచేత దేహమును కృశింపచేయక, ఇంద్రియములను వశపఱచుకొని, మనస్సును సంయమించి మానవుడు పురుషార్థములను సాధించవలెను'.

ఇంద్రియములను ఎట్లు వశపఱచుకొనవలయునో మహోపనిషత్తు చక్కని ఉపమానము ద్వారా బోధించుచున్నది :

**మం॥ ఉత్థితానుత్థితానేతా నిన్ద్రియాదీన్పునః పునః ।**
**హన్యా ద్వివేకదండేన వజ్రేణేవ హరిర్గిరీన్ ॥ (మహోపనిషత్)**

'పై పైకి లేచుచున్న ఇంద్రియ శత్రువులను వివేకమనుదండముతో, ఇంద్రుడు వజ్రాయుధముతో పర్వతపక్షములను నరికినట్లుగా, మాటిమాటికి కొట్టుచుండవలెను'.

ఇంద్రియములను జయించినవాడే సర్వమును జయించినవాడగునని యోగశిఖోపనిషత్తు బోధించుచున్నది.

**మం॥ ఇన్ద్రియాణి మనోబుద్ధిః కామక్రోధాదికం జితమ్ ।**
**తేనైవ విజితం సర్వం నా సౌ కేనాపి బాధ్యతే ॥ (యోగశిఖోపనిషత్)**

'ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, కామక్రోధాదికములను జయించినవానిచే సర్వము జయింపబడినదగుచున్నది. అతడు దేనిచేతను ఇంక బాధింపబడడు'.

ఇంద్రియ నిగ్రహము లేక భోగములయందు తగుల్కొనిన మానవుని ప్రజలెట్లు అసహ్యించుకొందురో శ్రీమద్వాల్మీకి రామాయణము చక్కగా వర్ణించుచున్నది :

**శ్లో॥ సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిమ్ ।**
**లుబ్ధం న బహు మన్యన్తే శ్మశానాగ్ని మివ ప్రజాః ॥(వాల్మీకి రామాయణం)**

'రావణా! ప్రాపంచిక గ్రామ్యభోగములయందు తగుల్కొని కామమే తన వృత్తిగా

భావించి, లోభగుణములతో మునిగి తేలుతూ ఉన్న రాజును శ్మశానాగ్నిని చూచి భయపడినట్లు చూస్తూ ప్రజలు మన్నింపజాలరు'.

ఈ మాటలు శూర్పణఖ రావణునితో చెప్పినది. ఇందులో విశేషమేమనగా- శూర్పణఖ లాంటి మహారాక్షసి ఈ మాటలు చెప్పినదంటే, ఇంద్రియ నిగ్రహము యొక్క ఆవశ్యకతను మనము అర్థముజేసికొనవలెను.

కావున, ప్రతిమానవుడు ఇంద్రియనిగ్రహమును గలిగియుండి పరమ పదమును పొందును గాక! యని సనాతన ధర్మము ఆశించుచున్నది.

## 13. విధ్యుక్త కర్మాచరణ :

వేద సమ్మతమైన కర్మను 'విధ్యుక్త కర్మ' యందురు. వేదస్మృతి, పురాణేతి హాసములలో విధింపబడిన కర్మలనే మానవుడాచరించవలయుననియు, తద్విరుద్ధ కర్మలను త్యజించవలయుననియు సనాతనధర్మము ప్రబోధించుచున్నది.

మానవునకు కర్మయే ఫలము నిచ్చును. కర్మననుసరించి ఫలముండును. శుభ కార్యముల నొనర్చిన శుభఫలమును, అశుభ కార్యములనొనర్చిన అశుభ ఫలమును మానవుడు పొందును. దానినే మనుస్మృతి చక్కగా వివరించినది :

**శ్లో॥ శుభాశుభ ఫలం కర్మ మనోవాగ్దేహ సంభవమ్ ।**
**కర్మజా గతయో నృణాముత్తమాధమ మధ్యమాః॥ (మను.XII-3)**

'మనోవాక్కాయ కర్మలచే శుభాశుభ ఫలములు లభించుచున్నవి. మంచి, చెడు, మిశ్రమ ఫలములు కర్మపై ఆధారపడియున్నవి.'

కావున, మానవుడు శుభకార్యాచరణ వలన మంచిఫలమును పొందునని నిశ్చ యింపబడినది. శుభకర్మలనగానేమి యను విషయమును క్రింది శ్లోకము వివరించు చున్నది :

**శ్లో॥ వేదోదితం స్వకం కర్మ నిత్యం కూర్యాదతంద్రితః ।**
**తద్ధి కుర్వన్యథాశక్తి ప్రాప్నోతి పరమాం గతిమ్ ॥ (మను.IV-14)**

'వేదములచే విధింపబడిన స్వకర్మలను మానవుడు ఎల్లప్పుడు ఆచరించ వలయును. అటుల యథాశక్తి ఆచరించుట వలన పరమపదము ప్రాప్తించును.

విధ్యుక్త కర్మను ఎట్టి పరిస్థితులలోను ఆచరించవలయుననియు, నిషిద్ధ కర్మను ఎటువంటి విషమ స్థితిలోనైనను త్యజించియే తీరవలయుననియు సనాతనధర్మము బోధించుచున్నది.

శ్లో॥ అకర్తవ్యం నకర్తవ్యం ప్రాణైః కంఠగతై రపి ।
కర్తవ్యమేవ కర్తవ్య మితి ధర్మవిదో విదుః ॥

'నిషిద్ధకర్మను కంఠమువరకు మునిగిపోయి ప్రాణముల మీదికి వచ్చినప్పటికి చేయరాదు. విధ్యుక్త కర్మను ప్రాణములు పోవు పరిస్థితి సంభవించినప్పటికి చేసియే తీరవలయును. ధర్మవిదులు (ధర్మమును తెలిసినవారు) దానిని (విధ్యుక్త కర్మను) ఆచరించుటయందే నిలకడ కలిగియుండవలయునని తెలియుదురు'.

విధ్యుక్త కర్మాచరణ వలన లభించు శుభఫలములను మనుస్మృతి వివరించుచున్నది

శ్లో॥ తేషు సమ్యగ్వర్తమానో గచ్ఛత్యమరలోకతామ్ ।
యథా సంకల్పితాం శ్చేహ సర్వాన్కామా న్సమశ్నుతే ॥ (మను. II-5)

'విధ్యుక్త కర్మలను సక్రమముగా ఆచరించుట వలన మానవుడు పరలోక అమృతత్వమును, ఇహలోక కామ్యార్థములను పొందగలడు'.

మరియు, విద్యుక్త కర్మల నాచరించుట వలన మానవుడు ఈ ప్రపంచములో కీర్తిని, పరలోకములో సుఖములను బడయగలడని మనుస్మృతి ప్రబోధించుచున్నది.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్హి మానవః ।
ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్ ॥ (మను. II-9)

'శ్రుతి, స్మృతులలో చెప్పబడిన విధ్యుక్త కర్మలను ఆచరించుట వలన మానవుడు ఈ లోకములో కీర్తిని, పరలోకములో సుఖములను పొందగలడు'.

శ్రీకృష్ణపరమాత్మ గూడ ఇదే అంశముపై భగవద్గీతలో విపులముగా విశదీ కరించినాడు :

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ (భగ. 3-35)

'చక్కగ నాచరింపబడు పరధర్మము కంటె దోషముతో గూడిన స్వధర్మము

శ్రేష్ఠమైనది. స్వధర్మాచరణమున మరణించుటయే శ్రేష్ఠము. పరధర్మము భయమును గలుగజేయును'.

శ్రీకృష్ణపరమాత్మ విధ్యుక్త కర్మాచరణమున శరీరము పోయినను జీవునికి అక్షయ సుఖము లభిస్తుంది, స్వర్గసుఖముల ననుభవింపగలవని చెప్పి, తనకు విధ్యుక్త కార్యమయిన యుద్ధమునందే అర్జునుని స్థిరుడుగా ఉండునట్లు చేసియున్నాడు. కాబట్టి, చేయదగని కార్యమును వదిలిపెట్టి తనకు విధ్యుక్తమైన కార్యమును ఎట్టి పరిస్థితుల లోను తప్పక ఆచరింపవలయును.

## 14. కాలము యొక్క సదుపయోగము :

కాలము యొక్క విలువను మరియు దానియొక్క సదుపయోగమును గురించి సనాతనధర్మము క్రిందివిధముగ బోధించుచున్నది.

శ్రీ పరమాత్మయొక్క ఈ విచిత్రమైన సృష్టిలో మనుష్య-శరీరము ఒక అమూల్యమైన మరియు విలక్షణమైన వస్తువు. ఇది మానవోన్నతికి ఒక సర్వోత్తమ సాధనము. ఇది ప్రాప్తించిన తరువాత మానవజన్మను సార్థకము చేసికొనుటకు ఎల్లప్పుడు ప్రయత్నించ వలయును. ఇందుకొరకు ప్రప్రథమముగా లక్ష్యమును నిశ్చయించు కొనవలయును. మానవుడు ఎప్పటివరకు తనయొక్క జీవన-లక్ష్యమును నిశ్చయించుకొనడో, అప్పటివరకు అతనిని 'మనుష్యుడు' అని చెప్పుటకు గూడ యోగ్యుడు కాడు. ఎలాగైతే మనుష్య-శరీరము సర్వోత్తమమైనదో, అలాగుననే దానియొక్క లక్ష్యమును సర్వోత్తమమై యుండవలయును. ఈ ప్రపంచములో సర్వోత్తమమైన వస్తువు **'పరమాత్మ'.** అందువలన మానవ-జీవనము యొక్క సర్వోత్తమ లక్ష్యము **'పరమాత్మ-ప్రాప్తి'** అయియుండవలెను. ఎందువలననగా-దానిని పొందిన మానవుడు దానికంటె అధికమైన మరియొక లాభమును ఎన్నడు తలంపడు. ఈ విషయమును శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో స్పష్టపరచినాడు.

**"యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః"** అని భగవానుడు చెప్పినాడు.

ఈ 'పరమాత్మ-ప్రాప్తి' కొరకు అన్నిటికంటె ప్రప్రథమమైనది మరియు అతి ముఖ్యమైన సాధనము **'మనుష్య-జీవనము యొక్క సమయమును సదుపయోగపరచుట'**

సమయము చాల అమూల్యమైన వస్తువు. సామాన్యముగా ప్రజలు ధనమునకు

ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుదురు. కాని, వాస్తవముగా విచారించిన ధనము కంటెను సమయము చాలా విలువ గలిగిన వస్తువు. మనము సమయమును వెచ్చించి ధనమును గడింపవచ్చును. కాని ధనమునిచ్చి సమయమును కొనలేము. అంత్య కాలములో ఎప్పుడు ఆయుష్షు పూర్తియయినదో అప్పుడు ఎన్ని లక్షల రూపాయలు ఇచ్చినప్పటికి, ఒక్క గంట కాదు గదా ఒక్క నిమిషము గూడ ఆయుష్షును పెంచలేము. సమయమును వెచ్చించి విద్య గడింపవచ్చును, కాని విద్య చేత సమయమును గడింపలేము. కాలాంతర్గతములో ఒక్క మనిషి పదిమంది మనుష్యులను సృష్టించ గలడు- అనగా పరివారమును పెంచగలడు; కాని సమస్త పరివారము కలిసియు ఒక్క మనిషి యొక్క ఆయువును పెంచశక్యముగాదు. సమయమును సదుపయోగపరచి గొప్ప ప్రసిద్ధిని పొందవచ్చును; కాని ప్రసిద్ధి చేత వ్యక్తి యొక్క ఆయువును పెంచలేము. ఇలాగున అనేక దృష్టాంతములను చెప్పుకొనవచ్చును.

ప్రపంచములో ఎన్ని ఇతర వస్తువులను నష్టపోయినప్పటికి వాటిని మరల సంపాదించుకొనవచ్చును. కాని, నష్టపోయిన సమయమును తిరిగి సంపాదించలేము. గడిచిన క్షణము మరల తిరిగి రాదు. కాబట్టి, కాలములోని ప్రతి యొక్క క్షణమున్ను అతి విలువైనది.

ధనము మొదలగు వస్తువులు మనము ఖర్చుచేసిన యెడల ఖర్చగును, లేనియెడల నిలువయుండును. కాని, సమయము అట్లుకాదు. సమయము తనంతట తాను ఖర్చు అవుతూనే యుండును. ఖర్చు అగుట ఎప్పుడునూ ఆగదు. కావున కాలము యొక్క విలువను తెలిసికొని, ఒక్క క్షణమును గూడ నిరర్థకముగా నష్టపరచక, అతి జాగ్రత్తగా సమయమును సదుపయోగపరచవలెను.

కాలము యొక్క విలువ క్రింది విధముగా వర్ణింపబడినది :

**శ్లో॥ అయుషః క్షణ ఏకోఽపి సర్వ రత్నైర్న లభ్యతే ।**
**నీయతే తద్వృథాయేన ప్రమాదః సమహానహో ॥**

'ఆయుష్షు యొక్క ఒక్క క్షణకాలము వృథాగా గడచిపోయినచో, ఎన్ని రత్నములు వెచ్చించి అయినను ఆ క్షణమును తిరిగి తెచ్చుకొనలేము. కాబట్టి, జీవితమును వ్యర్థముగ గడిపివేయుట మహాప్రమాదము'.

మనము జీవితములో ఆచరించవలసిన సత్కార్యములెన్నియో యున్నవి. తెలిసి

కొనవలసిన విషయములెన్నియో యున్నవి. ఆయుష్షు అతి స్వల్పము, ఆటంకములు లెక్కకు మిక్కిలిగాయున్నవి. కాబట్టి, ఈ స్వల్పకాలములో ప్రతిక్షణమును అత్యంత జాగరూకతతో సదుపయోగపరచవలయును.

కాలమును వృథాబుచ్చుట మహాదోషమని శ్రుతిమాత నొక్కి వక్కాణించుచున్నది

**శ్లో॥ కాలస్యామూల్యతాం జ్ఞాత్వా తద్వ్యర్థాయాపనం మహా**
**దోషస్స్యా దితి నిశ్చిత్య సత్కాలక్షేప మాచర ॥**

'కాలము అమూల్యమైనది యని తెలిసికొని, దానిని వ్యర్థము జేయుట మహాదోషమని నిశ్చయించుకొని, కాలమును సదుపయోగమొనర్పుము'.

ఈ ప్రాకృతజగత్తు ఈశ్వర శాసనములపై ఆధారపడి నడచుచున్నది. ప్రతిరోజు ప్రొద్దున సూర్యుడు ఉదయించుట సాయంకాలము అస్తమించుట, వర్షములు సకాలములో పడుట, నియమిత కాలములో ఋతువులు సంభవించుట మొదలగు ప్రకృతి సంఘటనలన్నియు ఈశ్వర శాసనము ప్రకారమే సంభవించుచున్నవి. అలాగుననే గడచిన కాలము తిరిగి రాకపోవుటయు ఈశ్వర శాసనమే అయివున్నది. శ్రుతి వాక్యమును గమనింపుడు :

**శ్లో॥ ధనే నష్టే పునః ప్రాప్తుం శక్తి స్స్యాద్య స్య కస్యచిత్ ।**
**గత కాలస్తు నాయాతి ఏవ మీశ్వర శాసనమ్ ॥**

'ఎవడైన ధనమును పోగొట్టుకొనిన మరల సంపాదింప వచ్చును. కాని, గడచిన కాలము మాత్రము తిరిగి రాదనుట ఈశ్వర శాసనమై యున్నది'.

సమయమును సదుపయోగపరచుట కొఱకు, శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లుగా, ఒక రోజులోని సమయమును చక్కగా విభజించి సక్రమమైన పద్ధతిలో వినియోగించవలయును.

**శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ (భగ. 6-17)**

'పరిమితమగు ఆహారవిహారములు గలవాడును, కర్మలయందు యోగ్యమగు చేష్టలు గలవాడును నగు వ్యక్తికి యోగము సంసారక్లేశనాశకమగును'.

ఈ శ్లోకములో ప్రతిమానవుడు అవశ్యము చేయదగిన నాల్గు అంశములు

చెప్పబడినవి. ఈ నాల్గు అంశములకు యోగ్యరీతిలో సమయమును కేటాయించి సదుపయోగపరచవలెను. నాల్గు అంశములు - (1) యుక్త ఆహారవిహారములు (2) శరీర పోషణకై చేయదగిన ఉచిత చేష్ట (3) యోగ్య సమయమున నిద్రించుట (4) యోగ్య సమయమున మేల్కొనుట.

మొదటి అంశములో శరీరమును శక్తివంతముగాను, ఆరోగ్యవంతముగాను ఉంచుటకు కావలసిన శుభ్రత, స్నానము, విహారము, వ్యాయామము, అన్న పానీయములు, ఔషధసేవనము మొదలగు క్రియలన్నియు ఇమిడియున్నవి. రెండవ అంశము-మానవుడు తన వర్ణాశ్రమ ధర్మములను బట్టి తాను న్యాయయుక్తముగా నిర్వర్తించవలసిన కర్తవ్య కర్మలు చెప్పబడినవి. మూడవ అంశము-యోగ్య సమయములో నిద్రించుట. నాల్గవఅంశము - జాగరణ. రాత్రి సమయమందు ఆరుగంటలు మాత్రము నిద్రించి, మిగిలిన సమయమంతయు మేల్కొని యుండ వలయుననియు, దినములో ఉదయము-సాయంకాలము కనీసము ఆరు గంటలు సాధన కొరకు వినియోగించవలయుననియు ఈ అంశము సూచించుచున్నది.

ఈ జాగరణ సమయములో పరమాత్మ ప్రాప్తికి కావలసిన సాధనకు ఎక్కువ ప్రాముఖ్యము నీయవలెను.

ఈ సాధనను సకామ-భావముతో చేసినయెడల లౌకిక లాభమునిచ్చును. అదే సాధనను నిష్కామ-భావముతో చేసినయెడల అలౌకిక (పారమార్థిక) లాభమునిచ్చును. కాబట్టి, మనము అన్ని కర్మలను నిష్కామ-భావముతో ఆచరించవలయును. ఇంతవరకు మనకు లౌకిక (సంసారిక) లాభము నిచ్చుచున్న కర్మలే నిష్కామ భావముతో చేసినయెడల అలౌకిక లాభము నిచ్చుట మొదలిడును.

కావున, ప్రతి మానవుడు మొదట తన ధ్యేయమును నిర్ణయించుకొనవలయును. ఆ ధ్యేయము దృఢమై యుండవలయును. ధ్రువ నిశ్చయమున్న వ్యక్తికి ప్రకృతి గూడ అన్నివిధముల సహకరించును. ఈ లక్ష్యము పారమార్థికమై యున్నయెడల, మనము చేయు అతి సాధారణ క్రియలు గూడ అత్యంత అద్భుతమైన ఫలమునిచ్చి, భగవత్ప్రాప్తికి దోహదకారులగును. ఎవనియొక్క లక్ష్యము ధ్రువుని వలె దృఢమై లేక అచంచలమై యున్నదో, వానికి శీఘ్రమే సిద్ధి ప్రాప్తించును. అటువంటి వ్యక్తియొక్క మార్గములో ఎటువంటి విఘ్నములు గాని, బాధలు గాని రావు; ఒకవేళ వచ్చినప్పటికి అవి గూడ సహాయకారులుగా మార్పుజెందును.

ఈ ప్రపంచములోని మనుష్యులను మూడు విధములుగ విభజించవచ్చును- ద్వేషించువారు, ప్రేమించువారు మరియు ఉదాసీనులు. ధ్రువనిశ్చయమున్న వ్యక్తికి ఈ మూడువిధములైన వ్యక్తులును సహాయకారులే యగుచున్నారు. ధ్రువుని ద్వేషించుచున్న అతని సవతి-తల్లి సురుచి, తన తండ్రియొక్క పదవిని ప్రాప్తించుటకు భగవాన్ విష్ణువుని ఆరాధింపుమని ఉపదేశము నిచ్చెను. అతనిని ప్రేమించుచున్న స్వమాత సునీతియు ఆ ఉపదేశమును సమర్థించెను. అదేవిధముగ ఉదాసీనుడైన నారద మహర్షియు ఆ బాలుని అన్నివిధముల పరీక్షించి, అంత్యములో శ్రీవిష్ణు-భక్తినే బోధించి, మంత్రోపదేశము నిచ్చెను. దీనియొక్క తాత్పర్యమేమనగా- ఎవనియొక్క లక్ష్యము ధ్రువమై అచంచలమై యున్నదో వానికి ఎటువంటి విఘ్నము లేదు; ద్వేషి, ప్రేమి, ఉదాసీనుడు అందరును అతనికి విభిన్నరీతులలో సహాయకారులే యగుదురు.

కాని, హిరణ్యకశిపుని వలె ఎవనియొక్క లక్ష్యము పారమార్థికమయి యుండదో, వాని యొక్క క్రియలు ఎంత బలవత్తరమయినవి అయినప్పటికి, అవి వాస్తవిక-సిద్ధిని ఇవ్వలేవు. హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షునివలె తపస్సు చేసినవారు సృష్టిలో ఇంతవరకు ఎవ్వరు లేరని బ్రహ్మదేవుడు స్వయముగా వచించినాడు. వేలాది సంవత్సరములు తపస్సు చేసినప్పటికి వారికి వాస్తవిక -సిద్ధి లభించలేదు. కారణ మేమనగా- వారియొక్క లక్ష్యము పారమార్థికము కాదు, సాంసారికమై యుండెను.

కాబట్టి, మానవుడు తనయొక్క లక్ష్యము పారమార్థికమై యుండి, దానికి తోడుగా సమయమును సదుపయోగపరచిన యెడల లక్ష్య-సిద్ధిని పొందగలడు.

సాధకుని యొక్క లక్ష్యము మరియు మార్గము సరియైనవి అయినప్పటికి, భగవత్కృపపై విశ్వాసముండవలెను. “ఈ నా కార్యము సిద్ధించును, భగవానుని కృప నాపై పూర్తిగాఉన్నది” యను విశ్వాసము హృదయములో దృఢముగా ఉండవలెను.

కావున, కార్యసిద్ధికై సరియైన లక్ష్యము, సరియైన మార్గము, భగవత్కృపపై విశ్వాసము మరియు సమయము యొక్క సదుపయోగము - ఈ నాల్గును అతి ముఖ్యమైనవి.

శ్రీ భర్తృహరి ఇట్లు చెప్పినాడు -

**శ్లో॥ యావత్ స్వస్థ మిదం కలేవర గృహం యావచ్చ దూరే జరా**
**యావచ్చేంద్రియ శక్తిరప్రతిహతా యావత్ క్షయోనాయుషః।**
**ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్**
**ప్రోద్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీ దృశః ॥**

'ఎప్పటివరకు శరీరము ఆరోగ్యముగా నున్నదో, ఎప్పటివరకు వృద్ధావస్థ దూరముగా నున్నదో, ఎప్పటివరకు ఇంద్రియముల యొక్క శక్తి నష్టముగాకుండా ఉన్నదో మరియు ఎప్పటివరకు ఆయుస్సు క్షయముగాకుండా ఉన్నదో అప్పటి వరకు వివేకియైన వ్యక్తి ఆత్మకల్యాణము కొరకు మహాప్రయత్నమును సలుపుచునే యుండవలయును. అట్లుగాక, ఇంటిలో నిప్పంటుకున్న తరువాత బావిని త్రవ్వుట ప్రారంభించిన ప్రయోజనమేమి?'

కాబట్టి, ప్రతి మానవుడు సకాలములో సరియైన క్రియలొనర్చుచు, సమయమును సదుపయోగపఱచుచూ ఆత్మోన్నతిని పొందవలయునని సనాతన ధర్మము ఆశించుచున్నది.

మానవుడు త్యజించవలసిన కొన్ని దుర్గుణములను గురించి సనాతన ధర్మము ఏమి బోధించుచున్నదో విచారించెదము.

## 15. తృష్ణ లేక లోభం :-

నిర్వచనము :

**శ్లో॥ పర విత్తాదికం దృష్ట్వా నేతుం యోహృది జాయతే ।**
**అభిలాషా ద్విజశ్రేష్ఠ ! సలోభః పరికీర్తితః ॥**

'పరుల యొక్క ధనము మొదలగు వానిని చూచి, వాటిని పరిగ్రహించి తన స్వంతము చేసికొనవలెననెడి అభిలాష హృదయములో కలుగటనే 'తృష్ణ' లేక 'లోభం' అని చెప్పుదురు.'

దుర్గుణములలో కెల్ల తృష్ణ అతి బలవత్తరమయినది మరియు సర్వానర్థములకు మూల కారణము. మానవుని యొక్క పతనమునకు లోభమే కారణము. లోభం

ఉన్నవానికి మిగిలిన దుర్గుణములన్నియు ఉన్నట్లే. లోభియగు మానవుడు అత్యాశతో ధనమును కూడబెట్టును. తన నిత్యావసరములకు గూడ ఖర్చుచేయక, తాను అనుభవింపక, ఇతరులను అనుభవింపనీయక, లోభి బహు కష్టముల పాలగును. మానవుడు తృష్ణవలన ఇహ పర సుఖములను కోల్పోయి, దుఃఖముల ననుభవించును. సమాజంలో లోభియగు మానవుడు గౌరవప్రతిష్ఠలను బడయజాలడు. మానవుడు తృష్ణవలన పరవిత్తమునకై ప్రాకులాడుచు, నీచాతినీచమైన కార్యముల నొనర్చును.

"ఆశకు అంతులేదు" అను నుడివి మనము వింటూనే యున్నాము. ఎంత లభించినను తృష్ణ సంతుష్టి చెందదు. లభించుకొలది ఇంకా లభించవలెననెడి ఆశ పెరుగుతూనే యుండును. ఈ తృష్ణ ఎటువంటి ఉపద్రవము చేతగాని అంతమొందునదియు కాదు.

తృష్ణ ఎట్లు దినదినాభివృద్ధిని పొందునో ఈ క్రింది సూక్తి వివరించుచున్నది.

**శ్లో॥ యౌవనం జరయాగ్రస్త మారోగ్యం వ్యాధిభిర్హతమ్ ।**
**జీవితం మృత్యురభ్యేతి తృష్ణైకా నిరుపద్రవా ॥**

'మానవునికి బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధక్యం అనే నాల్గుదశలున్నాయి. అందులో యౌవనాన్ని వార్ధక్యం కబళించివేస్తుంది. ఆరోగ్యాన్ని వ్యాధులు నశింపచేస్తాయి. జీవితాన్ని మృత్యువు హరించును. తృష్ణ (ఆశ) మాత్రం ఏ ఉపద్రవము లేకుండా దినదినాభివృద్ధిని గాంచును'.

"ఆశాపాశము తా కడున్నిడువు లేదంతంబు" అని భాగవతం చెప్పినట్లుగా, ఆశ అనే త్రాడు ఎంత పొడవు ఉన్నదో ఎవరికిని అంతు చిక్కని విషయము. తృష్ణకు అంతం అంటూ కనిపించుట లేదు.

మనిషి పెరుగుకొలది తృష్ణ గూడ పెరుగుచునే యుండునను విషయమును చక్కని ఉపమానముతో క్రింది సూక్తి వర్ణించుచున్నది.

**శ్లో॥ యథా హి శృంగం గోః కాలే వర్ధమానస్య వర్ధతే ।**
**ఏవం తృష్ణాఽపి చిత్తేన వర్ధమానేన వర్ధతే ॥**

'గోవు పెరిగే కాలములో దానియొక్క కొమ్ములు గూడ పెరుగుచూనే యుండును.

అలాగుననే మనిషియొక్క వయస్సు పెరిగే కొలదీ అతని యొక్క మనస్సు, మనస్సుతో పాటు తృష్ణ గూడా పెరుగుచునే యుండును'.

తృష్ణాయుక్తమైన కష్టములు గూడా పెరుగుచునే యుండును. అందువలన వివేకియైన ముముక్షువు తృష్ణను వృద్ధిపొందనీయక వైరాగ్యాన్ని పెంచుకొని, సాధనను కొనసాగించవలయునని సనాతన ధర్మము బోధించుచున్నది.

ఈ క్రింది శ్లోకములలో తృష్ణ ఎలా పెరుగుతూ పోతుందో చక్కగా వర్ణింపబడినది:

**శ్లో॥ ఇచ్ఛతి శతీ సహస్రం ససహస్రః కోటిమీహతే కర్తుమ్ ।**
**కోటియుతోఽపి నృపత్వం నృపోఽపి బత చక్రవర్తిత్వమ్ ॥**

**శ్లో॥ చక్రధరోఽపి సురత్వం సురోఽపి సురరాజ్యమీహతే కర్తుమ్ ।**
**సురరాజోఽప్యూర్ధ్వగతిం తథాఽపి న నివర్తతే తృష్ణా॥**

'మానవుని యొక్క తృష్ణ మొదట నూరుతో ప్రారంభమవును. నూరు లభించిన వెనుక వెయ్యి కొరకు ఇచ్ఛ కలుగును. వెయ్యి లభించిన తరువాత కోటి కొఱకు, కోటి లభించిన వెనుక రాజత్వం కొఱకు, రాజత్వం లభించిన తరువాత చక్రవర్తిత్వం కొరకు, చక్రవర్తిత్వం తరువాత దేవత్వం కొఱకు, దేవత్వం లభించిన తరువాత ఇంద్రపదవి కొఱకు, ఇంద్రపదవి లభించిన వెనుక దానికంటె గొప్ప పదవి కొఱకు–ఇలాగున తృష్ణ పెరుగుచునే పోవును. అన్నిటికంటె గొప్ప పదవి లభించి నప్పటికీ తృష్ణ అంతటితో ఆగదు. తృప్తి పడదు'

కావున, తృష్ణకు అంతం అంటూ లేదు. అందువలన మానవుడు తృష్ణను వృద్ధిబొందనీయక, వైరాగ్యమును పెంచుకొని, లభించిన దానితో తృప్తిపడవలయునని సనాతనధర్మము బోధించుచున్నది.

తృష్ణ ఎంత బలవత్తరమైనదో యీ క్రింది సూక్తి వివరించుచున్నది :

**శ్లో॥ అపి మేరూపమం ప్రాజ్ఞమపి శూరమపి స్థిరమ్ ।**
**తృణీకరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమమ్ ॥**

'తృష్ణ చాలా బలవత్తరమైనది. అది ఎంత గొప్పవానినైనా వశపఱచుకొనును. మేరు పర్వతమంతటి ఉన్నతుడైనవానినైనా, మహావివేకియైనవాని నైనా, గొప్ప

శూరుడైనవానినైనా అది ఒక్క నిమిషములో తృణీకరిస్తుంది. వారిపై పెత్తనము చెలాయించి లొంగదీసుకుంటుంది'.

కాబట్టి, మానవుడు తృష్ణ యొక్క శక్తికి మించిన దృఢసంకల్పమును కలిగియుండి, దానినే లొంగదీసుకొని, అదుపులో నుంచవలయును.

ధనము లేనివాడు కాదు పేదవాడు, ఎంత ధనమున్నను తృప్తిపడక, ఇంకను కావలెనని ప్రాకులాడువాడే పేదవాడు. పేదరికానికి పరాకాష్ఠ లోభమే కాని ధనము లేకుండుట కాదు అని ఈ క్రింది సూక్తి చాటుచున్నది.

**శ్లో॥ దారిద్ర్యస్య పరామూర్తి స్తృష్ణా న ద్రవిణాల్పతా ।**
**జరద్గవధనశ్శంభుస్తథాఽపి పరమేశ్వరః ॥**

'దారిద్ర్యమునకు పరాకాష్ఠ తృష్ణయే కాని ధనము యొక్క కొరత కాదు. అధికముగా ధనము లేకున్నా ఉన్నదానితో సంతృప్తిని జెంది జీవించే వారెందరో గలరు. స్మశానములో నివసించే శంకరునికున్న ధనమంతా ఆయనకు వాహనమైన ముసలి నంది మాత్రమే. అయినప్పటికి ఆయన "పరమేశ్వరుడు"గా ప్రసిద్ధికెక్కినాడు'. పరమేశ్వరుడంటే మహాదేవుడనేగాక 'గొప్ప ధనికుడు' అని కూడా అర్థమున్నది.

కావున, ఉన్నదానితో తృప్తిపడేవాడే గొప్ప ధనవంతుడు గాని, అధికముగా ధనమున్నవాడు కాదు. అధికముగా ధనముండియు, తృప్తిలేక ధనము కొఱకు ప్రాకులాడువాడు పేదవాడుగానే పరిగణింపబడును.

శ్రీ భర్తృహరి ఈ క్రింది శ్లోకములో 'దరిద్రుడు' అనిన పదమునకు నిర్వచనము నిచ్చినాడు :

**శ్లో॥ స తు భవతు దరిద్రో యస్య తృష్ణా విశాలా ।**
**మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః ॥**

'ఎవడు విశాలమైన తృష్ణ (ఆశ)ను కల్గిఉంటాడో వాడే దరిద్రుడు. మనస్సు తృప్తిని జెంది సంతోషముగా ఉన్నయెడల 'ధనికుడు' 'దరిద్రుడు' అనెడి భేదమెక్కడ ఉన్నది?

అందుచేత ఉన్నదానితో తృప్తిపడడమే సుఖించడానికి రాజమార్గం కాని ధనాన్ని వృద్ధిజేసికొనుట కాదు.

తృష్ణ (లోభం) వలన సంభవించు అనర్థములను ఈ క్రింది సూక్తి స్పష్టముగా వివరించుచున్నది :

**శ్లో॥ లోభాత్ క్రోధః ప్రభవతి లోభాత్ కామః ప్రజాయతే ।**
**లోభాన్ మోహశ్చ నాశశ్చ లోభః పాపస్య కారణమ్ ॥**

'లోభము వలన క్రోధము జనించుచున్నది. లోభము వలననే కామం (విషయ భోగ లాలస) మరియు మోహము కూడా జనించుచున్నవి. లోభము వలననే మనిషికి నాశనము సంభవించును. లోభమే మానవుడు చేయు సర్వపాపములకు మూల కారణము.

కాబట్టి, ప్రతి మానవుడు సర్వానర్థములకు కారణమయిన తృష్ణను త్యజించి, వైరాగ్యము నభివృద్ధిచేసికొని, తృప్తిని బడసి, జీవితమును సుఖమయ మొనర్చుకొను గాక! యని సనాతన ధర్మము నిర్దేశించుచున్నది.

## 16. ద్వేషము :-

ఒక వ్యక్తిని జుగుప్సాభావముతో జూచుచు, అతనియందు వైరబుద్ధిని పెంచుకొని, అతనిపై పగసాధించవలెననెడి చిత్తప్రవృత్తినే 'ద్వేష' మందురు.

**"దుర్గుణానాం హి సర్వేషాం ద్వేషో ముఖ్యః ప్రకీర్తితః"** అనగా 'దుర్గుణము లన్నింటిలో ద్వేషము ప్రముఖమైనదని చెప్పబడినది'. కావున, మానవుని యొక్క పతనమునకు ఈ ఒక్క దుర్గుణమున్న చాలును. మిగిలిన దుర్గుణములు తమంతట తామే ప్రవేశించును.

ద్వేషము యొక్క దుష్ఫలితములను మహాభారతము మనకు చక్కగా బోధించు చున్నది. శ్రీ వ్యాసమహర్షి విరచిత 'మహాభారతము' సర్వవేదముల సారము, **'పంచమవేద'** మని ప్రసిద్ధికెక్కినది. వేదములలోని సకల ధర్మములను శ్రీ వ్యాసమహర్షి 'మహాభారతము'లో గుప్పించినారు. వేద ధర్మములను సాధారణ మానవునకు అర్థమవునట్లు కథారూపములో సృష్టించి, బోధించినారు శ్రీ వ్యాసభగవానులు. సర్వవేద ధర్మముల సంగ్రహమే మహాభారత ఇతిహాసమని పెద్దలు నుడివిరి. **'మహాభారతములో లభింపని ధర్మము మరి యింకెక్కడను లభించదు'** అని మున్నుడి.

అటువంటి మహాభారత మహావృక్షమునకు విత్తనము 'ద్వేషమే'. సదాచారులు, ధర్మాత్ములు అయిన పాండవుల యెడ దుర్యోధనుడు పెంచుకొనిన ద్వేషమే విత్తనమయి, అది మొలకెత్తి, పెరిగి పెరిగి మహావృక్షమయి మహాభారత సంగ్రామమునకు కారణభూతమైనది. మహాభారతమునంతను కూలంకషముగా వెదకినను పాండవులు దుర్యోధనునకు మనఃపూర్వకముగా నొనరించిన అపకారమెచ్చటను కనిపించదు. అంతియే గాక అనేకసార్లు కష్టకాలములో దుర్యోధనుని ఆదుకొని సహాయము చేసినారు. అయినప్పటికి దుర్యోధనుని మనస్సులోని ద్వేషము మాత్రము ఇసుమంతయయినను తగ్గక, ఇంకను వృద్ధిబొందుచునే యుండెను. విమర్శించి చూచినయెడల దుర్యోధనుని యొక్క ద్వేషమునకు సరియైన కారణమొక్కటియు కనిపించదు. నిష్కారణముగా దుర్యోధనుడు ద్వేషమును పెంచుకొని, పాండవులననేక ఇక్కట్ల పాలుజేసినాడు. సన్మార్గులు, సదాచారులు, ధర్మాత్ములయిన పాండవుల యొక్క రూప సౌందర్యములు, బలపరాక్రమములు, కీర్తిప్రతిష్ఠలు తప్ప మరియొక కారణమేమియు కనిపించదు దుర్యోధనుని యొక్క ద్వేషమునకు.

ఈ ద్వేషము మూలముననే దుర్యోధనుడు తాను నశించినదియేగాక తన వంశమును, తన కులమును పూర్తిగా నశింపచేసినాడు. అకటా! ద్వేషము యొక్క ప్రభావమెంత చెడ్డది!

కావున, ప్రతి మానవుడు ఏ ప్రాణిని ద్వేషింపక, అన్నిప్రాణులకు ప్రేమను పంచిపెట్టి సన్మార్గములో జీవించుమని సనాతనధర్మము బోధించుచున్నది.

ద్వేషమువలన కలుగు దుష్పరిణామములను ఈ క్రింది సూక్తి మనోహరముగా వివరించుచున్నది-గమనింపుడు :

**శ్లో॥ ద్వేషా ద్వైరాణి వర్ధన్తే కలహాశ్చ తదుద్భవాః ॥**

**శ్లో॥ వైరా ద్దుఃఖం చ నిందాశ్చ వైరా న్మృత్యుశ్చ సంభవేత్ ।**
**వైరే బుద్ధించ కుర్యాచ్చ మనసా వైర ముత్సృజేత్ ॥**

'ద్వేషము వలన వైరములు వృద్ధిజెందును. తత్కారణముగా కలహములు ఉద్భవించును. వైరము దుఃఖమునకు కారణమగును. వైరము వలన నిందలు ప్రాప్తించును. వైరము వలన మృత్యువు గూడ సంభవించును. కావున వైరబుద్ధి యెన్నటికిని పనికిరాదు. ద్వేషబుద్ధిని మనస్సునుండి త్యజించవలయును'.

ఏ ప్రాణియెడల ద్వేషమును పొరపాటున గూడ మన మనస్సులోనికి రానీయ గూడదు. తెలిసియైనను లేక తెలియకయైనను అటువంటి ద్వేషభావమును మన మనస్సులోనికి రానిచ్చినయెడల, దానియొక్క ప్రతిక్రియ (రియాక్షన్)గా ఎదుటి వ్యక్తిలో గూడ మన యెడల ద్వేషము ఉద్భవించును. దీనికి తార్కాణముగా ఒక చిన్న కథను పెద్దలు చెప్పుచుందురు.

ఒక ఊరిలో ఒక రాజు వుండెను. ఆ గ్రామములో ఒక బీదవాడు నివసించు చుండెను. అతడు అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి, వాటిని విక్రయించి, ఆ వచ్చిన ధనముతో జీవితమును వెళ్ళబుచ్చుచుండెను. అతడు అడవికి వెళ్ళునప్పుడు, తిరిగి వచ్చునపుడు రాజుగారి కోట మార్గమును అనుసరించుచుండెను. అతనిని చూచినపుడు రాజు యొక్క మనస్సులో అతని యెడల ఒక విధమైన జుగుప్స, ద్వేషము ఉద్భవించుచుండెను. అతడు రాజుగారికి ఎటువంటి అపకారమును చేసియుండలేదు. అయినప్పటికి అకారణముగా రాజు యొక్క మనస్సులో ద్వేష భావము ఉత్పన్న మగుచుండెను. రాజు ఎంత దీర్ఘముగా ఆలోచించినను అద్దానికి కారణము కన్పట్ట కుండెను. రాజు సచివోత్తముల సంప్రదించినను కారణము అనూహ్యామాయెను.

ఇట్లుండ, ఒకరోజు రాజు బీదవానిని దర్బారునకు పిలిపించి, అతని యొక్క యోగక్షేమములను గురించి, అతని యొక్క నిత్యకార్యక్రమమును గురించి, అతని యొక్క జీవన విధానమును గురించి ప్రశ్నించెను.

అపుడు, ఆ బీదవాడు తాను అడవికి వెళ్ళి వివిధరకములైన కట్టెలు కొట్టి తెచ్చి వాటిని విక్రయించి, ఆ ధనముతో జీవించుచున్నాననియు, ఆ కట్టెలలో విలువ గల గంధపు చెక్కలను మాత్రము నిలువయుంచుచున్నట్లు చెప్పెను. రాజు కారణము నడుగగా, గంధపుచెక్కలు రాజుగారి అవసానదశలో అవసరపడునుగాన, అపుడు తనకు మంచిమూల్యము లభించుననెడి తలంపుతో తాను ఆ గంధపుచెక్కలను నిలువయుంచుచున్నానని ఆ బీదవాడు సమాధానమొసంగెను. ఆ సమాధానము విని, రాజు ఆశ్చర్యచకితుడాయెను; మరియు తనకు ఆ బీదవానిపై ద్వేషభావము ఎందుకు కలుగుచున్నదో అర్ధమాయెను.

ఇచట గమనించదగిన విషయమేమిటంటే-ఆ బీదవాడు అమాయకత్వముతో తనకు తెలియకుండానేరాజు యొక్క మృత్యువును కోరుచున్నాడు. ఇతనిలో నున్న

యీ చెడు కోరికయే రాజు యొక్క మనస్సులో ఆ బీదవానిపై ద్వేషభావమును ఉత్పన్నము చేయుటకు కారణమయినది. ఆ బీదవాడు రాజునకు చెడును కోరు చున్నాడు గనుక రాజు యొక్క మనస్సు గూడ ఆ బీదవాని యెడల చెడుభావమును అనగా ద్వేషమును జనింపజేయుచున్నది. అది సహజము మరియు ప్రకృతి నియమము అయివున్నది. ఈ ప్రకృతి నియమమును ఈనాటి భౌతిక శాస్త్రము గూడ "Action and Reaction" సిద్ధాంతము ద్వారా బోధించుచున్నది. ఈ సిద్ధాంతము ప్రకారము "Every Action will have its Reaction; Action and Reaction are Equal in force and opposite in Direction".

ఇచ్చట Action - బీదవాడు రాజు యొక్క మృత్యువును కోరుట. Reaction- బీదవాని యెడల రాజుయొక్క మనస్సులో ద్వేషము ఉత్పన్నమగుట.

ఈ కథ చెప్పుచున్న నీతి ఏమనగా-పొరపాటుచేనైననూ, ఆఖరుకు స్వప్న మందైననూ ఏ ప్రాణిని ద్వేషింపరాదు.

ద్వేషము యొక్క నీచత్వమును చక్కని ఉపమానముతో ఈ క్రింది సూక్తి బోధించు చున్నది.

**శ్లో॥ ద్వేష స్తూన్నతిరూపస్య పారిజాతద్రుమస్య తు।**
**మూలఘ్న కీటక నిభః ఇతి జానీహి పుత్రక ॥**

'పురోభివృద్ధియను పారిజాత వృక్షమునకు ద్వేషమను దుర్గుణము వేరుపురుగు వంటిదని తెలిసికొనుము'.

ఇచట ద్వేషము నీచమైన కీటకముతో పోల్చబడినది. కావున ఈ పురుగును ఆదిలోనే అంతము చేయవలయును. ఇది పెరిగి పెద్దదైన యెడల అభివృద్ధిజెందుచున్న మానవుడను పారిజాత వృక్షమును సమూలముగ నశింపచేయును. కనుక అభివృద్ధి జెందదలచుకొన్న ఏ మానవుడైనను ఈ ద్వేషమను చీడపురుగును దరిజేరనీయరాదు.

ద్వేషమును అంతమొనర్చుటకు మార్గమును ఈక్రింది సూక్తి సూచించుచున్నది:

**శ్లో॥ వైరవృద్ధి భవే ద్వేషః ప్రేమ్ణా ద్వేషస్తు నశ్యతి ।**
**ప్రేమరూపమతం యత్స్యాత్ తద్దివ్యమత ముచ్యతే ॥**

'ద్వేషముచేత ద్వేషము వృద్ధియగును. ద్వేషము ప్రేమ చేత నశించును. ప్రేమ తత్త్వమే దివ్యమతమని చెప్పబడుచున్నది'.

'ద్వేషించినవానిని ప్రేమించు'మని సనాతనధర్మము బోధించుచున్నది. అలాంటి వ్యక్తులు ప్రపంచ చరిత్రలో లేకపోలేదు. యేసుక్రీస్తు తనను ద్వేషించుచున్న వ్యక్తులను ప్రేమించినాడు. తనను శిలువపై నెక్కించి, శీలలు కొట్టుచున్న దుర్మార్గులను సహితము క్షమించి, ప్రేమించిన ప్రేమస్వరూపుడు యేసుక్రీస్తు. **"తండ్రి! వీరేమి చేయుచున్నారో వీరెరుగరు గనుక వీరిని క్షమింపుము"** అని తండ్రిని ప్రార్థించిన ప్రేమహృదయుడు **యేసుక్రీస్తు.**

అలాగుననే దుర్యోధనుడు పాండవులను ద్వేషించుచున్నప్పటికి, యధిష్ఠిరుడు మాత్రము అతనిని ప్రేమించుచుండెను. అనేక క్లిష్టపరిస్థితులలో దుర్యోధనుని రక్షించెను.

శ్రీకృష్ణ పరమాత్మ, ఏ ప్రాణియందును ద్వేషబుద్ధిలేని భక్తుడు తనకు చాలా ఇష్టుడని భగవద్గీతలో చెప్పినాడు.

**"అద్వేష్టా సర్వభూతానాం - యో మద్భక్తస్సమే ప్రియః"** ॥

'సర్వప్రాణులయందు ద్వేషము లేని భక్తుడు నాకు మిగుల ప్రియమైనవాడు' అని శ్రీకృష్ణ భగవానుడు నుడివినాడు.

కావున, ప్రతి మానవుడు ఏ ప్రాణిని గూడ ద్వేషింపక, సర్వప్రాణులను ప్రేమించుచు, తాను ప్రేమింపబడుచు, తన జీవితమును ఆనందమయ మొనర్చుకొనుగాక!

## 17. క్రోధము (కోపము) :-

మానవుడు వర్జింపవలసిన దుర్గుణములలో క్రోధము గూడ ముఖ్యమైనదియే. క్రోధము వలన అనేక అనర్థములు ప్రాప్తించును. క్రోధము నావహించిన వ్యక్తి మానసిక సంతులనమును కోల్పోయి, అనుచిత కార్యముల నాచరించును. క్రోధము వలన వైరము పెరిగి కలహములకు దారితీయును. క్రోధముతో నిండిన హృదయము పాషాణ సమమయి, ఎదుటివ్యక్తిని చంపుటకైనను వెనుదీయదు. క్రోధము వలన సంభవించు అనర్థమును దృష్టాంతపూర్వకముగ భాగవతము వర్ణించుచున్నది.

అంబరీష మహారాజు పరమభాగవతుడు, విష్ణుభక్తుడు. ఒకసారి ఆయన ఏకాదశి వ్రతము నాచరించెను. వైష్ణవ సంప్రదాయము ప్రకారముగా ద్వాదశిరోజు ఉదయమున నిర్ణీత సమయము లోపల ఆహారమును రించి, ఉపవాసమును

విరమణ చేయవలయును. ఆ నియమానుసారముగా అంబరీషుడు ద్వాదశి రోజున ఉపవాస మును విరమించుటకైఆహారమును తీసికొన నుపక్రమించునంతలో దుర్వాసమహాముని తన శిష్య సమేతముగ వేంచేసెను. అంబరీషుడు మహామునికి తగు మర్యాదలు చేసి, ఆతిథ్యమును స్వీకరించమని కోరెను.

దుర్వాసముని అంగీకరించి, స్నానానుష్ఠానములు ముగించుకొని వచ్చెదమని చెప్పి, శిష్యసమేతముగ నదికి వెళ్ళిరి. ఇచట అంబరీషుడు వారి రాకకై యెదురు చూచుచుండెను. వారు శీఘ్రముగా రారైరి. ఉపవాసమును విరమింపవలసిన నిర్ణీత సమయము దాటుచుండెను. అపుడు అంబరీషుడు ధర్మసంకటము నెదుర్కొనవలసి వచ్చెను. పండితులను పిలిచి, పరిష్కారమార్గమును తెలియపరచుడని అంబరీషుడు కోరెను. పండితులు చక్కగా ఆలోచించి, ఒక నిర్ణయమును వెలిబుచ్చిరి. నీటిని స్వీకరించిన యెడల ఒక విధముగ ఉపవాసమును విరమించినట్లు అగును, ఇంకొక విధముగ ఇటు అతిథి సత్కారమునకు భంగము కలుగకుండ భుజింపనట్లు అగును; కావున నీటిని స్వీకరింపుమని పండితులు సలహానిచ్చిరి. అంబరీషుడు అదేవిధముగా నొనర్చెను. ఇంతలో దుర్వాసముని వచ్చి తన దివ్యదృష్టితో విషయమును తెలుసుకొని, క్రుద్ధుడై అంబరీషుని అనేకవిధముల నిందించెను. అతిథిని భోజనమునకు ఆహ్వానించి, అతిథికంటె ముందే భుజించిన నీచుడవని, నీవు భక్తుడవు గావని పరిపరి విధముల నిందించి, క్రోధోన్మత్తతతో తన ఒక జడను పీకి, దాని నుండి ఒక కృత్యను సృష్టించెను. ఆ కృత్య ఖడ్గధారియై అంబరీషుని చంపుటకై వచ్చుచుండ, వెనుక నుండి శ్రీమహా విష్ణువు యొక్క సుదర్శన చక్రము వచ్చి, ఆ కృత్యను వధించి, దుర్వాసముని వైపు వచ్చుచుండెను. దుర్వాసుడు భయకంపితుడై పలాయనము చిత్తగించెను. సుదర్శన చక్రము నిప్పులు కురిపించుచు అతనిని వెంబడించుచుండెను. దుర్వాసుడు బ్రహ్మ లోకమునకు వెళ్ళి, రక్షింపమని బ్రహ్మను వేడుకొనెను. బ్రహ్మదేవుడు తన నిస్సహాయతను వెలిబుచ్చెను. అంతట కైలాసమునకు వెళ్లి, శ్రీశంకరుని శరణు జొచ్చెను. శంకరుడు గూడ తన నిస్సహాయతను వ్యక్తపరచి, శ్రీవిష్ణువునే శరణు వేడుమని సలహానిచ్చెను. దుర్వాసుడు వైకుంఠమునకు వెళ్ళి శ్రీమహావిష్ణువు యొక్క శరణు వేడుకొనెను. అంతట శ్రీ విష్ణువు "నీవు ఎవరికైతే అపచారము జేయబూనితివో, ఆ వ్యక్తి వద్దకు వెళ్ళి శరణు వేడుకొనుము, ఆ వ్యక్తియే నిన్ను క్షమింప అర్హుడు" అని చెప్పెను.

అపుడు దుర్వాసముని అంబరీషుని వద్దకు వచ్చి, తన తప్పిదమునకు క్షమాపణ వేడుకొనెను. విశాల హృదయుడు, ప్రేమస్వరూపుడు, పరమ భాగవతోత్తముడైన అంబరీషుడు సుదర్శనచక్రమును అనేకవిధముల స్తుతించి, శాంతింపమని ప్రార్థించెను. అంబరీషుని కోరిక ప్రకారము సుదర్శనచక్రము శాంతించి, దుర్వాస మునిని క్షమించి, వదలివేసెను. దుర్వాసుడు మూడు లోకములకు వెళ్ళి, మరల తిరిగివచ్చుటకు ఒక సంవత్సరకాలము పట్టెను. ఈ సంవత్సరకాలము అంబరీషుడు గూడ భుజింపక తన అతిథియైన దుర్వాసముని కొరకు వేచియుండెను. అంబరీషుడు ఎంత గొప్ప సదాచార సంపన్నుడో, ఎంతగొప్ప భక్తుడో దీనిని బట్టియే అవగత మగుచున్నది గదా! అటువంటి మహాపురుషుని అకారణముగా కోపించి, దుర్వాసుడు కష్టనష్టలను కొనితెచ్చుకొనెను. క్రోధము యొక్క పరిణామములు చాలా విషమముగా ఉండును.

అకటా! క్రోధము తనకు లొంగిన వ్యక్తిచేత ఏ పని చేయింపదు? (అనగా ఏ పనినైనను చేయించును అని అర్థము).

మానవుని యొక్క పతనమునకు క్రోధము ఎలా కారణభూతమగుచున్నదో శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో విపులముగా వివరించినాడు :

**శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః ।**
**స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ (గీత.2-63)**

'క్రోధము వలన అవివేకమావేశించును. అవివేకము వలన మతిభ్రమ సంభవిం చును. దానివలన బుద్ధినాశము కలుగును. బుద్ధి నశించినచో సంసారకూపమున పతితుడగును'.

పై శ్లోకము, క్రోధమువలన మానవునిలో క్రమముగ కలుగు పరిణామములను, వాటియొక్క అంతిమ ఫలమును చక్కగా వర్ణించి చెప్పినది. క్రోధము యొక్క అంతిమ ఫలము మానవుని యొక్క పతనము.

క్రోధము వలన సంభవించు దుష్ఫలితములను శ్రీవాల్మీకి మహర్షి రామాయణ ములో శ్రీ ఆంజనేయుని నోటి ద్వారా చెప్పించినాడు.

శ్రీ ఆంజనేయుడు సీతాన్వేషణలో లంకను చేరినాడు. అచట వనములను ధ్వంసము చేసినాడు; అనేకమంది రాక్షసులను వధించినాడు. అనంతరము, తన

ఇచ్ఛానుసారముగా లంకావాసులకు లొంగిపోయినాడు. ఆంజనేయుని అవమాన పరచుటకు గాను, లంకావాసులు అతని వాలమునకు నూనెతో తడిపిన బట్టలను చుట్టి, అగ్నిని ముట్టించినారు. అంతట, ఆంజనేయుడు అతి క్రుద్ధుడై, వారికి నీతిని నేర్పదలంచి, తాను ఒక గృహము మీదినుండి ఇంకొక గృహము మీదికి లంఘించుచు, సకల గృహములకు నిప్పు నంటించి, సమస్త లంకను అగ్నికి ఆహుతి చేసినాడు. ఆఖరుగా తాను సముద్రములో దుమికి తన వాలమునకున్న అగ్నిని అంత మొందించినాడు.

అపుడు, అశోకవనములోని సీతామహాతల్లి అతని స్మృతిపథమున కొచ్చి ఈ అగ్నిప్రమాదములో ఆమె యొక్క పరిస్థితి ఎలా ఉన్నదోనని దుఃఖించి, తాను క్రోధో న్మత్తుడై చేసిన కార్యమునకు చింతించి, యీ క్రింది విధముగా పశ్చాత్తాపపడతాడు.

**శ్లో॥ క్రుద్ధః పాపం న కుర్యాత్కః క్రుద్ధో హన్యాద్గురూ నపి ।**
**క్రుద్ధః పరుషయా వాచా నరః సాధూనధిక్షిపేత్ ॥**

'క్రోధానికి లొంగిన వ్యక్తి చెయ్యలేని పాపం లేదు. దానికి లోబడ్డామో గురువులను హననం చేయగలం, పరుషవాక్కులతో కర్కశంగా చరించగలం, సాధువులను హింసించగలం. అందుచేతనే కామక్రోధాలకు లొంగని మహనీయులు ధన్యులు' అని అనుకుంటాడు.

క్రోధము తనకు లొంగిన వ్యక్తిచేత ఎటువంటి చెడ్డపనినైనను చేయిస్తుంది. ఆఖరుకు హత్యనైనను చేయిస్తుంది. క్రోధమునకు లోబడ్డ వ్యక్తి వివేక విజ్ఞానములను కోల్పోయి, మతిభ్రమించి, ఉచితానుచిత విచారణ చేయక, ఎటువంటి నీచ కార్యమునైనను చేయుటకు వెనుకాడడు. కావున, క్రోధము పాపములకాటపట్టు.

క్రోధము త్రివిధ నరకాద్వారములలో ఒకటియని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో వివరించియున్నాడు :

**శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।**
**కామఃక్రోధ స్తథా లోభః తస్మాదేత త్రయం త్యజేత్ ॥ (భగీ.16-21)**

'కామ క్రోధ లోభములు మూడును నరకమునకు ద్వారములు. వాటివలన మనుష్యుడు సర్వనాశనము చెందగలడు. కాబట్టి, వాటిని పరిత్యజించవలెను'.

క్రోధము వలన గలుగు ఒడుదుడుకులను సహించి, సంయమచిత్తుడగు వాడే యోగి యనబడుననియు, అట్టివాడే సుఖపడగలడనియు కృష్ణపరమాత్మ భగవద్గీతలో బోధించియున్నాడు.

**శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ (భగీ. 5-23)**

'బ్రతికి దేహముతో ఉండగానే కామక్రోధముల ఒడిదుడుకులను చల్లార్చిన వాడే యోగి, వాడే సుఖపడును'.

కాబట్టి, ప్రతి మానవుడు క్రోధము నదుపులో నుంచి, దుష్కార్యములకు దూరముగా నుండుగాక! యని సనాతనధర్మము బోధించుచున్నది.

ఇపుడు మనము వర్ణాశ్రమధర్మములను గురించి సనాతన ధర్మము ఏమి బోధించుచున్నదో విచారించెదము.

## 18. వర్ణ ధర్మములు :-

భారతావనిలోని వర్ణవ్యవస్థ వివాదాంశనీయమైనది. ఈ వ్యవస్థను గురించి అనేకమంది మహాపురుషులు, సంఘసంస్కర్తలు వివిధ భేదాభిప్రాయములను కలిగి యుండిరి. ప్రస్తుతము గూడ ఈ సమస్యకు పరిష్కారమార్గము కనిపించుట లేదు. ఈనాటి మన సమాజంలో ఉద్వేగాన్ని చెలరేగిస్తున్న సమస్యలలో ఇది ఒకటి.

ఈ వ్యవస్థను గురించి శ్రుతి, స్మృతి, శాస్త్రములు వ్యక్తపరచిన యథార్థములను తెలిసికొందము.

వివిధ ధర్మములకు భాండాగారమైన మనుస్మృతి వర్ణధర్మములను బోధించు నపుడు, వర్ణవిభజన ఏ భూమికనాధారము చేసికొని చేయబడినదో ప్రస్తావించలేదు. భూమికపై మౌనము వహించి, వర్ణధర్మములను మాత్రము బోధించుచున్నది మనుస్మృతి.

బహుశా! మనుమహర్షి ఋగ్వేదములో చెప్పబడిన వర్ణవిభజన నాధారము జేసికొని, ఆయా వర్ణముల యొక్క ధర్మములను నిర్ణయించి ఉండవచ్చును.

ఋగ్వేదము క్రింది విధముగ చెప్పుచున్నది :

**మం॥బ్రాహ్మణో౽స్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః ।**

**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥**

**(ఋ. X 90.12)**

'భగవానుని ముఖారవిందము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు ఉద్భవించినారు'.

మనుస్మృతి వర్ణధర్మములను క్రిందివిధముగా నుడువుచున్నది.

**శ్లో॥ అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా ।**

**దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానా మకల్పయత్॥ (మను. I .88)**

'వేదాధ్యయనము చేయించుట, వేదాధ్యయనము చేయుట, యజ్ఞము చేయుట, చేయించుట, దానమిచ్చుట, గ్రహించుట బ్రాహ్మణ ధర్మము.

**శ్లో॥ ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ।**

**విషయే ష్వప్రసక్తి శ్చ క్షత్రియస్య సమాసతః ॥ (మను. I. 89)**

'ప్రజలను రక్షించుట, దానము చేయుట, యజ్ఞములు చేయుట, వేదాధ్యయనము, విషయాసక్తుడు కాకుండుట క్షత్రియ ధర్మము'.

**శ్లో॥ పశునాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ ।**

**వణిక్పథ కుసీదం చ వైశ్యస్య కృషి మేవ చ ॥ (మను. I. 90)**

'పశువులను పోషించుట, దానమిచ్చుట, యజ్ఞములు చేయుట, వేదాధ్యయనము, వ్యాపారము, వడ్డీకిచ్చిపుచ్చుకొనుట, వ్యవసాయము వైశ్యధర్మము.

**శ్లో॥ ఏకమేవ తు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్ ।**

**ఏతేషామేవ వర్ణానాం శుశ్రుషా మనసూయయా ॥ (మను. I. 91)**

'బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు అసూయాసంకోచములు లేకుండా సేవచేయుట శూద్రధర్మము.

పైనుదహరించిన వ్యవస్థ ప్రకారము మానవుని యొక్క వర్ణమును (జాతిని) పుట్టుకను బట్టి నిర్ణయించి, ఆపై ఆ వ్యక్తి ఆచరించవలసిన విధ్యుక్తధర్మములను నిర్ణయించడమైనది.

కాని, మనము వేదకాలము నుండి ఈనాటి వరకు మన దేశచరిత్రను కూలం కషముగా పరిశీలించిన యెడల, ఈ వ్యవస్థ నిత్యజీవితములో ఆచరణ యోగ్యముగా ఉన్నట్లు కనిపించుట లేదు. ఎందువలననగా-చరిత్రలో మహా పురుషులుగా ప్రసిద్ధి గాంచినవారే తమ తమ వర్ణధర్మములను ఆచరింపక, విభిన్నముగా ప్రవర్తించినారు.

ఉదాహరణకు, విశ్వామిత్రుడు క్షత్రియుడుగా జన్మించినను ఘోరతపస్సు నాచరించి, సద్బ్రాహ్మణుడయ్యాడు. అంతియేగాక బ్రహ్మర్షిగా ప్రసిద్ధి జెందినాడు. పరశురాముడు, ద్రోణుడు, అశ్వద్ధామ, ఈనాటి చరిత్రలో ఖడ్గతిక్కన బ్రాహ్మణులుగా జన్మించినను క్షత్రియుల కుండవలసిన వీరత్వమును, ధీరత్వమును, శూరత్వమును గలిగియుండి యుద్ధములు చేసి, మహాయోధులని వినుతికెక్కినారు. మొన్న మొన్నటి చరిత్రలోని పోతన, శ్రీనాథుడు మొదలగువారు బ్రాహ్మణులుగా జన్మించినను వ్యవసాయము చేసినారు.

కర్ణుడు సూత దంపతుల చేత పెంచబడుటచే శూద్రుడుగా గణింపబడినప్పటికి, ప్రయత్నపూర్వకముగ రాజయ్యాడు. నిమ్నజాతికి చెందిన మత్స్యగంధికి పుట్టిన వ్యాసుడు, తపోబలము వలన జ్ఞానసిద్ధివలన వేద విభజన గావించి వేదవ్యాసుడు గాను, భారతావనిలో జ్ఞానజ్యోతిని వెలిగించి వ్యాసమహర్షిగాను ప్రసిద్ధిజెంది, సద్బ్రాహ్మణుడయ్యాడు.

వేదకాలమునాటి సూతమహర్షి నిమ్నజాతికి చెందినప్పటికి, ఋషులందరిలో జ్ఞానచక్రవర్తిగా గౌరవింపబడి, సద్బ్రాహ్మణుడయ్యాడు. జ్ఞానవిషయములో ఏ శంక ఉద్భవించినప్పటికి ఋషులందరు శంకానివృత్తి కొరకు సూత మహర్షిని సంప్రదించెడి వారట.

కావున, పై నుదాహరించిన ఉదాహరణలను బట్టి చూచిన యెడల, ఒక నగ్నసత్యము గోచరించును-మానవుని చిత్తప్రవృత్తి త్రిగుణాత్మకమైనది. సత్త్వరజస్తమో గుణములలో ఏ గుణము ప్రబలమై యుండునో, దానిని బట్టి వ్యక్తియొక్క స్వభావము యేర్పడును. స్వభావముననుసరించి అతనియొక్క కర్మాచరణ యుండును. అంతియే గాని పుట్టుకను బట్టి నిర్ణయింపబడిన కర్మలను ఏ వ్యక్తియు నాచరింపజాలడు. శూద్ర మనస్సుతో పుట్టిన బ్రాహ్మణుడు బ్రాహ్మణధర్మముల నెట్లు నిర్వర్తింపగలడు?! అటులనే, బ్రాహ్మణ స్వభావముతో పుట్టిన శూద్రుడు శూద్రధర్మముల నెట్లు ఆచరింపగలడు?!

అందువలన, హేతువాదియైన శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో మనువు చెప్పిన వర్ణ ధర్మములకు వ్యతిరేకముగా తిరగేసి చెప్పినాడు. మనువు ఈ ఈ వర్ణములవారు ఈఈ ధర్మములను ఆచరింపవలయునని చెప్పినాడు. శ్రీకృష్ణపరమాత్మ మానవులు వారి వారి స్వభావములను బట్టి ఈఈ కర్మల నాచరించినవారు ఈ ఈ వర్ణములకు చెందినవారు అని నిర్ణయించినాడు.

శ్రీకృష్ణపరమాత్మ గీతలో ఇలా నుడివినాడు :

**శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః । (భ.గీ. 4-13)**

'అనగా, 'గుణకర్మల విభాగము ననుసరించి నాలుగు వర్ణములు నా చేతనే సృష్టింపబడినవి'.

అంటే జాతిని బట్టి కర్మలను కాకుండా వారాచరించు కర్మలను బట్టి జాతిని నిర్ణయించినాడు.

ఈ విభజన శ్రీకృష్ణభగవానునిచే ఎలా చేయబడినదో ఇపుడు మనము తెలిసికొందము.

**శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవమేవ చ ।**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥ (భ.గీ. 18-42)**

'శమము (అంతరింద్రియ నిగ్రహము), దమము (బహిరింద్రియ నిగ్రహము), తపస్సు (శాస్త్రీయ కాయిక క్లేశము), శౌచము (బాహ్యాభ్యంతర పరిశుభ్రత), సహిష్ణుత, సరళత, జ్ఞానము (శాస్త్రజ్ఞానము), విజ్ఞానము (తత్త్వానుభూతి), ఆస్తిక్యము (శాస్త్రార్థము నందు దృఢమగు నమ్మకము) మున్నగు కర్మలు స్వభావముగ కలవారు బ్రాహ్మణులు.

**శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనమ్ ।**
**దానమీశ్వర భావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ (భ.గీ. 18-43)**

'శౌర్యము, తేజస్సు, ధైర్యము, కార్యకుశలత్వము, యుద్ధమునందు పారిపోకుండుట, దానము, లోకనియంతృత్వము మున్నగు కర్మలు స్వభావముగా గలవాడు క్షత్రియుడు'.

**శ్లో॥ కృషి గోరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।**
**పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ (భ.గీ. 18-44)**

'వ్యవసాయము, గోరక్షణము, వాణిజ్యము మున్నగు కర్మలు స్వభావముగా గల వారు వైశ్యులు. ఇతరులకు పరిచర్య చేసి జీవించాలనే స్వభావము గలవారు శూద్రులు'.

కృష్ణభగవానునిచే ప్రతిపాదించబడిన గుణకర్మల ననుసరించిన వర్ణవిభజనను సమర్థిస్తూ అనేక నిదర్శనములు కన్పట్టుచున్నవి.

వ్యాసమహర్షి మహాభారతములో క్రిందివిధముగా చెప్పినాడు :

**శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా ద్విజ ఉచ్యతే ।**
**వేదపాఠేన విప్రత్వం బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః ॥**

ప్రతి మానవుడు జన్మించినపుడు శూద్రుడే! మనిషి పెరిగే కొలదీ ఎవడైతే వేదాల్ని పఠించి, వేద విజ్ఞానంతో బ్రహ్మజ్ఞానాన్ని పొంది, వేదవిజ్ఞానాన్ని ఇతరుల కోసం వినియోగిస్తాడో-వాడే బ్రాహ్మణుడు. జన్మతో బ్రాహ్మణ్యం లభించదని మహాభారతం స్పష్టంగా చెప్పుచున్నది.

మరియు ఇట్లనుచున్నది-వేదాలు, సత్యం, ధర్మం, ఆచారం, తపస్సు-ఈ ఐదింటికి ఉనికిపట్టుగా నున్నవారే బ్రాహ్మణులు. బ్రాహ్మణుడనే వాడు ఎల్లవేళల ప్రశాంతతతో ఉండాలి. ఒకరికి భయపడకుండా, ఒకరిని భయపెట్టకుండా ప్రవర్తించే విశాల హృదయుడే బ్రాహ్మణుడు.

బ్రాహ్మణ ధర్మములు తొమ్మిది. అవి - వేదములను చదివించుట, చదువుట, యజ్ఞములు చేయుట, చేయించుట, ప్రతిగ్రహము, ప్రశాంతి, తపస్సు, సత్యము, శౌచము. ఈ ధర్మాలను పాటించుచున్న వారెవరైననూ బ్రాహ్మణులే. పుట్టుకతో బ్రాహ్మణుడైనా, ఈ ధర్మముల నాచరించని యెడల అతను శూద్రుడుగానే గణింప బడునని పెద్దలు నుడివిరి.

ఈ సత్యమును ఈ క్రింది సూక్తి దృఢపరచుచున్నది :

**శ్లో॥ యో అనధీత్య ద్విజో వేదాన్ అన్యత్రకురుతే శ్రమమ్ ।**
**స జీవన్నేవ శూద్రత్వం ఆశు గచ్ఛతి సాన్వయః ॥**

'ద్విజ జన్మ నెత్తి వేదములు చదువకుండ లౌకిక విద్యలు ఆర్జించినవారు జీవించి ఉండగనే వంశముతో సహా శూద్రత్వం పొందెదరు'.

మానవులంతా ఒకే జాతికి చెందినవారని ఈ క్రింది సూక్తి చెప్పక చెప్పుచున్నది.

**"ఆకృతి వ్యంగ్యా జాతిః" "ఆకృతి విశేషముతో తెలియబడునది జాతి"**. పశు, పక్షి, పాము, మొదలగునవి జాతులు. చూచుట తోడనే ప్రత్యేక చిహ్నములతో తెలియబడుచున్నవి.

మానవులంతా ఒకే చిహ్నములను కలిగియున్నారు గనుక వారంతయు ఒకే జాతికి చెందినవారని పై సూక్తి తెలుపుచున్నది.

జన్మతః బ్రాహ్మణ్యం లభించదని మరియొక సూక్తి మహాభారతములోని వన పర్వములో చెప్పబడినది :

**శ్లో॥ నయోనిర్నాపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః ।**
**కారణాని ద్విజత్వస్య వృత్తమేవ తు కారణమ్ ॥**

'పుట్టుకగాని, సంస్కారములు గాని, వేదాధ్యయనముగాని, వంశపారంపర్యం గాని బ్రాహ్మణత్వమునకు కారణము కానేరవు. ఒక్క సదాచారము (విధ్యుక్త కర్మల నాచరించుట) మాత్రమే కారణమగును.

పై నిదర్శనములను బట్టి, వర్ణ విభజన గుణకర్మలను అనుసరించి చేయ వలయునే గాని, పుట్టుక ననుసరించి కాదని తేలుచున్నది.

పుట్టుకను బట్టి వర్ణవిభజన గావించి, దానిని మనపూర్వపు రాజులు అమలులో పెట్టుట మూలమున మన దేశము అనేక ఇక్కట్లు పాలు కావలసి వచ్చినదని శ్రీమళయాళ స్వామి వారు పేర్కొన్నారు.

పూర్వము, రాజులు తమ సైన్యములోనికి వ్యక్తులను తీసికొనునపుడు ఒక్క క్షత్రియులకు మాత్రమే ప్రవేశము నిచ్చుచుండిరి. క్షత్రియులు మాత్రమే యుద్ధములో పోరాడుట కర్హులని వారి ఉద్దేశ్యము. అందువలన, తగు సంఖ్యలో వ్యక్తులు లభించక వారి సైన్యములను విస్తారము చేసికొనలేకపోయిరి. అపుడు మహమ్మదీయులు మొదలగు విదేశీయులు దండెత్తి వచ్చి, వారిని సులువుగా ఓడించగలిగిరి. ఆ విధముగా మన దేశము విదేశీయుల పాలయినది.

ఈనాటి మన ప్రభుత్వము జాతి విచక్షణ లేకుండా సైన్యములో చేరుటకు ఆసక్తి గల వ్యక్తులలో అర్హతగల వారినందరిని తీసికొనుట వలన ఈనాడు మన సైన్యమును విస్తారము చేసికొనగలుగుచున్నాము.

కులతత్త్వము వలన సంభవించిన మరియొక అనర్థము **'మతమార్పిడి'.** మన సమాజము కొన్ని జాతులవారిని నిమ్నజాతులవారని, అంటరాని వారని కేటాయించి, వారిని అగౌరవపరచిరి. వారిని మహమ్మదీయులు, క్రైస్తవులు గౌరవించి, వారికి అనేక సదుపాయములు కల్పించి, వారిని తమ మతములోనికి తీసికొనిరి.

ఇంకను మరియొక అనర్థము వర్ణవిభజన వలన సంభవించుచున్నది. అదియేమన **'అవాంఛనీయమైన అనుకరణ'.** ఉన్నత జాతివారిని అనుకరింప జూచుదురు మిగిలిన జాతులవారు. బ్రాహ్మణులను ఆదర్శముగా తీసికొనుట పరిపాటి. దురదృష్టవశాత్తు బ్రాహ్మణులు కుసంస్కారములు గలిగియుండి, దుష్ప్రవర్తనకు లోనయిన యెడల, వారిని ఆదర్శముగా తీసికొని మిగిలిన సమాజమంతయు చెడిపోవుట కాస్కారము గలదు. పూర్వకాలములో బ్రాహ్మణులు సదాచార సంపన్నులై మిగిలిన వర్ణముల వారికి ఆదర్శప్రాయులుగా మెలగుచుండిరి. కాని, ఈనాటి పరిస్థితి వేరుగా నున్నది.

వర్ణవ్యవస్థలో నున్న మాలిన్యాన్ని, భారతీయ సంస్కృతిని క్షుణ్ణంగా అధ్యయనము చేసిన అనిబిసెంట్ సూటిగా, క్లుప్తముగా మూడు ముక్కల్లో చెప్పింది. "The Sudra Jivatma in the Brahmana Body is the Greatest Danger to Sanatana Dharma!" - "బ్రాహ్మణ శరీరములో నున్న శూద్ర జీవాత్మ సనాతన ధర్మమునకు చాలా గొప్ప ప్రమాదకరమైనది".

ఈ ఒక్క వాక్యమే చాలును మన వర్ణవ్యవస్థలో నున్న లోపముల నెత్తిచూపుటకు. ఒక వ్యక్తి బ్రాహ్మణకులములో జన్మించినప్పటికి అతనిలో నున్న జీవాత్మ శూద్ర గుణములను కలిగియుండిన యెడల, అతడు సనాతన ధర్మము ప్రబోధించుచున్న స్వధర్మముల నెట్లు నిర్వర్తింపగలడు! అతడు సమాజమునకు ఆదర్శపురుషుడెట్లు కాగలడు! అతని గుణస్వభావముల ననుసరించి అతని కర్మలుండును గదా! కావున జన్మతః సంభవించిన వర్ణము అసంగతమగుచున్నది గదా! ఈ కారణము చేత పుట్టుకను బట్టి వర్ణవిభజన చేయుటయు అసంగతమే యగుచున్నది గదా!

ఈ సందర్భములో రెండు చక్కని నిదర్శనములను మనము చర్చించెదము. భాగవత పురాణములో చెప్పబడిన అజామిలుని చరిత్ర మనకు తెలిసినదే గదా! అతడు బ్రాహ్మణకులములో జన్మించినప్పటికి, విషయలోలుడై, అన్ని దురలవాట్లకు లోనయి, శూద్రుని కంటెను అధోగతి పాలయి, పతనమయినాడు.

రెండవ నిదర్శనము–డాక్టర్ అంబేద్కర్. అతడు శూద్రజాతిలో పుట్టినప్పటికి, ప్రయత్నపూర్వకముగ సద్గుణసంపన్నుడై ఎంతో ఉన్నతస్థాయికి ఎదగగలిగినాడు. విదేశములలో విద్యనభ్యసించి డాక్టరేట్ పట్టాను గూడపొంది, అతిమేధావియని ప్రసిద్ధికెక్కి, సమకాలీనులైన గాంధీ, నెహ్రూల చేత గూడ గౌరవింపబడి, భారతీయ రాజ్యాంగచట్టము(Indian Constitution) నకు రూపుదిద్దినవారిలో ప్రథముడుగా వినుతికెక్కినాడు.

కావున, అనిబెసెంట్ చెప్పిన సూక్తిలో చాలా నిగూఢమైన అర్థము స్ఫురించు చున్నది.

కృష్ణభగవానుడు సృష్టించిన వర్ణవ్యవస్థను గురించి కొంచెము విపులముగా పరిశీలింతము :

గుణకర్మల విభాగము ననుసరించి చేయబడిన నాల్గువర్ణములు శ్రమవిభజన (Division of Labour) కనుకూలముగా చేయబడినవియేగాని, శాశ్వతమైన వర్ణ వ్యవస్థను ఏర్పరచుటకు కాదు అనెడి విషయము మనకవగతమగును కొంచెము నిశితముగా ఆలోచించిన యెడల. ఈ విషయమును సోదాహరణముగా పరి శీలించెదము.

ఉదాహరణకు, 'ఎ' అను వ్యక్తి ఉన్నాడు. ఆ వ్యక్తి యొక్క గుణకర్మలను బట్టి అతనిని 'శూద్రుని'గా నిర్ణయించినాము. అతని పుత్రుడు 'బి'యను వాడు గత జన్మల సంస్కారము చేత సద్గుణసంపన్నుడై, సకలశాస్త్ర పారంగతుడై, బ్రహ్మజ్ఞానమును బడసి 'బ్రాహ్మణు'డైనాడు. అతని పుత్రుడు 'సి' యనువాడు వ్యవసాయమునందు, గోరక్షణయందు, వాణిజ్యమందు అభిలాష గలిగియుండి 'వైశ్యుడు' అయినాడు. అతని పుత్రుడు 'డి' యనువాడు పరిపాలనాదక్షతను, ధైర్యశౌర్యములను గలిగియుండి 'క్షత్రియు'డయినాడు.

కావున, ఈ గుణకర్మల విభాగము ప్రకారము వ్యక్తుల యొక్క వర్ణము తరతరమునకు మారుచునేయుండును. తండ్రియొక్క వర్ణము వేరు, కుమారుని వర్ణము వేరు, మనుమని వర్ణము వేరు, ముని మనుమని వర్ణము వేరు – ఈవిధముగా తర తరమునకు వర్ణము మారుచునే యుండును. కాబట్టి శాశ్వతమైన వర్ణ వ్యవస్థయేర్పడ జాలదు. పై చర్చను బట్టి, వర్ణవ్యవస్థకు మనుగడయే ఉన్నట్లు కన్పట్టుట లేదు.

ఏ దేశములోనైననూ వర్ణవ్యవస్థ లేకున్నప్పటికి, దేశపరిపాలనా వ్యవస్థ ఉండక తప్పదు. కాబట్టి, పాలకధర్మములను గురించి విచారించెదము.

## 19. పాలక (రాజ) ధర్మములు :

పూర్వకాలములో రాజ్యములు, రాజులుండుట మూలమున మను మహర్షి 'రాజధర్మములు'గా పేర్కొన్నాడు. కాని, ఈనాడు రాజులు, రాజ్యములంతరించినవి. ప్రపంచమంతట ప్రజాస్వామ్యములు నెలకొన్నవి. అందువలన, ఇపుడు ప్రజలచేత ఎన్నుకొనబడిన ప్రతినిధులచేత దేశములన్నియు పాలింపబడుచున్నవి. వారినే పాలకులందురు. కాబట్టి, పూర్వపు 'రాజధర్మముల'ను ఈనాడు 'పాలకధర్మము' లనుట ఉచితము. ఆ నాటి రాజుల పాలన కానీయండి లేక ఈనాటి ప్రజాప్రతినిధుల పాలన కానీయండి, పాలనా విధానములో ఎక్కువ మార్పేమియు ఉండదు. ఆ రాజధర్మములలో ముఖ్యమైనవి ఈనాటి పాలకులకు గూడ వర్తించును. కావున, మను మహర్షి చెప్పిన కొన్ని ప్రధానమైన ధర్మముల నిచట విచారించెదము.

**శ్లో॥ తస్యార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజమ్ ।**
**బ్రహ్మతేజోమయం దండమసృజత్పూర్వమీశ్వరః ॥** (మను. **VII**–14)

'రాజ్యపాలనా విధానము విజయవంతముగా జరుగుటకు, సృష్టికర్తయైన బ్రహ్మ మొదట ఒక తేజోవంతమైన దండము రూపములో ధర్మమును తన తనయునిగా సృష్టించినాడు'.

బ్రహ్మచేత సృష్టింపబడిన ధర్మమను ఈ దండమునే 'రాజదండ'మందురు. 'పరిపాలనాధికారము'నే దండముతో పోల్చి చెప్పిరి. ఈ దండము చేతిలో ఉన్నపుడే రాజునకు (పాలకునకు) ప్రజలను పాలించుశక్తి లభించును.

**శ్లో॥ తస్య సర్వాణి భూతాని స్థావరాణి చరాణి చ ।**
**భయాద్భోగాయ కల్పంతే స్వధర్మాన్న చలంతి చ ॥** (మను. **VII**–15)

'ఈ రాజదండము యొక్క భయముచేతనే చరాచర జీవులన్నియు తమ తమ నైతిక మార్గములను ఉల్లంఘించక ప్రవర్తించుచు, ఆనందము ననుభవింపగలవు.

**శ్లో॥ తం దేశ కాలౌ శక్తించ విద్యాం చావేక్ష్య తత్త్వతః ।**
**యథార్హతః సంప్రణయేన్నరేష్వ న్యాయవర్తిషు ॥** (మను. **VII**–16)

'కావున, రాజు (పాలకుడు) నేరములకు తగినట్లుగా దేశ, కాల,శక్తి ననుసరించి శాస్త్రానుసారముగా దండన విధింపవలయును.

దండన విధించునపుడు నేరస్థుని యొక్క శక్తిని గూడ మనస్సులో నుంచుకొన వలయునని పై సూక్తి సూచించుచున్నది.

**శ్లో॥ స రాజా పురుషో దండః సనేతా శాసితా చ సః ।**
**చతుర్ణామాశ్రమాణాం చ ధర్మస్య ప్రతిభూఃస్మృతః ॥** (మను. **VII**–17)

రాజదండమే రాజు, అదియే పురుషుడు, అదియే (సన్మార్గములో) నడిపించు నదియు, అదియే శాసకుడు కూడ, అదియే నాల్గు ఆశ్రమముల యొక్క ధర్మములను సంరక్షించునది.

**శ్లో॥ దండఃశాస్తి ప్రజాః సర్వా దండ ఏవాభిరక్షతి ।**
**దండః సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదుర్బుధాః ॥** (మను. **VII**–18)

'ఈ దండమే ప్రజలను పరిపాలించునది, ఇదియే వారిని రక్షించునది. దేశములోని ప్రతివ్యక్తి నిద్రించు సమయమున (రాత్రి సమయమున) మేల్కొనియుండునదియు ఈ దండమే. ఈ దండమునే ధర్మము యొక్క ప్రతిరూపముగా పండితులు యెంచు చున్నారు.'

ప్రజలందరు నిద్రించునపుడు దుష్టజనులు చోరత్వము, హత్యలు మొదలగు దుష్టచర్యలకు ఒడిగట్టవచ్చును. కాని, వారు ఆ పనులు చేయలేకపోవుటకు కారణము– ఒక్క రాజదండము యొక్క భయము మాత్రమే. అంటే, ఆ సమయ ములో గూడ రాజదండము తన పనిని తాను చేస్తూనే ఉన్నదన్నమాట. దాని అర్థము – అది మేల్కొని యుండి తన కర్తవ్యమును నెరవేర్చుచున్న దన్నమాట. అందుకే, అందరు నిద్రించు సమయములో గూడ రాజదండము మేల్కొని యుండునని చెప్పబడినది.

దుష్టులను భయపెట్టుటకు గాని, శిక్షించుటకుగాని, ఈ రాజదండము పటిష్ఠ మయినదై యుండవలెను. ఏ దేశములోనైతే ఈ రాజదండము పటిష్ఠమై యుండునో, అచట నైతికవిలువలు ఉచ్ఛస్థితిలో నుండును. ఎచట రాజదండము బలహీనమై యుండునో, అచట నైతిక విలువలు పతనమై అరాచకము వృద్ధిబొందును. ఈనాడు మనము చూస్తున్న అరాచకమునకు కారణము ఇదియే.

శ్లో॥ యది న ప్రణయే ద్రాజా దండం దణ్డ్యేష్వతంద్రితః ।
శూలే మత్స్యానివాపక్ష్యం దుర్బలాం బలవత్తరాః ॥ (మను. **VII**-20)

'రాజు దండనార్హులను తగు రీతి దండించని యెడల, చేపలను కొక్కెమునకు తగిలించి కాల్చి తిను రీతిగా, బలహీనులను బలవంతులు తినివేయుదురు. (అనగా బాధించి, కష్టముల పాలు జేయుదురు).

శ్లో॥ సర్వో దండ జితో లోకో దుర్లభో హి శుచిర్నరః
దండస్య హి భయాత్సర్వం జగద్భోగాయ కల్పతే ॥ (మను. **VII**-22)

'ధర్మాచరణ పరాయణులు చాలా అరుదు. మిగిలిన సమాజమంతయు దండన (శిక్ష) చేత మాత్రమే క్రమబద్ధమొనర్పబడుచున్నది. సర్వజీవులు దండన యొక్క భయము చేతనే వారి వారి అర్హతల ప్రకారముగా వారనుభవించుచున్నారు.

రాజదండము నుపయోగించు రాజునకు ఉండవలసిన లక్షణములను గురించి మనుమహర్షి ఇట్లు చర్చించుచున్నాడు :

శ్లో॥ తస్యాహుః సంప్రణేతారం రాజానం సత్యవాదినమ్ ।
సమీక్ష్యకారిణం ప్రాజ్ఞం ధర్మకామార్థకోవిదమ్ ॥ (మను. **VII**-26)

'రాజదండము నుపయోగించు రాజు సత్యవ్రతుడై యుండవలెను. రాబోవు పరిణామములను జాగ్రత్తగా ఆలోచించి, ప్రతి పనియు చేయువాడై యుండవలెను. ప్రాజ్ఞుడై యుండవలెను. ధర్మార్థ కామములను తెలిసినవాడై యుండవలెను.

శ్లో॥ తం రాజా ప్రణయం సమ్యక్ త్రివర్గేణాభివర్ధతే ।
కామాత్మా విషమః క్షుద్రో దండే నైవ నిహన్యతే ॥ ॥ (మను. **VII**-27)

'రాజదండమును న్యాయబద్ధముగా ఉపయోగించు రాజు తన యొక్కయు, తన ప్రజల యొక్కయు, ధర్మ, అర్థ, కామములను వృద్ధిజేయును. అట్లుగాక, కామాతురుడు, పక్షపాతి, నీచుడు అయిన రాజు అదేదండము చేత నశింపబడును.

శ్లో॥ దండోహి సమవత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభి ః ।
ధర్మాద్విచలితం హంతి నృపమేవ చ బాన్ధవమ్ ॥ ॥ (మను. **VII**-28)

ఏంతమైన ఈ రాజదండమును నిగ్రహము లేని వ్యక్తి పట్టుకొనజాలడు.

రాజు (పాలకుడు) ఏ మాత్రము ధర్మచ్యుతుడయిన యెడల (అనగ ధర్మము నుండి తప్పిన యెడల) ఆ రాజదండమే అతనిని సమూలముగ నాశనము చేయును.

పై సూక్తి ప్రత్యేకముగా ఈనాటి పాలకులు గమనించదగినది. ధర్మము నుల్లంఘించి, తమ ఇచ్ఛానుసారముగ పాలన గావించిన రాజకీయవేత్తలు సమూలముగా నశించుటయు, తమ దేశ ప్రజలచేతనే చంపబడుటయు మనము కనులారా చూచుచున్నాము గదా! పై సూక్తి ఈనాటి పాలకులకు కనువిప్పును కలిగించు గాక!

జితేంద్రియుడైన పాలకుడు మాత్రమే ప్రజలను పాలింపగలడనియు, వారిని అదుపులో పెట్టగలడనియు, అందువలన రాత్రింబవళ్ళు యోగాభ్యాసము నాచరించ వలయుననియు మనుమహర్షి చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశమ్ ।**
**జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః ॥** (మను. **VII**-44)

ఇంద్రియములను జయించుట కొఱకు రాత్రింబవళ్ళు యోగము నభ్యసించ వలయును. ఎందువలననగా, జితేంద్రియుడైన పాలకుడే ప్రజలనదుపులో నుంచగలడు.

ప్రజలను పరిపాలించువాడు కామక్రోధ లోభములనెడి మూడు దుర్గుణములను త్యజించవలయుననియు, లేనియెడల అవి చాల విపత్కరమైన దుష్ఫలితములకు దారి తీయుననియు మనుమహర్షి వివరించుచున్నాడు.

**శ్లో॥ దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ ।**
**వ్యసనాది దురంతాని ప్రయత్నేన వివర్జయేత్ ॥** (మను. **VII**-45)

పరిపాలకుడు కామము వలన జనించు పది దుర్గుణములను, క్రోధమువలన జనించు ఎనిమిది దుర్గుణములను త్యజించవలయును. ఈ పదునెనిమిది విపత్కరమైన దుష్ఫలితముల నిచ్చును.

**శ్లో॥ ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః ।**
**తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ ॥** (మను. **VII**-49)

ఈ రెండింటికి (కామ, క్రోధములకు) మూలము లోభమని పండితులంగీకరించుచున్నారు. ఈ రెండును లోభము నుండియే ఉత్పన్నమగుచున్నవి. కావున, ప్రజాపాలకుడు ఈ లోభమును ప్రయత్నపూర్వకముగా జయించవలయును.

శ్లో॥ పానమక్షాః స్త్రియశ్చైవ మృగయాచ యథాక్రమమ్ ।
ఏతత్కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే ॥ (మను. **VII**-50)

కామముచే జనించు ఉపద్రవములలో ఈ క్రింది నుదాహరించిన నాల్గు చాలా హానికరములైనవి. అవి -మద్యపానము, జూదము, స్త్రీలోలత్వము, వేట.

శ్లో॥ దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే ।
క్రోధజేఽపి గణే విద్యాత్కష్టమేతత్ త్రికం సదా ॥ (మను. **VII**-51)

క్రోధము వలన జనించు ఉపద్రవములలో మూడు చాలా హానికరములైనవి. అవి-అన్యాయముగా క్రూరమైన శిక్షను విధించుట, పరుషవాక్యము లాడుట, అక్రమమైన డబ్బు వ్యవహారము.

శ్లో॥ సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః ।
పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసనమాత్మవాన్ ॥
(మను. **VII**-52)

(పై నుదాహరించిన) కామ జనిత నాల్గు ఉపద్రవములు, క్రోధజనిత మూడు ఉపద్రవములు సామాన్యముగా పాలకులందరి యొక్క బలహీనతలై యున్నవి. వీటిలో మొదటి నాల్గు తరువాత మూటికంటె చాలా హానికరములైనవని విజ్ఞులైన పాలకులు తెలిసికొనవలయును.

ఈనాటి దేశపాలకులలో గూడ చాలామందిపై నుదాహరించిన వ్యసనములకు లోనైయున్నారు. వారికి పై సూక్తులు కనువిప్పును కలిగించు గాక!

అక్రమపాలన వలన సంభవించు దుష్ఫలితములను మనుమహర్షి ఈ క్రింది సూక్తిలో వర్ణించుచున్నాడు :

శ్లో॥ మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్షయత్యనవేక్షయా ।
సోఽచిరాద్ భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః ॥ (మను. **VII**-111)

పాలనాధికారి తన తప్పువలన దేశప్రజలను కష్టముల పాలొనర్చి, సంరక్షించ లేకపోయిన యెడల, అతడు పాలనాధికారమును తప్పక కోల్పోవును మరియు సమూలముగా నశించును.

శ్లో॥ శరీర కర్షణాత్ప్రాణాః క్షీయంతే ప్రాణినాం యథా ।
తథా రాజ్ఞామపి ప్రాణాః క్షీయంతే రాష్ట్రకర్షణాత్ ॥ (మను. **VII**-112)

ఎలాగైతే ఒక వ్యక్తి యొక్క శరీరము నిరంతరముగా బలహీనమగుచుండుట వలన ప్రాణశక్తి ఆ వ్యక్తిని పరిత్యాగము చేయునో, అలాగుననే దేశప్రజలు ఎల్లప్పుడు బాధల ననుభవించుచుండిన యెడల ఆ దేశపాలకుని యొక్క సత్తువయు క్షీణించి పోవును.

పై రెండు సూక్తులు దేశపాలకుడు తన దేశప్రజల క్షేమమును గురించి ఎంత జాగ్రత్త, శ్రద్ధలను తీసికొనవలయునో, అట్లు చేయని ఎడల సంభవించు విపత్కర పరిణామములను చక్కగా విశదీకరించుచున్నవి.

తరువాత, మనుమహర్షి ఒక నగ్నసత్యమును వెల్లడించియున్నారు. అదేమనగా- రక్షణశాఖాధికారులు సర్వసాధారణముగా లంచగొండులై యుందురనియు, వారిని దేశపాలకుడు తగు రీతిగా శిక్షించవలయుననియు బోధించుచున్నాడు. ఇది యీ నాటి పాలకులు ముఖ్యముగా గమనించదగిన విషయము.

శ్లో॥ రాజ్ఞో హి రక్షాధికృతా పరస్వాదాయినః శఠాః ।
భృత్యా భవంతి ప్రాయేణ తేభ్యో రక్షేదిమాః ప్రజాః ॥ (మను. **VII**-123)

శ్లో॥ యే కార్మికేభ్యోఽర్థమేవ గృహ్ణీయుః పాపచేత సః ।
తేషాం సర్వస్వమాదాయ రాజా కుర్యాత్ప్రవాసనమ్ ॥
(మను. **VII**-124)

'రక్షణ శాఖాధికారులు సర్వసాధారణముగ భ్రష్టాచారులై (లంచములు తీసు కొనువారలై), పరుల ఆస్తిని కబళించువారలై యుందురు. కావున, దేశపాలకుడు ప్రజలను వారి నుండి రక్షించవలయును. అటువంటి అధికారుల యొక్క ఆస్తిని జప్తిచేసి, వారిని దేశబహిష్కృతులను చేయవలయును'.

మనుమహర్షి పలువిధములగు పన్నులను (Taxes) గురించి విపులీకరించుచూ, ఎట్టి పరిస్థితులలోను శ్రోత్రియుని నుండి ఏ విధమైన పన్నును వసూలు చేయ గూడదనియు, అతని పోషణాభారమును పాలకులే వహించవలయుననియు, శ్రోత్రియునిచే ఆచరింపబడు ధర్మము దేశపాలకుని మరియు దేశమును గూడ సంరక్షించుననియు వచించుచున్నాడు.

**శ్లో॥ మ్రియమాణోఽప్యాదదీత న రాజా శ్రోత్రియాత్కరమ్।**
**న చ క్షుధాస్య సంసీదే చ్ఛ్రోత్రియో విషయే వసన్ ॥**

(మను. **VII**-133)

'దేశము ఎంత బీదస్థితిలో నున్నప్పటికి శ్రోత్రియుని వద్ద నుండి ఏవిధమైన పన్నును వసూలు చేయగూడదు మరియు ఎట్టి పరిస్థితిలోను శ్రోత్రియుడు ఆకలితో బాధపడుచూ ఉండకూడదు'.

**శ్లో॥ యస్య రాజ్ఞస్తు విషయే శ్రోత్రియః సీదతి క్షుధా ।**
**తస్యాపి తత్క్షుధా రాష్ట్రమచిరేణైవ సీదతి ॥** (మను. **VII**-134)

ఏ దేశములో శ్రోత్రియుడు ఆకలితో బాధపడుచుండునో, ఆ దేశము ఆ ఆకలి వలననే త్వరలో నశించును.

**శ్లో॥ శ్రుతవృత్తే విదిత్వాస్య వృత్తిం ధర్మ్యాం ప్రకల్పయేత్ ।**
**సంరక్షేత్సర్వతశ్చైనం పితా పుత్రమివౌరసమ్ ॥** (మను. **VII**-135)

అతని (శ్రోత్రియుని) యొక్క వేదజ్ఞానమును గురించియు మరియు అతని వ్యక్తిత్వమును గురించియు పూర్తి సమాచారమును తెలిసికొనిన తరువాత అతని పోషణార్థమై తండ్రి తన పుత్రునికి వలె తగు ఏర్పాట్లు కల్పింపవలయును.

**శ్లో॥ సంరక్ష్యమాణో రాజ్ఞా యం కురుతే ధర్మమన్వహమ్ ।**
**తేనాయుర్వర్ధతే రాజ్ఞో ద్రవిణం రాష్ట్రమేవ చ ॥ ॥** (మను. **VII**-136)

శ్రోత్రియునిచే ఆచరింపబడు ధర్మము పాలకుని సంరక్షించును, దీర్ఘాయుష్యము నిచ్చును, శ్రీమంతుని చేయును మరియు దేశమును గూడ పురోభివృద్ధి గావించును.

మనుమహర్షి యుద్ధనీతిని గురించి క్లుప్తముగా వివరించినారు. జయాపజయ ములు ఊహాతీతములగుట చేత, సాధ్యమైనంత వరకు యుద్ధము సంభవించకుండ దేశ పాలకుడు సర్వవిధముల ప్రయత్నించవలయునని మనుస్మృతి బోధించుచున్నది.

**శ్లో॥ సామ్నా దానేన భేదేన సమస్తైరథవా పృథక్ ।**
**విజేతుం ప్రయతేతారీన్న యుద్ధేన కదాచన ॥** (మను. **VII**-198)

యుద్ధము సంభవించని విధముగ రాజకీయ విధానమును అమలు పరచుట

శ్లాఘనీయము. పరస్పర సంభాషణలు, దానము, కుయుక్తిచేత శత్రుదళమును విభజన గావించి శత్రువును బలహీనపరచుట – ఈ పద్ధతులలో ఏ ఒక్క పద్ధతి నుపయోగించి యైనను లేక సమ్మిళితముగా ఉపయోగించియైనను శత్రువుపై ఆధిక్యమును పొంద వలెను.

**శ్లో॥ అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుధ్యమానయోః ।**
**పరాజయశ్చ సంగ్రామే తస్మాద్యుద్ధం వివర్జయేత్ ॥** (మను. **VII**–199)

యుద్ధములో జయాపజయములు అనిత్యములగుటచేత సాధ్యమైనంత వరకు యుద్ధము సంభవించకుండునట్లు చూడవలెను.

ఏ దేశములో పాలకుడు పాపభూయిష్టమైన ధనమును (శిక్షారూపములో సహితము) పరిగ్రహించక, న్యాయార్జిత ధనముతో పరిపాలన గావించునో; అట్టి దేశములో జనన మరణములు సకాలములో సంభవించుననియు, ప్రజలు దీర్ఘా యుష్యమును కలిగియుందురనియు, పంటలు సస్యశ్యామలముగా ఫలించుననియు మనుస్మృతి బోధించుచున్నది.

**శ్లో॥ యత్ర వర్జయతే రాజా పాపకృద్భ్యో ధనాగమమ్ ।**
**తత్ర కాలేన జాయంతే మానవా దీర్ఘజీవినః ॥** (మను. **IX**–246)

ఏ దేశములో పాలకుడు పాపభూయిష్టమైన ధనమును పరిగ్రహించడో, అట్టి దేశములో మానవుల జననము సకాలములో జరుగును మరియు వారు దీర్ఘాయుష్యమును కలిగియుందురు.

**శ్లో॥ నిష్పద్యంతే చ సస్యాని యథోప్తాని విశాం పృథక్ ।**
**బాలాశ్చన ప్రమీయంతే వికృతం న చ జాయతే ॥** (మను. **IX**–247)

వైశ్యుడు విత్తిన విత్తనములు చక్కగ మొలకలెత్తి, సస్యశ్యామలముగా పెరుగును. అకాల మరణములు గాని, బిడ్డలు వికలాంగులై జన్మించుటగాని సంభవింపవు.

ఇచట న్యాయార్జిత ధనముతో పరిపాలించుటలో గల శుభములను మను మహర్షి చక్కగా వివరించినాడు.

ఇపుడు, మనుమహర్షి నేరస్థులను తగు విధముగ శిక్షించక వదలిన యెడల పాలకునకు సంభవించు ప్రమాదములను వివరించుచున్నాడు :

**శ్లో॥ యావాన వధ్యస్య వధే తావాన్వధ్యస్య మోక్షణే ।**

**అధర్మో నృపతేర్దృష్టో ధర్మస్తు వినియచ్ఛతః ॥** (మను. **IX**-249)

ఒక అమాయకుడైన వ్యక్తిని చంపినందువలన ఎట్టి పాపము లభించునో, అట్టి పాపము ఒక నేరస్థుని శిక్షించక వదలిన యెడల కలుగును. కావున, శాస్త్రాను సారముగా తగు శిక్షను విధించుట పాలకుని యొక్క ధర్మమైయున్నది.

**శ్లో॥ అశాసంస్తస్కరాన్యస్తు బలిం గృహ్ణాతి పార్థివః ।**

**తస్య ప్రక్షుభ్యతేరాష్ట్రం స్వర్గాచ్చ పరిహీయతే ॥** (మను. **IX**-254)

ఏ పాలకుడు చోరులను, దోపిడివాళ్ళను శిక్షించుటకు అసమర్థుడై యుండియు, ప్రజల నుండి పన్నులను మాత్రము వసూలు చేయునో, అట్టి పాలకుడు స్వర్గ చ్యుతుడగును. మరియు అతని దేశములో అధ్వాన్నస్థితి చెలరేగును.

**శ్లో॥ నిర్భయం తు భవేద్యస్య రాష్ట్రం బాహుబలాశ్రితమ్ ।**

**తస్య తద్వర్ధతే నిత్యం సిచ్యమాన ఇవ ద్రుమః ॥** (మను. **IX**-255)

ఏ దేశము పూర్తిగా పాలకునిపై ఆధారపడి నిర్భయముగాను, నిశ్చింతగాను ఉండునో; అట్టిదేశము, చక్కగా నీరు పోసి పెంచిన మొక్కలాగా, పురోభివృద్ధి మార్గమున పయనించుచుండును.

తరువాత, చోరులు దోపిడిగాండ్రు మొదలగు సంఘవిద్రోహులను గుర్తించి, శిక్షించు విధానము క్రింది శ్లోకములలో చెప్పబడినది :

**శ్లో॥ తాన్విదిత్వా సుచరితైర్గూఢై స్తత్కర్మకారిభిః॥**

**చారైశ్చ అనేకసంస్థానైః ప్రోత్సాద్య వశమానయేత్ ॥** (మను. **IX**-261)

పాలకుడు అనేకమంది గూఢచారులను వేరువేరు స్థలములలో నియుక్తులను జేయవలయును. వారు వారి యొక్క పనిలో నిపుణులుగాను, నిజాయితీపరులుగాను, మరియు మారువేషములు వేయుటలో నేర్పుగలవారు గాను ఉండవలయును. వారి ద్వారా పాలకుడు సంఘద్రోహులను గుర్తించి, వారిపై బలమైన హస్తము నుంచి, వారిని అదుపులో నుంచవలయును.

**శ్లో॥ తేషాం దోషానభిఖ్యాప్య స్వేస్వే కర్మణి తత్త్వతః ।**

**కుర్వీత శాసనం రాజా సమ్యక్సారాపరాధతః ॥** (మను. **IX**-262)

వారిలో ప్రతి వ్యక్తి యొక్క నేరములను వేరువేరుగా ప్రజల సమక్షములో బహిర్గత మొనర్చి, వారి నేరముల కుపయుక్తమగు శిక్షలను విధించి, వారి నదుపులోనికి తీసికొని రావలయును.

**శ్లో॥ నహి దండాదృతే శక్యః కర్తుం పాపవినిగ్రహః ।**

**స్తేనానాం పాపబుద్ధీనాం నిభృతం చరతాం క్షితౌ ॥** (మను. **IX**-263)

సమాజములో అజ్ఞాతముగా మెలుగుచూ నేరములను జేయు నేరస్థులను లేక సంఘద్రోహులను, వారి పాపభూయిష్ఠమైన ప్రక్రియలను అరికట్టుటకు శిక్ష తప్ప వేరే మార్గము లేదు.

**శ్లో॥ తత్సహాయైరనుగతైర్నానా కర్మ ప్రవేదిభిః ।**

**విద్యాదుత్సాదయేచ్చైవ నిపుణైః పూర్వతస్కరైః ॥** (మను. **IX**-267)

గత జీవితములో చోరులుగాను, దోపిడిదొంగలు గాను అయియుండి, ప్రస్తుతము సంఘద్రోహులుండు సందు, గొందులను, మూలమూలలను తెలిసియుండి నటువంటి మరియు సంఘద్రోహులకు సమయ సమయమున సహాయ మందించుచున్న వారి యొక్క జాడ తెలిసియుండినటువంటి వ్యక్తుల యొక్క సహాయమును పాలకుడు తీసికొని, సంఘద్రోహులను పట్టి, వారిని తగు విధముగ శిక్షించవలయును.

**'దొంగను దొంగే పట్టగలడు' అనెడి సామెత నాధారముగా జేసికొని పాలకుడు దొంగలను పట్టుటకు దొంగలనే గూఢచారులుగా ఉపయోగించుకొనవలయునని మనుస్మృతి బోధించుచున్నది.**

**శ్లో॥ న హోఢేన వినా చోరం ఘాతయేద్ధార్మికో నృపః ।**

**సహోఢం సోపకరణం ఘాతయేదవిచారయన్ ॥** (మను. **IX**-270)

సరియైన సాక్ష్యము లేకుండా పాలకుడు ఏ ఒక్క దొంగను శిక్షించరాదు. ఒక్కసారి నిర్వివాదాంశమైన సాక్ష్యము దొరికినపుడు రెండవ ఆలోచన లేకుండా వెంటనే అతనిని శిక్షించవలయును.

**శ్లో॥ రాష్ట్రేషు రక్షాధికృతాం సామంతాశ్చైవ చోదితాన్ ।**

**అభ్యాఘాతేషు మధ్యస్థాంఛిష్యా చ్చౌరా నివద్రుతమ్ ॥** (మను. **IX**-272)

రాష్ట్ర అధికారులు దొంగలతో రహస్యముగా చేయి కలిపినను లేక ఉపేక్ష చేసినను, వారిని గూడ దొంగలుగా లెక్కించి, శిక్షించవలయును.

**శ్లో॥ బంధనాని చ సర్వాణి రాజమార్గే నివేశయేత్ ।**

**దుఃఖితా యత్ర దృశ్యేరన్వికృతాః పాపకారిణః ॥** (మను. IX-288)

రాష్ట్ర పాలకుడు ఖైదీగృహములను, ఖైదీల యొక్క దౌర్భగ్యస్థితిని-వారనుభవించు కడగండ్లను ప్రజలందరు చూచునట్లుగా, రహదారుల ప్రక్కన నిర్మించవలయును.

అట్లు రహదారుల ప్రక్కన జైలు గృహములను నిర్మించుటలో ఉద్దేశ్యమేమనగా -ఖైదీలు అనుభవించు నిక్కృష్ట బాధలను చూచుచున్న ఇతర ప్రజలు నేరములను చేయుటకు జంకుదురు. అందువలన నేరస్థుల సంఖ్య తగ్గుట కవకాశమున్నది.

దేశ పాలకుడు తన దేశ ప్రజల కోరికల నెట్లు తీర్చవలయునను విషయమును మనుస్మృతి సోదాహరణముగా వర్ణించుచున్నది.

**శ్లో॥ వార్షికాంశ్చతురో మాసాన్ యథేంద్రోఽభిప్రవర్షతి ।**

**తథాభివర్షే త్స్వం రాష్ట్రం కామైరింద్ర వ్రతం చరన్ ॥** (మను. IX-304)

ఎట్లు ఇంద్రుడు సంవత్సరములో నాల్గు మాసములు వర్షములను పోసి పోసి పాడిపంటలతో ప్రజలను తృప్తిపరచుచున్నాడో, అట్లే రాష్ట్రపాలకుడు ప్రజల కోర్కెలను తీర్చవలయును.

**శ్లో॥ యథా సర్వాణి భూతాని ధరా ధారయతే సమమ్ ।**

**తథా సర్వాణి భూతాని బిభ్రతః పార్థివం వ్రతమ్** (మను. IX-311)

ఎట్లు భూదేవి చరాచర సమస్త ప్రాణులను భరించుచున్నదో, అట్లే రాష్ట్రపాలకుడు అతని దేశపు ప్రజలను భరించి, పృథ్వివలె ప్రవర్తించవలయును.

## 20. ఆశ్రమ ధర్మములు :-

మానవుని యొక్క జీవన వ్యవధి నాల్గు భాగములుగా విభజింపబడినది. వాటినే ఆశ్రమములందురు. అవి బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థా శ్రమము, సన్న్యాస్రామము. మానవుడు తానున్న ఆశ్రమమును బట్టి, ఆ ఆశ్రమ మునకు సంబంధించిన విధ్యుక్త ధర్మములను ఆచరించవలసియుండును. సనాతన ధర్మము ఆశ్రమ ధర్మములను క్రిందివిధముగా ప్రబోధించుచున్నది.

## 21. బ్రహ్మచర్యం :-

'బ్రహ్మచర్యం' అను పదమునకు రెండు అర్థాలు ఉన్నవి. (1) బ్రహ్మము గురించి మననము చేయుట, (2) మనస్సులో కామభావనగాని, భౌతికంగా కామవ్యవహారం గాని లేకుండా ఉండుట.

మొదటి అర్థములో ఈ పదమును నిర్వచిస్తూ శ్రీ జాబాల దర్శనోపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది :

**"బ్రహ్మభావే మనశ్చారం బ్రహ్మచర్యం పరంతప" (1-14)**

అనగా "మనస్సును బ్రహ్మ భావనలో లగ్నము చేయుటయే బ్రహ్మచర్యం"

శ్రీ శంకర భగవత్పాదుల వారు ఇట్లు నిర్వచించినారు :

**"సర్వం బ్రహ్మేతి మోవేద బ్రహ్మచారీ స ఉచ్యతే" !** అనగా సకల చరా చరములలో బ్రహ్మమును తిలకించే వాడే బ్రహ్మచారి".

'బ్రహ్మ' మనగా 'వేద'మని వేరొక అర్థమున్నూ గలదు. కావున, ఎవడైతే వేదాధ్యయన వ్రతము నవలంబించునో, అతడే బ్రహ్మచారి. ఎవడైతే వేదాధ్యయనము ద్వారా అంతఃకరణ శుద్ధిని బొంది, తానే బ్రహ్మమను భావన గలిగియుండునో, వాడే బ్రహ్మచారి. అలాంటి బ్రహ్మచారికి ఈ విశ్వమంతా బ్రహ్మమయంగా గోచరించును.

ఇక రెండవ అర్థములో యాజ్ఞవల్క్యమహర్షి క్రింది విధముగ నిర్వచించినారు

**శ్లో॥ కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా ।**
**సర్వత్రమైథున త్యాగో బ్రహ్మచర్యం ప్రచక్షతే ॥**

'ఎల్లప్పుడు సర్వావస్థలలోను మనసా వాచా కర్మణా స్త్రీ సంగమాన్ని త్యజించినవాడే బ్రహ్మచారి యని చెప్పబడును'.

మన పురాణేతిహాసములలో బ్రహ్మచర్యమును కఠినముగా పాలించి, పరాకాష్ఠను ప్రపంచానికి చాటిన వ్యక్తులు అనేకమంది ఉన్నారు. అందులో బాలబ్రహ్మచారియైన హనుమంతుడు ప్రథముడు. తరువాత, శ్రీరాముడు, లక్ష్మణుడు గూడ జితేంద్రియులై పదునాల్గు సంవత్సరములు బ్రహ్మచర్యమును పాటించి, పరాకాష్ఠనందుకొన్న మహాపురుషులు.

అందాలరాశియైన సీత ప్రక్కన ఉన్నప్పటికి పదునాల్గు సంవత్సరములు కఠినమైన బ్రహ్మచర్యమును పాలించిన ఆదర్శపురుషోత్తముడు శ్రీరామచంద్రప్రభువు. శ్రీరాముడు అడవిలో పర్ణశాలయందు పరుండునపుడు తనకు సీతాదేవికి మధ్యలో గాండీవమును పెట్టి, "హే గాండీవమా! నీవే మా బ్రహ్మచర్యమునకు సాక్ష్యము" యని చెప్పి పరుండెడివాడట.

పదునాల్గు సంవత్సరములు పూర్తియయి, శ్రీరాముడు అయోధ్యకు వచ్చిన శుభసమయమున ఆయన దర్శనార్థమై ప్రజలందరు వీథికి రెండువైపులా బారులు తీరి ఉన్నారట. శ్రీరాముడు వారినందరిని తిలకిస్తూ రాజభవనము చేరిన పిదప, వశిష్ఠులవారి వద్దకు వెళ్ళి, "హే గురుదేవా! ఈ రోజు ప్రజలందరిని తిలకించినాను, వారిలో పదునాల్గు సంవత్సరముల లోపు వయస్సు గలిగిన బాలుడు ఒక్కడును కనిపించలేదు, కారణమేమి?" యని ప్రశ్నించినాడు. అపుడు గురుదేవులు ఆశ్చర్య చకితులై, దివ్యదృష్టితో వాస్తవమును దర్శించి, ఇట్లు చెప్పినారు. "రామచంద్రా! అయోధ్యలోని దంపతులు నీ యొక్క వియోగములో చింతాక్రాంతులై కామవాంఛనే పూర్తిగా త్యజించినవారై, ఈ పదునాల్గు సంవత్సరములలో సంతతినే బడయరైరి. ఇదియే కారణము". చూచితిరా! శ్రీరామచంద్రుని గొప్పతనము!! పదునాల్గు సంవత్సరములు అయోధ్యావాసుల చేత గూడ పాలింపచేసిన ఆదర్శ పురుషోత్తముడు శ్రీరాముడు.

ఇక, లక్ష్మణుడు బ్రహ్మచర్యంలో గాని, సచ్ఛీలములో గాని శ్రీరామునికి ఏ మాత్రము తీసిపోడు. లక్ష్మణుడు పదునాల్గు సంవత్సరములు కఠిన బ్రహ్మచర్యమును పాలించుటయే గాక, పరస్త్రీలను కన్నెత్తియైనను చూడని సత్పురుషుడు, సచ్ఛీల సంపన్నుడు.

సీతారాముల వివాహమయిన తరువాత పండ్రెండు సంవత్సరములు అయోధ్య లోను, పదమూడు సంవత్సరములు వనములోను వారి ననుసరించుచు, వారి సేవచేయుచు గూడ తన స్వంత వదిన అయిన సీతాదేవి యొక్క మోమును చూచి యెఱుగని సద్బ్రహ్మచారి లక్ష్మణుడు. సీతాదేవి ఋష్యమూక పర్వతముపై వదిలిన నగల మూటను శ్రీరాముడు లక్ష్మణునికిచ్చి, "ఇవి మీ వదినవేమో పరిశీలింపుము" యని ఆదేశించినపుడు, లక్ష్మణుడిచ్చిన సమాధానమే దీనికి నిదర్శనము. లక్ష్మణుడిట్లు చెప్పెను.

**శ్లో॥ నా౽హం జానామి కేయూరే నా౽హం జానామి కుండలే ।**

**నూపురే త్వభి జానామి నిత్యం పాదాభివందనాత్ ॥**

"నేను సీతాదేవి యొక్క బాహువులకు ధరించు దండకడియములను ఎఱుగను. ఆమె చెవులకు ధరించు కుండలములను ఎఱుగను. నేను ప్రతినిత్యము పాదాభి వందనము చేయునపుడు చూచుచుందును గాన ఆమె పాదములపై ధరించుచుండు నూపురము (అందె)లను మాత్రము ఎఱుగుదును".

ఈ సమాధానమును వినినపుడు మన హృదయము కలచివేయును. ఇంతటి సౌశీల్యసంపన్నులు, బ్రహ్మచర్యవ్రతులు ఏ దేశచరిత్రలోనైన కనిపిస్తారాయని ఆశ్చర్యచకితులమగుదుము. కాని, ఇది యథార్థము గదా! ఇదియే భారతీయ సంస్కృతి యొక్క గొప్పదనము మరియు ప్రత్యేకత. ఈ భారతీయ సంస్కృతికి మూలాధారమైన సనాతన ధర్మము యొక్క గొప్పదనమున్ను ఇదియే.

ఇక, హనుమంతుడు వీరిద్దరిని మించినవాడు బ్రహ్మచర్యవ్రత పాలనలో. అతడు ఆ జన్మము బ్రహ్మచారిగా ఉండి, రాముని సేవకే తన పూర్తి జీవితమును అంకితము చేసిన పుణ్యపురుషుడు.

హనుమంతుడు సముద్రలంఘనము చేసి, లంకిణిని జయించి, లంకలో ప్రవేశించినాడు. ఇపుడు సీతాదేవిని వెదకాలి. ఎలా వెదకాలి? ఎక్కడ వెదకాలి? అనే ప్రశ్నలు తలెత్తాయి. స్త్రీ స్త్రీలలోనే ఉంటుంది, కాబట్టి అంతఃపురములో వెదకాలి అని నిర్ణయించుకొన్నాడు. కాని, అంతఃపురములో ప్రవేశించుటెట్లు? ఇచట పరిస్థితి చూస్తే-ఎవరికీ తెలియకుండా గాలి కూడ సంచరించడం కష్టమనిపిస్తోంది అనుకొన్నాడు. అపుడొక ఆలోచనవచ్చి, అదే క్రియారూపం దాల్చింది.

**శ్లో॥ సూర్యేచాస్తంగతేరాత్రౌ దేహం సంక్షిప్యమారుతిః ।**

**వృషదంశక మాత్రస్సన్ బభూవాద్భుత దర్శనః ॥**

సూర్యాస్తమయమయిన పిదప దేహాన్ని సంక్షేపించి 'పిల్లి' అంతవాడై అద్భుత దర్శనుడయ్యాడు హనుమంతుడు. అంతట అంతఃపురములో ప్రవేశించి, సీతాదేవి కొరకు వెదుకనారంభించెను. అంతఃపురము ఏకాంతవాసము గనుక, పురుషులెవ్వరు లేరను విశ్వాసముతో స్త్రీలు అనేక భంగిమలలోనున్నారు. వారు వివిధ స్థితులలో ఉన్నారు. వారందరిని పరికించి చూచాడు. చూడకూడని ఎన్నో సన్నివేశములను,

దృశ్యములను తిలకించాడు. ఎన్నో భంగిమలలో నిద్రిస్తున్న ఎందరో స్త్రీలను చూచి నాడు. కాని, వారిలో సీతాదేవి కనిపించలేదు.

అప్పుడు హనుమంతుడు ఇలా ఆలోచిస్తాడు. ఇతరుల యొక్క భార్యలైన యీ స్త్రీలనందరినీ ఈ విధముగా చూచుట తప్పుకదా! బ్రహ్మచారినైన నేను పరస్త్రీలను చూచుట అధర్మము గదా! ఇచట పురుషులెవ్వరూ లేరను విశ్వాసముతో రావణస్త్రీలు వివిధ భంగిమలలో నిద్రించుచుండగా చూచాను. ఇది ధర్మలోపం, కాని నా మనస్సుకేమీ వికారం కలుగుట లేదు. శుభాశుభావస్థలలో సర్వేంద్రియముల ప్రవృత్తికీ మనస్సే కారణము. ఆ నా మనస్సు సుస్థిరముగా, అచంచలముగా ఉన్నది అని అనుకొంటాడు హనుమంతుడు.

ఎంత ఆశ్చర్యము! అటువంటి అశ్లీల దృశ్యములను చూచినప్పుడు కూడ హనుమంతుని మనస్సు చలించలేదు, మనస్సులో ఎటువంటి వికారమున్నూ కలుగలేదు. దీనినిబట్టి హనుమంతుని యొక్క బ్రహ్మచర్యవ్రతావలంబనము ఎంత సుదృఢమైనదో, ఎంత పటిష్ఠమైనదో అర్థమగుచున్నది గదా!

హనుమంతుడు బ్రహ్మచర్య వ్రతపాలనలో పరాకాష్ఠనందుకొన్న అద్భుతవ్యక్తి.

బ్రహ్మచర్యవ్రత పాలన యొక్క ప్రాముఖ్యతను సనాతన ధర్మము రామాయణ పాత్రల ద్వారా ప్రబోధించుచున్నది.

బ్రహ్మచారియైన వ్యక్తి అశ్లీల దృశ్యములను చూచుట చాలా ప్రమాదకరము. అట్లు జరిగినప్పుడు, అతని జీవితములో అవాంఛనీయమైన పరిణామములు కలిగి, పతనమగుట కవకాశము గలదు.

ఒకప్పుడు, గొప్ప తపసంపన్నుడైన సౌరభమహర్షి నీటిలో చేపల రతి విలాసాన్ని తిలకిస్తాడు. వెంటనే ఆయన మనస్సు చలించి, వివాహ మాడవలయునను వాంఛ ఉత్పన్నమాయెను. ఆ మహర్షి మాంధాతరాజు వద్దకు వెళ్ళి, రాజును ఒప్పించి, ఏబది మంది రాజకుమార్తెలను వివాహమాడెను. ఒక్కొక్క భార్యకు వందమంది సంతానము కలిగెను. ఆ విధముగా సంసారము పెరిగిపోయెను. ఆ మహర్షి సంసార లంపటములో పడి, తన తపశ్శక్తినంతయు కోల్పోవుటతో, ఆధ్యాత్మిక పతనము సంభవించెను.

కాబట్టి, ముముక్షువైన వ్యక్తి అశ్లీల దృశ్యములను చూచుటగాని, కామాతురు

(కామ విషయములనే ఎల్లప్పుడు చర్చించువారు లేక కామవాంఛ ఎక్కువగా కలిగిన వారు) లైన వ్యక్తుల యొక్క సాంగత్యమును కలిగియుండుట గాని చేయరాదు.

ఈ విషయమును శ్రుతి ఇట్లు చెప్పుచున్నది :

**"సంగం త్యజేత మిథునప్రతీనాం ముముక్షుః"**-ముముక్షువైన వాడు కామాతురులైన వ్యక్తుల సాంగత్యాన్ని విడిచివేయాలి".

బ్రహ్మాచారులకు, సన్యాసులకు ఒక ఆంక్ష విధించింది సన్న్యాసోపనిషత్తు. అదేమిటనగా- "**స్త్రి యమహిమివ**" "**స్త్రీని పాములా త్యజించాలి**" అని శాసించింది బ్రహ్మాచారులను, సన్న్యాసులను.

**సుందర స్త్రీలనెడి వలలలో చిక్కుకొనవద్దని పురుషులను మేల్కొలుపుచున్నది మహోపనిషత్తు.**

**మం.॥ కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసః ।**
**నార్యో నరవిహంగానా మంగబంధనవాగురాః ॥ (3-45)**

'కామనామ కిరాతుడు, పురుషులు అను పక్షులను బంధించు నిమిత్తమై, సుందరస్త్రీలనెడి వలలను విసురుచున్నాడు'.

కావున, ఆ వలలనుండి తప్పించుకొనుమని శ్రుతి బోధించుచున్నది పురుషులకు.

ఆ వలల నుండి తప్పించుకొనిన యెడల గలుగు ప్రయోజనమును తదుపరి మంత్రము బోధించుచున్నది :

**మం. ॥ స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్. (3-48)**

'స్త్రీని త్యజించిన జగత్తును త్యజించినట్లు. జగత్తును త్యజించి సుఖవంతుడగును'.

'స్త్రీని, భోగేచ్ఛను వదలి ఆత్మోన్నతికి సాధన చేయాలి' అనెడి హితవును **అన్నపూర్ణోపనిషత్తు** చక్కగా బోధించుచున్నది :

**"భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమే తత్సమాచర" ॥ (4-82)**

**"వాసనాక్షయ విజ్ఞాన మనోనాశో మహామతే !" (4-43)**

'భోగేచ్ఛను దూరంగా వదలి తత్త్వజ్ఞానం, మనోనాశనం, వాసనాక్షయాలనెడి మూడింటిని చక్కగా ఆచరించు' అని శ్రుతి ప్రబోధించుచున్నది.

గృహస్థులకు కూడా బ్రహ్మచర్యం విధించబడినది. 'సరైన ఋతుకాలంలో నియమానుసారం భార్యాభర్తలు సంగమించి, సత్సంతానమును బడయుటనే గృహస్థబ్రహ్మచర్యం **(ఋతౌ భార్యాం తదా స్వస్య బ్రహ్మచర్యం తదుచ్యతే)** అని చెప్పబడినది' యని జాబాల దర్శనోపనిషత్తు తెలుపుచున్నది. (1.13)

బ్రహ్మచర్య మాచరించుట వలన కలుగు వివిధ లాభములు క్రింద వివరింపబడినవి

**(1) "తద్బ్రహ్మ చర్యేణ హ్యే వేష్ట్వాత్మాన మను విన్దతే"**

**(ఛాందోగ్యోపనిషత్తు . 8-51)**

బ్రహ్మచర్యం పాటించుట వలన మానవుడు ఆధ్యాత్మికోన్నతిని, తద్వారా ఆత్మను పొందగలడు.

**(2) "--త త్ప్రజాపతి వ్రతం చరంతి యే మిథున ముత్పాద యంతే--"**

**((ప్రశ్నోపనిపషత్తు 1-15)**

ప్రజాపతి వ్రతం (గృహస్థ బ్రహ్మచర్యం) ఆచరించువారు పుత్రుడు, పుత్రిక అనెడి జంటను అదృష్టఫలముగా పొందగలుగుతారు.

**(3) "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః "**

**(పతంజలి యో.సూ.2-38)**

బ్రహ్మచర్యమును పాటించుట వలన అద్భుతశక్తి లభించును.

(4) బ్రహ్మచర్యమును పాటించువారు ధ్యానమునందు ఏకాగ్రతయు, తద్వారా సమాధిని తేలికగా పొందగలరు.

(5) బ్రహ్మచర్యం వలన సామాజిక ప్రయోజనము గూడ కలదు. దేశ జనాభాను అదుపులో పెట్టవచ్చును.

కావున, వివిధ వర్గములవారు బ్రహ్మచర్యమును ఆచరించి, తద్వారా లభించు ప్రయోజనములను పొందగలరని సనాతన ధర్మము ఆశించుచున్నది.



## 22. గృహస్థాశ్రమ ధర్మములు :-

ఆశ్రమములన్నింటిలోకెల్ల గృహస్థాశ్రమము చాలా శ్రేష్ఠమైనదని వేదములు, స్మృతులు ఘోషించుచున్నవి. మిగిలిన మూడు ఆశ్రమములవారును, పశు పక్ష్యాదులు, క్రిమికీటకాదులు-సమస్త ప్రాణులు గృహస్థునిపై ఆధారపడియున్నవి. భౌతికశాస్త్రజ్ఞులు, గణిత శాస్త్రజ్ఞులు, ఆర్థికశాస్త్ర నిపుణులు, కవివర్యులు, ఋషివర్యులు, వేదాంతులు మొదలగు వివిధ రంగములలోని సుప్రసిద్ధ ధీశాలురను ప్రసాదించునది గృహస్థాశ్రమమే గదా!

గృహస్థాశ్రమము యొక్క శ్రేష్ఠత్వమును తెల్పుచూ మనుమహర్షి ఇట్లు చెప్పినాడు:

**శ్లో॥ సర్వేషామపి చైతేషాం వేదస్మృతి విధానతః ।**
**గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః స త్రీనేతాన్బిభర్తి హి ॥** (మను. **VI**-89)

'గృహస్థుడు సమస్త ప్రాణులను సంరక్షించుచున్నాడు గనుక గృహస్థాశ్రమము నాల్గు ఆశ్రమములలో కెల్ల శ్రేష్ఠమైనదని వేదములు, స్మృతులు చెప్పుచున్నవి'.

బ్రహ్మచారి, వానప్రస్థుడు, సన్న్యాసి, గోవులు మొదలగు పశువులు గృహస్థుని చేత పోషింపబడుచున్నారు. గృహస్థుడు పండించిన ధాన్యమునే పొలములో ఏరుకొని తిని పక్షులు, క్రిమికీటకాదులు బ్రతుకుచున్నవి. కావున, సమస్త జీవులు గృహస్థునిపైనే ఆధారపడియున్నవి.

గృహస్థాశ్రమము యొక్క మరియొక విశిష్టత యేమనగా-నాల్గు ఆశ్రమములలోని వ్యక్తులు గృహస్థుల వలననే జన్మమును పొందుచున్నారు. గృహస్థుడు లేనియెడల మానవ సృష్టియే లేదు గదా!

ఈ విషయమును మనుమహర్షి క్రిందివిధముగా వివరించినాడు :

**శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థ శ్చ వానప్రస్థో యతి స్తథా ।**
**ఏతే గృహస్థ ప్రభవా శ్చత్వారః పృథగాశ్రమాః ॥** (మను. **VI**-87)

'బ్రహ్మచారీ, గృహస్థుడు, వానప్రస్థుడు, యతి (సన్న్యాసి) ఈ నాల్గు ఆశ్రమముల వ్యక్తులు గృహస్థుల వలననే జన్మమును బడయుచున్నారు'.

గృహస్థాశ్రమము అతి పవిత్రమైనదియు, ధర్మానుష్ఠానమునకు అనుకూలమగునది యునైయున్నది. దంపతులు ఆదర్శప్రాయులై యుండి – అనగా ఏకపత్నీవ్రతుడగు

భర్తయు, పతివ్రతయగు భార్యయున్నై యుండి; ఆశ్రమ ధర్మములను శాస్త్రరీత్యా పాలించిన యెడల, ఆ దంపతులు ఇహలోక సుఖమును, పరలోక శ్రేయస్సును బొందగలరు. వారు అతి మేధావులును, ధర్మాచరణ సంపన్నులగు సత్సంతానమును బడయగలరు. గృహస్థులు ధర్మముగ ధనము నార్జించుచు, మిగిలిన మూడు ఆశ్రమముల వారిని అనగా బ్రహ్మచారులను, వానప్రస్థులను, సన్యాసులను పోషించిన యెడల, వారి తపఃశక్తిలో కొంత భాగమును తాము పొంది, పరలోక సద్గతిని బడయగలరు. కావున, గృహస్థాశ్రమము అతిశ్రేష్ఠమైనది.

**శ్లో॥ యథా నదీ నదాః సర్వే సాగరే యాన్తి సంస్థితిమ్ ।**

**తథైవాశ్రమిణః సర్వే గృహస్థేయాన్తి సంస్థితిమ్ ॥** (మను. **VI**–90)

ఏ విధముగ నదీనదములన్నియు సముద్రమునందు కలియుచున్నవో, అదే విధముగ అన్ని ఆశ్రమముల వ్యక్తులు గృహస్థునియందు సంస్థితిని కలిగియున్నారు. అనగా ఇతర ఆశ్రమములవారందరు తమ మనుగడకు గృహస్థునిపై ఆధార పడియున్నారు.

ఏ ప్రాణియు వాయువు లేకుండ ఒక్క క్షణమైనను జీవింపజాలదు. సమస్త జీవులు వాయువును ఆశ్రయించియే బ్రతుకుచున్నవి. అట్లే అన్ని ఆశ్రమములవారు గృహస్థుని ఆశ్రయించి జీవించుచున్నారని మనుస్మృతి చెప్పుచున్నది.

**శ్లో॥ యథా వాయుం సమాశ్రిత్య వర్తన్తే సర్వ జంతవః ।**

**తథా గృహస్థ మాశ్రిత్య వర్తన్తే సర్వ ఆశ్రమాః ॥** (మను. **III**–77)

'ఎట్లైతే సమస్త జీవులు వాయువును ఆశ్రయించి జీవించుచున్నవో, అట్లే అన్ని ఆశ్రమముల వ్యక్తులు గృహస్థుని ఆశ్రయించి బ్రతుకుచున్నారు.

గృహస్థుడు బ్రహ్మచారులకు, సాధు సన్యాసులకు ఆహారమును, వస్త్రములను, నివసించుటకు వసతిని కల్పించిన యెడల, వారొనరించు తపస్సులో కొంత భాగము గృహస్థునికి ప్రాప్తించును. ఈ విధానము వలన ఉభయులును లాభాన్వితులగుదురు.

**శ్లో॥ భక్త్యా చాన్నం ప్రదదాతి తస్మై తపో విభాగం భజతే హి తస్య ।**

**గృహాశ్రమం శ్రేష్ఠమిహాశ్రమాణాం సమ్యక్చయః పాలయతే మనుష్యః ॥**

'గృహస్థుడు తన గృహమునకు వచ్చిన సాధుసన్యాసులకు భక్తితో ఆహారము

నొసంగిన యెడల, వారి తపస్సులో కొలది భాగమును పొందుచున్నాడు. ఈ గృహస్థాశ్రమమును శాస్త్రవిధిగా నిర్వర్తించిన యెడల, ఇది ఇతరాశ్రమములకంటె చాలా శ్రేష్ఠమైనది.'

గృహస్థులు భుక్తి కొరకు వారి వారి వృత్తులను నిర్వహించుటలో అధిక సమయమును వెచ్చించుదురు. కావున, జపతపాదుల కొరకు ఎక్కువ కాలమును దంపతులు వినియోగింపజాలరు. కాబట్టి, వారు తాపసులకు భోజన వసతులను కల్పించిన యెడల, వారి తపస్సులో కొంత భాగము దంపతులు పొంది, సద్గతిని బడయగలరు.

ఇక, దంపతులిరువురు ఎలా ప్రవర్తించాలి అను విషయమును మనుస్మృతి విపులముగా చర్చించుచున్నది.

**శ్లో॥ సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ ।**
**యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్ ॥** (మను. **III**-60)

'భార్యవలన భర్తయు, భర్త వలన భార్యయు సంతుష్టులై యే గృహమున అన్యోన్య ప్రేమతో మెలుగుచుందురో, ఆ గృహములో నిత్య కల్యాణము, పచ్చతోరణమై దంపతులిరువురికి ఆనందమును కలిగించుచుండును'.

దంపతులిరువురును స్వార్థరహితులై, అన్యోన్య ప్రేమ గలవారై యుండ వలయును. వారు త్యాగశీలురై యుండవలయును. భర్త సుఖమునకై భార్యయు, భార్య సుఖమునకై భర్తయు తన స్వసుఖమును సహితము త్యజించుటకు సంసిద్ధులై యుండవలయును. గృహ విషయములో భేదాభిప్రాయములు గలిగి కలహించు కొనుచుండిన యెడల, గృహములో శాంతి లోపించుటయే గాక, సమాజములో ఆ దంపతులు గౌరవ ప్రతిష్ఠలను గూడ కోల్పోవుదురు. కావున, దంపతులు ఎల్లప్పుడు ఒకరినొకరు అర్థము చేసికొనుచు, ఏకాభిప్రాయముతో మెలుగుచున్న యెడల, ఆ గృహములో శాంతి వర్ధిల్లును. ఆ దంపతులు సాంఘికముగను, ఆధ్యాత్మికముగను, భౌతికముగను, నైతికముగను ప్రగతిని సాధింపగలరు.

భారతీయ సంస్కృతిలో స్త్రీని 'గృహలక్ష్మి' యని పిలుచుట పరిపాటి. స్త్రీలు **పరాశక్తి స్వరూపిణులు. కావున, స్త్రీలను పూజ్యభావముతోను, అఖండ గౌరవముతోను చూడవలయును.**

**శ్లో॥ యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః॥**

**యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥** (మను. **III**–56)

'ఏ గృహమున స్త్రీలు పూజింపబడుచున్నారో (గౌరవింపబడుచున్నారో) అచట దేవతలు క్రీడింతురు. ఏ గృహమున స్త్రీలు పూజింపబడరో (అవమానింపబడుదురో) అచట నిర్వహింపబడు కార్యములన్నియు నిష్ఫలములగుచున్నవి".

**శ్లో॥ శోచంతి జాయయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్ ।**

**న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా ॥** (మను. **III**–57)

"ఏ కులమునందు స్త్రీలు దుఃఖింతురో, ఆ కులము పతనమొందును. ఏ కులము నందు స్త్రీలు దుఃఖింపరో అనగా సంతోషముతో నుందురో, ఆ కులము ఎల్లప్పుడు అభివృద్ధి జెందుచుండును.

భార్యాబిడ్డలు లేని గృహము శూన్యప్రదేశముగ కనిపించును. గృహిణియే గృహమునకు శోభ. గృహిణి 'గృహలక్ష్మి'గా పేర్కొనబడుచున్నది. సౌశీల్యవతియైన గృహిణికి, లక్ష్మీదేవికి పెద్ద తేడా ఏమియు లేదని మనుస్మృతి నుడువుచున్నది. కావున, గృహిణిని లక్ష్మీదేవి సదృశురాలుగా పూజ్యభావముతో గౌరవించవలయును.

**శ్లో॥ ప్రజానార్థం మహోభాగాః పూజార్హా గృహదీప్తయః ।**

**స్త్రియః శ్రియశ్చ గేహేషు న విశేషో ఽస్తి కశ్చన ॥** (మను. **IX**–26)

'స్త్రీలే సంతానప్రాప్తికి కారకులు. స్త్రీలే గృహానికి అలంకారము. వారు దయార్ద్రహృదయులు, పరోపకార పరాయణులు. అందువలన స్త్రీలను గౌరవించ వలయును. నిజము చెప్పాలంటే, సచ్ఛీలవతియైన స్త్రీకి లక్ష్మీదేవికి విశేషమైన భేదమేమియు లేదు.

**సనాతనధర్మములో స్త్రీకి ఉన్నతస్థానమీయబడినది.** గృహలక్ష్మియైన గృహిణిని ఎలా గౌరవించాలి, ఎలా తృప్తిపరచాలి, ఎలా సంతోషపరచాలి అనెడి విషయమును మనుస్మృతి చక్కగా వివరించుచున్నది.

**శ్లో॥ పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరై స్తథా ।**

**పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః ॥** (మను. **III**–55)

‘తండ్రి, అన్నలు, తమ్ముళ్ళు, భర్త, మరుదులు-వీరందరు తమ తమ క్షేమమును కోరినవారై నట్లయితే కుటుంబములోని స్త్రీలకు మంచి వస్త్రాభరణముల నిచ్చి పూజ్యభావముతో గౌరవించవలయును’.

**శ్లో॥ తస్మాదేతాః సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనై ః ।**
**భూతికామైర్నరైర్నిత్యం సత్కారే షూత్సవేషు చ ॥** (మను. **III**-59)

అభివృద్ధిని గోరు వ్యక్తులు తమ యొక్క స్త్రీలకు అందమైన ఆభరణములను, అలంకారయుతమైన వస్త్రములను, పోషకాహారమును ఎల్లప్పుడు విశేషంగా ఉత్సవాలలో లభింపజేసి వారిని గౌరవించవలయును.

**శ్లో॥ స్త్రియాం తు రోచమానాయాం సర్వం తద్రోచతే కులమ్।**
**తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ న రోచతే ॥** (మను. **III**-62)

ఏ కుటుంబములో స్త్రీలు సంతోషముగా నుందురో, ఆ కుటుంబములోని వారందరు సంతోషముగా నుందురు. స్త్రీలు సంతోషముగా లేనియెడల, ఆ కుటుంబములోని వారందరు వ్యాకులతతో చింతాక్రాంతులై యుందురు.

కావున, కుటుంబములోని స్త్రీలను అన్నివిధముల తృప్తి పరచి, సంతోషపెట్టుట అత్యావశ్యకమని సనాతనధర్మము ప్రబోధించుచున్నది.

స్త్రీకి సమాజములో ఉన్నతస్థాన మిచ్చుటయే గాక స్త్రీ ధనానికి గూడ పూర్తి సంరక్షణను కల్పించింది సనాతన ధర్మము.

**శ్లో॥ స్త్రీ ధనాని తు యే మోహాదుపజీవంతి బాంధవాః ।**
**నారీ యానాని వస్త్రం వా తే పాపా యాంత్యధో గతిమ్ ॥** (మను. **III**-52)

ఏ పురుషుడు గాని, అతని బంధువులుగాని స్త్రీ ధనాన్ని గాని, వస్త్రవాహనాదులను గాని అజ్ఞానముచేతగాని లేక ధనాశచేతగాని ఉపయోగించిన యెడల వారు పాపాత్ములై అథోగతి పాలగుదురు.

స్త్రీ ధనాన్ని ఎట్టి పరిస్థితులలో గూడ పురుషులు ఉపయోగించుకొనగూడదని కఠినముగా శాసించుచున్నది సనాతనధర్మము.

స్త్రీ ధనాన్ని ముట్టుకొనగూడదని శాసించిన పిదప, కుమారుడు లేనియెడల

కుమార్తెకు తండ్రి ఆస్తిపై పూర్తి హక్కు ఉన్నదని స్పష్టముగా చెప్పుచున్నాడు మను మహర్షి.

**శ్లో॥ యథైవాత్మా తథా పుత్రః పుత్రేణ దుహితా సమా ।**
**తస్యామాత్మని తిష్ఠంత్యా కథమన్యో ధనం హరేత్ ॥** (మను. **IX**-130)

తండ్రికి కుమారుడు తన స్వఆత్మతో సమానము. అట్లే కుమారుడు, కుమార్తె ఇద్దరు సమానమే. కాబట్టి, కుమార్తె ఉండగా, వేరే ఇంకెవరైనను ఆస్తికి హక్కుదారు డెట్లగును? అనగా, కాడని యర్థము. దీనిని బట్టి, కుమారులు లేనియెడల తండ్రి ఆస్తి కుమార్తెకు హక్కు అని (చెందునని) స్పష్టమగుచున్నది.

**శ్లో॥ మాతుస్తు యౌతకం యత్స్యా త్కుమారీ భాగ ఏవ సః ।**
**దౌహిత్ర ఏవ చ హరేదపుత్రస్యాఖిలం ధనమ్ ॥** (మను. **IX**-131)

తల్లి ఆస్తి అనగా తన యొక్క తల్లితండ్రులుగాని, సోదరులు గాని ఇచ్చిన ఆస్తి ఆమె యొక్క అవివాహిత కుమార్తెలకు చెందును. తండ్రి ఆస్తి తాను 'దత్తపుత్రిక'గా స్వీకరించిన కుమార్తె యొక్క పుత్రులకు చెందును.

**శ్లో॥ దౌహిత్రో హ్యఖిలం రిక్థమ పుత్రస్య పితుర్హరేత్ ।**
**స ఏవ దద్యాద్వౌ పిండౌ పిత్రే మాతామహాయ చ ॥** (మను. **IX**-132)

కుమారుడు లేని తాతగారి ఆస్తికి కుమార్తె యొక్క పుత్రుడైన మనుమడు హక్కుదారుడవును. ఆ మనుమడే తన స్వంత తండ్రికి మరియు తాతగారికి (తల్లి యొక్క తండ్రికి) ఇద్దరికి గూడ పిండప్రదానము చేయనర్హుడగును.

**శ్లో॥ పౌత్రదౌహిత్రయోర్లోకే న విశేషోఽస్తి ధర్మతః ।**
**తయోర్హి మాతాపితరౌ సంభూతౌ తస్య దేహతః ॥** (మను. **IX**-133)

ధర్మరీత్యా కుమార్తె యొక్క పుత్రునికి కుమారుని యొక్క పుత్రునికి మధ్య ఎటువంటి భేదమున్ను లేదు. ఎందువలననగా-మొదటివాని యొక్క తల్లి, రెండవవాని యొక్క తండ్రి ఇద్దరును ఒకే దేహము (శరీరము) నుండి పుట్టినవారు గనుక.

**శ్లో॥ పుత్రికాయాం కృతాయాం తు యది పుత్రోఽనుజాయతే ।**
**సమస్తత్ర విభాగః స్యాజ్జ్యేష్ఠతా నాస్తి హి స్త్రియాః ॥** (మను. **IX**-134)

'పుత్రిక'ను దత్తతగా స్వీకరించిన తరువాత పుత్రుడు కలిగిన యెడల ఆ తండ్రి యొక్క ఆస్తిని వారిద్దరి మధ్య సమానముగా పంచవలయును. ఇట్టి పరిస్థితిలో స్త్రీ కొఱకు ఎటువంటి భేదమును లేదు.

పై సూక్తుల ప్రకారము, స్త్రీకి అన్నివిధముల సంరక్షణను సనాతన ధర్మము కల్పించినది.

ఇన్ని విధముల రక్షణను పొందుచున్న స్త్రీ యొక్క బాధ్యత లేమిటి, ఆమె ఎలా వ్యవహరించాలి, భర్త యెడల ఆమెకు ఉండవలసిన శ్రద్ధాభక్తులను గురించి, పతివ్రతాధర్మములను గురించి ఇపుడు పరిశీలింతము.

సౌశీల్యవతియైన స్త్రీ గృహస్థునికి అనేక విధముల తోడ్పడును. గృహకృత్యములను చక్కగ నెరవేర్చుటలోను, పతికి ఉచిత సలహాల నొసంగుటలోను, అత్తమామలను ప్రత్యక్షదేవతలుగా నెంచి సేవచేయుటలోను, బిడ్డలను సద్బోధలతో నైతికముగాను ఆదర్శ పౌరులుగాను తీర్చిదిద్దుటలోను, పరోపకార మొనర్చుటలోను సర్వవిధముల సాయమొనర్చును.

**శ్లో॥ కార్యేషు దాసీ కరణేషు మంత్రీ**
**రూపే చ లక్ష్మీ క్షమయా ధరిత్రీ ।**
**స్నేహే చ మాతా శయనే చ రంభా**
**షట్కర్మయుక్తా కుల ధర్మపత్నీ॥**

గృహకార్యములయందు దాసిగను, కార్యాలోచనలయందు మంత్రిగను, రూపమునందు లక్ష్మీదేవిగను, ఓర్పునందు భూదేవిగను, స్నేహమునందు తల్లిగను, శయనమునందు రంభగను-ఈ ఆరు కర్మలయందు కుశలత గల స్త్రీయే కులమునందు ధర్మపత్ని యనిపించుకొనును.

మనుమహర్షి పతివ్రతాధర్మముల నిట్లు బోధించినాడు :

**శ్లో॥ విశీలః కామవృత్తో వా గుణైర్వా పరివర్జితః ।**
**ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవవత్పతిః ॥** (మను. V-154)

శీలహీనుడు, గుణహీనుడు, కామాతురుడు అయినప్పటికి సాధ్వియైన స్త్రీ పతిని దైవముగా నెంచి, ఉపచర్యలు ఎల్లప్పుడు చేయవలయును.

ఇదే విషయమును రామాయణములో సీతాదేవిచేత చెప్పించినాడు వాల్మీకి మహర్షి

శ్రీరామచంద్రుని గురించి హీనంగా, తేలికగా అవహేళన చేస్తున్న రాక్షస స్త్రీలకు చక్కటి సమాధానం ధైర్యంగా చెప్పింది సీతాదేవి :

**శ్లో॥ దీనోవా రాజ్యహీనోవా యోమే భర్తా సమే గురుః ।**
**తం నిత్య మనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా ॥** (సుందర. 24-9))

'దీనుడుగాని లేక రాజ్యహీనుడుగాని నా భర్తయే నాకు పూజ్యుడు. సూర్యుని యందు సువర్చలవలె నేనతనియందు నిత్యానురక్తయై యుందును' అని సీత తన భర్తను గురించి సగర్వంగా రాక్షస స్త్రీలకు చెప్పినది.

ఇచట విశేషమేమనగా - పతివ్రతాలక్షణములను స్త్రీ ముఖతః చెప్పించినాడు వాల్మీకి మహర్షి.

**శ్లో నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణమ్ ।**
**పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే ॥** ॥ (మను. V-155)

'స్త్రీలకు పతిసేవ తప్ప వేరు యజ్ఞములు, వ్రతములు, ఉపవాసములు అవసరము లేదు. పతి శుశ్రూష చేయు సతి స్వర్గలోకములో గౌరవింపబడును.

**శ్లో॥ పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా ।**
**పతిలోకమభీప్సంతీ నాచరే త్కించిదప్రియమ్** ॥ (మను. V-156)

పతిలోకమును వాంఛించు సాధ్వి పతి ఇచ్ఛకు వ్యతిరేకముగ ఏనాడును - అనగ పతి సజీవుడైయున్నప్పుడును, మరణానంతరమును-ప్రవర్తించగూడదు.

## వివాహ సంస్కారము :-

భర్త ఏకపత్నీవ్రతుడుగను, భార్య పతివ్రతగను-భార్యాభర్తలిరువురు అన్యోన్య ప్రేమతో గృహస్థాశ్రమమును నిర్వహించుటకు మన మహర్షులు వివాహ సంస్కారమును ఏర్పరచిరి. వివాహ సంస్కారము ఒక మహాయజ్ఞముగ వారు నిర్ణయించిరి. గృహస్థాశ్రమ నిర్వహణము ఒక మహాయజ్ఞ నిర్వహణము వంటిదని మనుమహర్షి యొక్క ఆశయము.

భార్యాభర్తలిరువురు తమ జీవితాంత పర్యంతము ఒకరికొకరు విశ్వాసపాత్రులుగా

ఉంటూ, భగవానుడు, తల్లిదండ్రులు, గురువు మరియు సమాజము యెడల వారికున్న విధ్యుక్త కర్తవ్యములను నెరవేర్చవలయును. ఈ కర్తవ్యములను విజయ వంతముగా కొనసాగించుటకు వారి మధ్య పవిత్రమైన ప్రేమ విశ్వాసములు ఉండవలయును. ఇదియే వివాహ ధర్మము.

“మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హేవెన్” అను సూక్తి ననుసరించి, వివాహములు దేవతల చేత నిర్ణయింపబడినవనియు, వివాహబంధము అభేద్యమైనదనియు, దంపతులు విడరాని సంబంధమనియు, వివాహము అగ్నిసాక్షిగా ప్రతిజ్ఞా పూర్వకముగా నిర్వర్తింపబడిన ఒక పవిత్రమైన సంస్కారమనియు మనుమహర్షి తెలుపుచున్నాడు.

**శ్లో॥ దేవదత్తాం పతిర్భార్యాం విందతే నేచ్ఛయాత్మన ః ।**
**తాం సాధ్వీం విభృయాన్నిత్యం దేవానాం ప్రియమాచరన్ ॥**

(మను. **IX**–95)

పురుషుడు తన ఇచ్ఛానుసారముగ భార్యను పొందజాలడు. ఆమె దేవతల చేత అతని కివ్వబడును. కాబట్టి, దేవతలను సంతోషపరచుటకుగాను పురుషుడు ఆమెను చక్కగ పోషించవలయును.

**శ్లో॥ ప్రజానార్థం స్త్రియః సృష్టాః సంతానార్థం చ మానవాః ।**
**తస్మాత్సాధారణో ధర్మః శ్రుతౌ పత్న్యా సహోదితః ॥** (మను. **IX**–96)

తల్లులగుటకు స్త్రీలును, తండ్రులగుటకు పురుషులును సృష్టింపబడిరి. వేదములో విధించబడిన ధర్మములను భర్త భార్యాసమేతముగ ఆచరించవలయును.

**శ్లో॥ ఏతావానేవ పురుషో యజ్జాయాఽఽత్మా ప్రజేతి హ ।**
**విప్రాః ప్రాహుస్తథా చైతద్యో భర్తా సా స్మృతాంగనా ॥** (మను. **IX**–45)

పురుషుడు అనగా తాను, తన సంతానము, భార్య.కాని, భార్యాభర్తలు ఇద్దరు కాదు-వారు ఒక్కరేయని విజ్ఞులు చాటుచున్నారు. అనగా, వారి యొక్క ఏకత్వమును -విడదీయరాని సంబంధమును తెలుపుచున్నారు.

**శ్లో॥ అన్యోన్యస్యావ్యభిచారో భవేదామరణాంతికః ।**
**ఏష ధర్మః సమాసేన జ్ఞేయః స్త్రీపుంసయోః పరః ॥** (మను. **IX**–101)

భార్యాభర్తలు-ఒకరు మరొకరిచేత వంచింపబడక జీవితాంతము వరకు పూర్తి సహకారముతో తమ విధ్యుక్త ధర్మమును పాలించవలయును.

## విధ్యుక్త ధర్మములు :-

ఇపుడు మనము గృహస్థుని విధ్యుక్త ధర్మములను కొన్నింటిని విచారించెదము.

"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథి దేవో భవ" అనెడి వేదవాక్కు ననుసరించి, గృహస్థుడు తల్లి, తండ్రి, గురువు, అతిథి- ఈ నల్గురను దైవసమానులుగా భావించి, సేవించి, సత్కరించవలయును.

వీరందరిలో తల్లి చాలా ముఖ్యమైనది, పవిత్రమైనది. తల్లి యొక్క విలువను ఎవరును అంచనావేయజాలరు. ఎంత సేవ చేసినప్పటికి తల్లి ఋణమును తీర్చు కొనజాలము.

రామాయణములో తల్లిని గురించి శ్రీరామచంద్ర ప్రభువు చెప్పిన మాటలను ఒకసారి నెమరువేసికొందము :

**"జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసీ"**

'తల్లియు మరియు జన్మించిన దేశమును స్వర్గముకంటే శ్రేష్ఠమైనవి' అని అంటాడు శ్రీరామచంద్రమూర్తి.

తల్లియొక్క శ్రేష్ఠత్వమును అంచనావేసి మనుమహర్షి ఇట్లు చెప్పినాడు :

**శ్లో॥ ఉపాధ్యాయాన్దశాచార్య ఆచార్యాణాం శతం పితా।**
**సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే ॥** (మను. II-145)

'ఉపాధ్యాయుని కంటె పదిరెట్లు ఆచార్యుని, ఆచార్యుని కంటె నూరు రెట్లు తండ్రిని, తండ్రి కంటె వెయ్యి రెట్లు తల్లిని గౌరవించవలయును'.

వీరి ముగ్గురిని సేవించుట వలన కలుగు ప్రయోజనములను మను మహర్షి ఇట్లు బోధించుచున్నాడు :

**శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా తు మధ్యమమ్ ।**
**గురు శుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే ॥** (మను. II-233)

'తల్లిని శ్రద్ధాభక్తులతో సేవించిన యెడల ఈ లోకంలో సుఖశాంతులు ప్రాప్తిం

చును. తండ్రికి భక్తితో సేవచేసిన యెడల మధ్యమ లోకమును, గురుశుశ్రూష వలన బ్రహ్మలోకమును లభించును'.

ఎవడైతే తల్లి, తండ్రి, గురువులకు భక్తి శ్రద్ధలతో సేవ జేయుచున్నాడో వాడు అన్ని ధర్మములను పాలించినవాడే యగుచున్నాడు అని మనుమహర్షి చెప్పుచున్నాడు.

**శ్లో॥ సర్వే తస్యాదృతా ధర్మా యస్యైతేత్రయ ఆదృతాః ।**
**అనాదృతాస్తు యస్యైతే సర్వాస్తస్యాఫలాః క్రియాః ॥** (మను. II-234)

'ఏ మానవుడు వీరి ముగ్గురికి (తల్లి, తండ్రి, గురువు) శ్రద్ధాభక్తులతో సేవ జేయునో వాడు అన్ని ధర్మములను పాలించినవాడగుచున్నాడు. ఎవడైతే వీరి ముగ్గురిని గౌరవించడో వాడాచరించు కర్మలన్నియు నిష్ఫలములగుచున్నవి'.

**శ్లో॥ త్రిష్వేతేష్వితికృత్యం హి పురుషస్య సమాప్యతే ।**
**ఏష ధర్మః పరః సాక్షాదుపధర్మోఽన్య ఉచ్యతే ॥** (మను. II-237)

'ఎవడైతే ఈ ముగ్గురికి సేవజేయుచున్నాడో వాడు వానియొక్క విధ్యుక్త కర్మల నాచరించిన వాడగుచున్నాడు. ఇదియే మానవుని యొక్క సర్వోత్తమ ధర్మము; ఇతర ధర్మములన్నియు ఉపధర్మములుగా చెప్పబడుచున్నవి'.

## అతిథి సత్కారము :-

అతిథి సత్కారమును గురించి మనుమహర్షి క్రింది విధముగా చెప్పుచున్నాడు

**శ్లో॥ సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే ।**
**అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకమ్ ॥** (మను. III-99)

'ఇంటికి వచ్చిన అతిథికి గృహస్థుడు ఉచితాసనము నొసంగి, అర్ఘ్యపాద్యాదుల నిచ్చి, శక్తి కొలది ఆహారమునిడి, విధిపూర్వకముగ సత్కరించవలయును'.

ఎట్టి పరిస్థితులలోను అతిథిని తిరస్కరించగూడదని మనుమహర్షి బోధించు చున్నాడు

**శ్లో॥ అప్రణోద్యోఽతిథిః సాయం సూర్యోఢో గృహమేధినా ।**
**కాలే ప్రాప్తస్త్వకాలే వా నాస్యానశ్నన్ గృహే వసేత్ ॥** (మను. III-105)

'సూర్యాస్తమయం తరువాత సకాలములో వచ్చినప్పటికి లేక అకాలములో వచ్చినప్పటికి అతిథిని గృహస్థుడు తిరస్కరించరాదు. రాత్రి సమయమున ఇంటిలో భోజనములు ముగిసిన తరువాత వచ్చినప్పటికి అతిథిని నిరాహారిగా నిద్రింప జేయరాదు'

అతిథి సత్కారము వలన ప్రాప్తించు ఫలమును మనుమహర్షి నుడువుచున్నాడు

**శ్లో॥ న వై స్వయం తదశ్నీయాదతిథిం యన్న భోజయేత్ ।**
**ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం వాతిథిపూజనమ్ ॥**

(మను. III-106)

'ఆహారపదార్థములను అతిథి భుజించిన వెనుకనే గృహస్థుడు భుజించ వలయును. విధిపూర్వక అతిథి సత్కారము శ్రేయస్సును, దీర్ఘాయుస్సును, కీర్తిని, స్వర్గమును గూడ ప్రాప్తింపజేయును'.

అతిథిని తిరస్కరించిన యెడల సంభవించు దుష్ఫలితములను పరాశరస్మృతి చక్కగా వర్ణించుచున్నది :

**శ్లో॥ అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।**
**పితరస్తస్యనాఽశ్నన్తి దశవర్షాణి పంచ చ ॥** (పరాశర I-45)

**శ్లో॥ కాష్ఠభారసహస్రేణ ఘృతకుంభశతేన చ ।**
**అతిథిర్యస్య భగ్నాశస్తస్య హోమో నిరర్థకః ॥ ॥** (పరాశర I-46)

ఇంటికి వచ్చిన అతిథి నిరాశ-నిఃస్పృహలతో, భగ్నమనస్కుడై రిక్తహస్తములతో తిరిగి వెళ్ళిన యెడల కలుగు దుష్పరిణామములను గురించి చర్చిస్తూ పరాశర మహర్షి ఇట్లు చెప్పుచున్నాడు.

ఏ గృహస్థుని ఇంటికి వచ్చిన అతిథి నిరాశ చెంది అనగా ఆదర-సత్కారములను పొందక, భగ్నమనస్కుడై తిరిగి వెళ్ళునో, అట్టి గృహస్థుని పితృదేవతలు అది తమ వంశకళంకముగా భావించి, ఆ గృహస్థునిపై కోపము వహించి, అతని చేతితో నిచ్చు అన్నముగాని, జలముగాని, శ్రాద్ధతర్పణాదులు గాని పదునైదు సంవత్సరములు పాటు గ్రహింపరు. ఆ వంశ-కళంకుని ద్వారా ఇవ్వబడు శ్రాద్ధ తర్పణాదులతో తృప్తి జెందుట కంటె ఆకలి దప్పులతో తపించుటయే మేలని తలంతురు. అపాత్రుడిచ్చు

అన్న-పానీయములతో తృప్తిజెందుట కంటె ఆకలి దప్పులను సహించుటయే మంచిదని తలంతురు.

కావున, అతిథిని ఉపేక్షించిన యెడల గల్గు దుష్పరిణామమేనగా-పితృదేవతల కోపము మరియు వారి యొక్క దుర్గతి.

తరువాత, వేయి మణుగుల సమిధలతోను, నూరు ఘటముల (కుండల) నేతితోను నిత్యము యజ్ఞ-యాగాది కర్మలాచరించినప్పటికి అతిథి-ఉపేక్షా పాపము నుండి నిష్కృతి లభించదు. దాని అర్థమేమనగా-దేవగణము గూడ అతిథి-ద్వేషి ద్వారా ఈయబడిన ఆహుతులను స్వీకరించరు. అతని యజ్ఞ-యాగాదులు నిష్ఫలములై పోవును.

దీని యొక్క అభిప్రాయమేమనగా-అతిథి అవమానము వలన సంభవించు పాపమునకు ప్రాయశ్చిత్తము గూడ లేదు. ఈ అపరాధమునకు శిక్ష కేవలము ఆ వ్యక్తియే గాక, అతని యొక్క పితృదేవతలు గూడ అనుభవించవలసి యుండును.

## అన్య విధ్యుక్త కర్మలు :-

దేవతలు, పితృలోకవాసులు, ఋషులు, అతిథులు, సమస్త జీవరాశులు గృహస్థునిపై ఆధారపడియున్నవి గనుక వారిని తృప్తిపరచుటకు గృహస్థుడు ఉచిత కర్మల నాచరించవలయునని మనుమహర్షి ప్రబోధించుచున్నాడు :

**శ్లో॥ ఋషయః పితరో దేవా భూతాన్యతిథయస్తథా ।**
**ఆశాసతే కుటుంబిభ్యస్తేభ్యః కార్యం విజానతా ॥** (మను. III-80)

ఋషులు, పితృలోకవాసులు, దేవతలు, సమస్త ప్రాణులు, అతిథులు కుటుంబీకుల నుండి సహాయము నాశించుతూ వారి వైపే చూచుచుందురు. కావున, విజ్ఞులైన గృహస్థులు క్రిందనుదాహరింపబడిన కర్మలనాచరించవలయును.

**శ్లో॥ స్వాధ్యాయే నార్చయేతర్షీన్హోమైర్దేవా న్యథావిధి ।**
**పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా ॥** (మను. III-81)

వేదాధ్యయనము చేత ఋషులను, హోమము చేత దేవతలను, శ్రాద్ధముల చేత పితరులను, ఆహారము మొదలగు వానిచేత అతిథులను, బలి చేత భూతములను విధి పూర్వకముగా తృప్తిపరచవలయును. వారిని ప్రసన్నులను జేయవలయును.

కొన్ని వైదిక కర్మల నాచరించుటకు గృహస్థులే అర్హులు. రామాయణములోని ఘటన మనందరికి తెలిసినదే గదా! సీతాదేవిని అరణ్యములో వదలిన తరువాత శ్రీరామచంద్ర ప్రభువు అశ్వమేధ యాగము నాచరింప తలపెట్టెను. ఈ యాగము సతీసమేతముగా చేయువలయును. శ్రీరామునకు ద్వితీయ వివాహమును ప్రతిపాదించితిరి పండితులు. శ్రీరాముడు యా ప్రతిపాదనను త్రోసిపుచ్చి తన ఏకపత్నీ వ్రతమును పాటించి, ఆదర్శపురుషుడాయెను. సువర్ణము చేత చేయబడిన సీతను ప్రక్కనుంచుకొని, యాగమును పూర్తిచేసిన ధర్మానుష్ఠానపరుడు శ్రీరామచంద్రుడు. అన్నివిధముల ఆదర్శగృహమేధి శ్రీరాముడు.

సమస్త మానవజాతికి జన్మనిచ్చునది గృహస్థాశ్రమము. సమస్త ఆశ్రమముల వారికి ఆధారభూతమైనది గృహస్థాశ్రమము. సమస్త ప్రాణికోటిని పోషించునది గృహ స్థాశ్రమము. ధర్మానుష్ఠానమున కాలవాలమైనది గృహస్థాశ్రమము. ఆదర్శపౌరులను తయారుచేయునది గృహస్థాశ్రమమే.

కావున, ఆశ్రమములలో కెల్ల గృహస్థాశ్రమము అతి శ్రేష్ఠమయినదని చెప్ప బడుచున్నది.

## 23. వానప్రస్థాశ్రమ ధర్మములు :-

గృహమేధి తన ఆశ్రమ ధర్మములను విధిపూర్వకముగా నిర్వర్తించిన తరువాత, ఎప్పుడైతే తన శరీరముపై వార్ధక్య చిహ్నములు కనిపించునో, తన బిడ్డలు పెద్దవారయి గృహనిర్వహణ బాధ్యతలు స్వీకరింప సమర్థులై యుందురో అపుడు తాను అరణ్యముల కేగి ఇంద్రియ సంయమమును గలిగియుండి తపస్సు నాచరింపవలయునని మనుస్మృతి బోధించుచున్నది.

**శ్లో॥ ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః ।**
**వనే వసేత్తు నియతో యథావద్విజితేంద్రియః ॥** (మను. **VI**-1)

'గృహస్థుడు తన ఆశ్రమ ధర్మములను విధిపూర్వకముగా నిర్వర్తించిన తరువాత విజితేంద్రియుడై వనమున కేగి అచట నివసించవలయును'.

**శ్లో॥ గృహస్థస్తు యదా పశ్యేద్వలీపలితమాత్మనః ।**
**అపత్యస్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్ ॥** (మను. **VI**-2)

'ఎప్పుడు గృహమేధి తన శరీరము ముడతలు పడుటయు, వెంట్రుకలు తెలుపుగా నగుటయు, కుమారునికి కుమారుడు కలుగుటయు చూచునో, అప్పుడు అతడు వనమున కేగవలయును'.

**శ్లో॥ సంత్యజ్య గ్రామ్యమాహారం సర్వంచైవ పరిచ్ఛదమ్ ।**
**పుత్రేషు భార్యాం నిక్షిప్యవనం గచ్ఛేత్సహైవ వా ॥** (మను. **VI**-3)

తన నిత్యక్రమ ఆహారమును, గృహ సామగ్రినంతయు పరిత్యజించి, అతడు భార్యా సహితముగా గాని లేక భార్యను పుత్రుల యొక్క సంరక్షణలో ఉంచిగాని వనమున కేగవలయును.

**శ్లో॥ స్వాధ్యాయే నిత్యయుక్తః స్యాద్దాంతో మైత్రః సమాహితః ।**
**దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకంపకః ॥** (మను. **VI**-8)

వానప్రస్థుడు ఎల్లప్పుడు శాస్త్రాధ్యయనమును చేయుచుండవలయును. ప్రతి వ్యక్తి యందు స్నేహభావమును కలిగియుండవలెను. మనస్సును పూర్తిగా స్వాధీనమందు ఉంచుకొనవలయును. తన శక్త్యానుసారముగా ప్రతిరోజు భిక్ష నొసంగవలెను. కాని, ప్రతిఫలముగా నేమియు ఆశించగూడదు. సమస్త ప్రాణులయందు దయను గలిగి యుండవలెను.

**శ్లో॥ అగ్నీ నాత్మని వైతానాం సమారోప్య యథావిధి ।**
**అనగ్నిరనికేతః స్యాన్మునిర్మూల ఫలాశనః ॥** (మను. **VI**-25)

విధిపూర్వకముగా నిత్యము వైతానికాగ్నిహోత్రము నాచరించుచూ, గృహహీనుడై అగ్నినుపయోగించక, కందమూలములను, ఫలములను మాత్రమే భుజించుచు వానప్రస్థుడు జీవించవలయును.

**శ్లో॥ అప్రయత్నః సుఖార్థేషు బ్రహ్మచారీ ధరాశయః ।**
**శరణేష్వమమశ్చైవ వృక్షమూల నికేతనః ॥** (మను. **VI**-26)

వానప్రస్థుడు శరీర సుఖముల కొరకు ఎటువంటి ప్రయత్నములను చేయరాదు. కఠినమైన బ్రహ్మాచర్యమును పాటించవలయును. ధరాతలముపైననే పరుండ వలయును. అతడు ఎటువంటి గృహవసతిని అనురాగమును కలిగియుండకూడదు. చెట్టు మొదట నున్న ధరాతలమునే తన గృహముగా నెంచవలయును.

**శ్లో॥ తాపసేష్వేవ విప్రేషు యాత్రికం భైక్షమాహరేత్ ।**
**గృహమేధిషు చాన్యేషు ద్విజేషు వనవాసిషు ॥** (మను. VI-27)

అత్యవసర పరిస్థితులలో వానప్రస్థుడు యతీశ్వరులైన బ్రాహ్మణుల వద్ద నుండి భిక్షను స్వీకరించవచ్చును. అది సాధ్యపడని యెడల వనవాసులైన బ్రాహ్మణదంపతుల నుంచి శరీర పోషణార్థమై భిక్షను తీసికొనవచ్చును.

**శ్లో॥ గ్రామాదాహృత్య వాశ్నీయాదష్టౌ గ్రాసాన్వనే వసన్ ।**
**ప్రతిగృహ్య పుటేనైవ పాణినా శకలేన వా ॥** (మను. VI-28)

(అదికూడ సాధ్యపడని యెడల) అతడు సమీపమున నున్న గ్రామమున కేగి భిక్ష తీసుకొని, తిరిగి వనమునకు వచ్చి, అపుడు ఎనిమిది పిడికెళ్ల అన్నమును మాత్రమే ఆకులో గాని, మట్టిపాత్రలో గాని లేక చేతిలో గాని పెట్టుకొని తినవలెను.

**శ్లో॥ ఏతాశ్చాన్యాశ్చ సేవేత దీక్షా విప్రో వనే వసన్ ।**
**వివిధాశ్చౌపనిషదీరాత్మ సంసిద్ధయే శ్రుతీః ॥** (మను. VI-29)

వనములో నివసించుచు, వానప్రస్థుడై పై నుదాహరించిన నియమములను గాని లేక అన్య శాస్త్రీయ నియమములను గాని పాటించవలయును మరియు ఆత్మ సాక్షాత్కారము కొరకు వేదములలోను, ఉపనిషత్తులలోను విధించిన నియమముల నాచరించవలయును.



## 24. సన్న్యాసాశ్రమ ధర్మములు :-

జీవితము యొక్క తృతీయభాగములో పై నుదాహరించిన వానప్రస్థాశ్రమ ధర్మముల నన్నింటిని ఆచరించిన పిదప, చతుర్థభాగములో అన్నింటిని పరిత్యజించి, సన్న్యాసాశ్రమమును స్వీకరించవలయునని మనుస్మృతి బోధించుచున్నది.

**శ్లో॥ వనేషు చ విహృత్యైవం తృతీయం భాగమాయుషః ।**

**చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగాన్పరివ్రజేత్ ॥॥** (మను. **VI**-33)

పై నుదాహరించిన విధముగా జీవితములో మూడవ దశను వనములో గడిపి, నాల్గవదశయందు సన్న్యాసాశ్రమమును స్వీకరించి, సర్వమును త్యజించి, పూర్తి వైరాగ్యమును గలిగియుండవలెను.

**శ్లో॥ ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్ ।**

**అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః ॥** (మను. **VI**-35)

ఋణత్రయమును (దేవతలు, ఋషులు, పితరుల యొక్క) తీర్చిన వెనుకనే ఏ వ్యక్తియైనను మోక్షము కొరకు అనగా సన్న్యాసాశ్రమమును అవలంబించుటకు నిశ్చయించు కొనవలెను. ఈ ఋణములను తీర్చకుండా, మోక్షము కొరకు ప్రయత్నించు వ్యక్తి నరకమునకు పోవును.

**శ్లో॥ అధీత్య విధివద్వేదాన్పుత్రాం శ్చోత్పాద్య ధర్మతః ।**

**ఇష్ట్వా చ శక్తితో యజ్ఞై ర్మనోమోక్షే నివేశయేత్ ॥** (మను. **VI**-36)

విధిపూర్వకముగా వేదాధ్యయనమును చేసి, ధర్మబద్ధముగా పుత్ర సంతానమును బడసి, శక్త్యానుసారముగ వేరువేరు యజ్ఞముల నాచరించిన పిదపనే, వ్యక్తి మోక్షము కొరకు అనగా సన్న్యాసాశ్రమమును స్వీకరించుటకు నిర్ణయించుకొనవలెను.

సన్న్యాసమును స్వీకరింప ఎవడు అర్హుడు అను విషయమును గురించి సన్న్యాసోపనిషత్తు క్రిందివిధముగ చెప్పుచున్నది :

**మం॥ చత్వారింశ త్సంస్కారసంపన్న స్సర్వతో విరక్త శ్చి**

**త్తశుద్ధి మేత్యాశాసూ యేర్ష్యాహంకారం దగ్ధ్వా**

**సాధన చతుష్టయ సంపన్న ఏవ సన్న్యస్తు మర్హతి ।**

**(సన్న్యాసోపనిషత్తు. 2-1)**

నలువది సంస్కారములు గలవాడు, సర్వతో విరక్తుడు, చిత్తశుద్ధిని పొంది ఆశ, అసూయ, ఈర్ష్య, అహంకారములను దహింపచేసి, సాధన చతుష్టయ సంపన్నుడైన వాడే సన్న్యసింప నర్హుడు.

ఎటువంటి వ్యక్తికి సన్న్యాసము నీయకూడదు? అను విషయముపై శ్రుతి ఇట్లు బోధించుచున్నది :

**మం. వ్రతయజ్ఞ తపోదాన హోమ స్వాధ్యాయ వర్జితమ్,**
**సత్య శౌచ పరిభ్రష్టం సన్న్యాసం నైవ కారయేత్.**

**(సన్న్యాసోపనిషత్తు. 2-5)**

వ్రతములు, యజ్ఞములు, తపస్సు, దానము, హోమము, స్వాధ్యాయము లేనివానిని, సత్యశౌచభ్రష్టుని సన్న్యాసిని చేయరాదు.

ఇపుడు, సన్న్యాసి యొక్క ఆహారవిహారములు, అనుష్ఠానమును గురించి, శ్రుతి, స్మృతు లేమి చెప్పుచున్నవో విచారించెదము.

**శ్లో॥ అనగ్నిరనికేతః స్యాద్గ్రామమన్నార్థమాశ్రయేత్ ।**
**ఉపేక్షకోఽసంకుసుకో మునిర్భావ సమాహితః ॥** (మను. **VI**-43)

నివసించుటకు గృహమును, వంట చేయుటకు అగ్నియు లేనటువంటి సన్న్యాసి గ్రామములోనికి భిక్షకు వెళ్ళవచ్చును. అతడు దేహభ్రాంతిని వదిలి, బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడై యుండవలెను.

సన్న్యాసి భిక్ష నెవరినుండి స్వీకరింపవలెను, ఎట్లు స్వీకరింపవలెను, స్వీకరించిన దాని నెట్లు భుజింపవలయునో శ్రుతి చక్కగా వివరించుచున్నది.

**మం. త్రిషువర్ణేషు భిక్షాచర్యం చరే త్పాణి పాత్రేణాశనం**
**కుర్యాదౌషధవ దశన మాచరే దౌషధవ దశనం ప్రాశ్నీయాత్ ।**

**(సన్న్యాసోపనిషత్తు -1)**

మూడు వర్ణములవారి ఇండ్లయందు భిక్షాటనము నాచరింపవలెను. చేయి యను పాత్రలోనే భుజింపవలెను.(భిక్ష చేతిలోనే పెట్టించుకొని, చేతిలోనే తినవలెను). ఔషధము వలె భోజనము చేయవలెను. అన్నమును ఔషధమును వలె తినవలెను. (అనగా తక్కువగాను, రుచిని చూడకయు తినవలెను).

**శ్లో॥ ఏకకాలం చరే ద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే ।**

**భైక్షే ప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥** (మను. **VI**-55)

సన్న్యాసి రోజుకు ఒకసారి మాత్రమే భిక్షను తీసికొనవలెను. ఎట్టి పరిస్థితులలోను ఒక్కసారి కంటె ఎక్కువ తీసికొనకూడదు. భిక్ష యందు ప్రీతిగల సన్న్యాసి విషయలోలుడై చరించును.

ఇదే విషయమును శ్రుతిమాత గూడ బోధించుచున్నది.

**మం. యథాలాభ మశ్నీయాత్ ప్రాణ సంధారణార్థం**

**యథా మేదో వృద్ధిర్న జాయతే -----**

**(సన్న్యాసోపనిషత్తు -1)**

ప్రాణము నిల్పుకొనుటకై దొరికినంతవరకే తినవలెను. కొవ్వు పెరగరాదు.

## సన్న్యాసి యొక్క ప్రవర్తన :-

సన్న్యాసి ఎట్టి పరిస్థితిలోను కోపోద్రిక్తుడు కాకూడదు. పరుష వాక్యములను ఓర్పుతో సహించవలెను. ఎవరితోను శత్రుత్వమును కలిగియుండకూడదు.

**శ్లో॥ అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన ।**

**న చేమం దేహమాశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్ ॥** (మను. **VI**-47)

సన్న్యాసి ఎంత అసహ్యమైన పరుషవాక్యములనైనను సహించవలెను. ఏ వ్యక్తిని అగౌరవపరచగూడదు. ఈ శరీరమున్నంతవరకు ఎవరితోను శత్రుత్వమును పెంపొందించుకొనకూడదు.

**శ్లో॥ క్రుధ్యన్తం న ప్రతిక్రుధ్యే దాక్రుష్టః కుశలం వదేత్ ।**

**సప్తద్వారావకీర్ణాం చ న వాచమనృతాం వదేత్ ॥** (మను. **VI**-48)

ఎవరైన కోపగించుకొనినప్పటికి ప్రతిక్రియగా కోపోద్రిక్తుడు కాకూడదు. ప్రియ వాక్యములనే ఎల్లప్పుడు పలుకవలయును. అసత్యమును పలుకకూడదు.

**శ్లో॥ అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః ।**
**ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ ॥** (మను. VI-49)

సన్న్యాసి ఎల్లప్పుడు బ్రహ్మచింతనతో బ్రహ్మనిష్ఠుడై ప్రపంచములో సంచరించు చుండవలెను. ఏ విధమైన ఆశలుగాని, కోరికలు గాని కలిగియుండకూడదు. ఆత్మారాముడై, ఆత్మతృప్తుడై, పరమానంద భరితుడై యుండవలెను.

**శ్లో॥ అభిపూజిత లాభాంస్తు జుగుప్సేతైవ సర్వశః ।**
**అభిపూజితలాభైశ్చ యతిర్ముక్తోఽపి బధ్యతే ॥ ॥** (మను. VI-58)

సన్న్యాసి గౌరవ సన్మానములతో గూడిన భిక్షను ఎల్లప్పుడు జుగుప్సతో వర్జింప వలయును. ఎందువలననగా-సన్మానముతో గూడిన భిక్ష సన్న్యాసిని బద్ధుని చేయును. అట్లు కానిది ముక్తిని కలుగజేయును.

**శ్లో॥ అల్పాన్నాభ్యవహారేణ రహః స్థానాసనేన చ ।**
**హ్రియమాణాని విషయైరింద్రియాణి నివర్తయేత్ ॥** (మను. VI-59)

అల్పాహారమును భుజించుచు, ఏకాంతముగా నివసించుచు, విషయముల వైపు పరుగిడుచున్న ఇంద్రియములను అదుపులో నుంచవలయును.

**శ్లో॥ ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేష క్షయేణ చ ।**
**అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥** (మను. VI-60)

విషయేంద్రియములను నిరోధించుట (అదుపులో నుంచుట) వలనను, రాగద్వేషములను క్షయింపచేయుట వలనను, అహింసా పాలన వలనను సన్న్యాసి ముక్తిని బొందుట కర్హుడగును.

**శ్లో॥ అధర్మప్రభవం చైవ దుఃఖయోగం శరీరిణామ్ ।**
**ధర్మార్థ ప్రభవం చైవ సుఖసంయోగమక్షయమ్ ॥** (మను. VI-64)

శరీరధారులు (మానవులు) అధర్మాచరణ వలన ఎట్లు దుఃఖము ననుభవించు

చున్నారో, ధర్మాచరణ వలన ఎట్లు అక్షయమైన (అనంతమైన) సుఖము ననుభవించు చున్నారో సన్న్యాసి విచారణ చేసి, తెలిసికొనవలయును.

**శ్లో॥ సంరక్షణార్థం జంతూనాం రాత్రావహని వా సదా ।**
**శరీరస్యాత్యయే చైవ సమీక్ష్య వసుధాం చరేత్ ॥** (మను. **VI**-68)

సన్న్యాసి భువిపై సంచరించునపుడు క్రిమికీటకాదులకు హింస జరుగకుండు నటుల భువిని జాగ్రత్తగా పరిశీలించుచు నడువవలయును.

**శ్లో॥ అహింసయేంద్రియా సంగైర్వైదికైశ్చైవ కర్మభిః ।**
**తపసశ్చరణైశ్చోగ్రైః సాధయంతీహ తత్పదమ్ ॥** (మను. **VI**-75)

అహింసాపాలన వలన, ఇంద్రియ-విషయముల యొక్క అసంగత్వము వలన, వేదవిహిత విధ్యుక్త కర్మాచరణ వలన మరియు కఠోర తపస్సు వలన సన్న్యాసులు పరమపదమును పొందుదురు.

**శ్లో॥ అస్థిస్థూణం స్నాయుయుతం మాంసశోణిత లేపనమ్ ।**
**చర్మావనద్ధం దుర్గంధి పూర్ణం మూత్రపురీషయోః ॥**
**శ్లో॥ జరాశోకసమావిష్టం రోగాయతనమాతురమ్ ।**
**రజస్వలమనిత్యం చ భూతావాసమిమం త్యజేత్ ॥**

(మను. **VI**-76,77)

అస్థులు, మజ్జ, రక్త మాంసములతో గూడినదియు, చర్మము కప్పబడినదియు, మూత్ర పురీషములతో దుర్గంధయుతమైనదియు, జరాశోకగ్రస్తమైనదియు, రోగములకు పుట్టినిల్లు అయినదియు, ఆకలిదప్పులచేత బాధింపబడునదియు, అనిత్యమయిన దియు, పంచభూతాత్మకమయినదియునగు ఈ శరీరముపై సాధకునకు ఎటువంటి మమకారము నుండకూడదు.

**శ్లో॥ నదీకూలం యథా వృక్షో వృక్షం వా శకునిర్యథా ।**
**తథా త్యజన్నిమందేహం కృచ్ఛ్రాద్గ్రాహాద్విముచ్యతే ॥** (మను. **VI**-78)

నది ఒడ్డుననున్న వృక్షము నదిలో పడి కొట్టుకొనిపోవునపుడు పక్షులు ఆ వక్షమున ఎట్లు వదిలిపెట్టునో, అట్లు సన్యాసి ఈ శరీరమును వదిలి, జనన–మరణ చక్రము నుండి విముక్తుడగుచున్నాడు.

**శ్లో॥ యదా భావేన భవతి సర్వభావేషు నిఃస్పృహాః ।**
**తదా సుఖమవాప్నోతి ప్రేత్య చేహ చ శాశ్వతమ్ ॥** (మను. **VI**–80)

ఎప్పుడైతే సన్న్యాసి ప్రపంచ విషయములయందు దోష దృష్టిని గలిగియుండి, వాటి నుండి పూర్తిగా నిఃస్పృహుడై యుండునో, అప్పుడే అతడు ఇహలోక సుఖమును, మరణానంతరము పరలోక సుఖమును బడయగలడు.

**శ్లో॥ అనేన విధినా సర్వాంస్త్యక్త్వా సంగాచ్ఛనైః శనైః ।**
**సర్వ ద్వంద్వ వినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే ॥** (మను. **VI**–81)

ఈ విధముగ ప్రాపంచిక విషయములను ఒకదాని తరువాత నొకటి నిదానముగా అన్నింటిని త్యజించి, ద్వంద్వాతీతుడై సాధకుడు కడకు బ్రహ్మములో లీనుడగును.

పై నుదాహరించిన సూక్తుల యొక్క పూర్తి సారంశరూపములో, సన్న్యాసి ఆవశ్యముగా అనుష్ఠింపవలసిన ధర్మములను నారదపరివ్రాజకోపనిషత్తు ఇట్లు బోధించుచున్నది :

**మం. ప్రేరయేద్వా తథా భిక్షుః స్వప్నేఽపిన కదాచన ।**
**జాయా భ్రాతృ సుతాదీనాం బంధూనాం చ శుభాశుభమ్ ॥**

**శ్రుత్వా దృష్ట్వా న కంపేత శోకహర్షౌ త్యజే ద్యతిః ।**
**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యా పరిగ్రహాః ॥**

**అనౌద్ధత్య మదీనత్వం ప్రసాద స్థైర్య మార్జవమ్ ।**
**అస్నేహో గురుశుశ్రూషా శ్రద్ధా క్షాంతి ర్దమ శ్శమః ॥**

**ఉపేక్షా ధైర్య మాధుర్యే తితిక్షా కరుణా తథా ।**
**హ్రీ స్తథా జ్ఞానవిజ్ఞానే యోగో లఘ్వశనం ధృతిః ॥**

ఏష స్వధర్మో విఖ్యాతో యతీనాం నియతాత్మనామ్ ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థ స్సర్వత్ర సమదర్శనః ॥
(నారద పరివ్రాజకోపనిషత్తు 4.9-13)

భిక్షువు (సన్న్యాసి) స్వప్నములోనైనను పరిగ్రహమును గురించి చింతించగూడదు. భార్యాభ్రాతృ పుత్రాదుల యొక్క శుభాశుభములను చూచినపుడు గాని, వినినప్పుడు గాని సన్న్యాసి సంతసముగాని, దుఃఖముగాని పొందగూడదు.

1) అహింస, 2) సత్యము, 3) అస్తేయము, 4) బ్రహ్మచర్యం, 5) అపరిగ్రహము, 6) గర్వరాహిత్యము, 7) అదీనత్వము, 8) ఇంద్రియశుద్ధి, 9) స్థైర్యము, 10) ఆర్జవము 11) స్నేహము లేకుండుట, 12) గురు శుశ్రూష, 13) శ్రద్ధ, 14) సహనము, 15) దమము (బాహ్యేంద్రియ నిగ్రహము), 16) శమము (అంతరింద్రియ నిగ్రహము), 17) ఉదాసీన భావము, 18) ధైర్యము, 19) మధుర భావము, 20) తితిక్ష, 21) కరుణ, 22) లజ్జ, 23) శాస్త్ర జ్ఞానము, 24) విజ్ఞానము, 25) యోగము, 26) మితభోజనము, 27) ధృతి- ఈ 27 ధర్మములను నియమశీలురగు సన్న్యాసులు అవశ్యముగా అనుష్ఠింపవలయును. మరియు సన్న్యాసి ద్వంద్వాతీతుడుగను, సర్వదా సత్త్వగుణాశ్రితుడుగను, సమస్త భూతములయందు సమాన భావము గలవాడుగను నుండవలెను.

సన్న్యాసి ఏఏ గుణముల నాశ్రయించిన పతితుడగునో శ్రుతి బోధించుచున్నది.

మం.॥ తృష్ణా క్రోధోఽనృతం మాయా లోభమోహౌ ప్రియా ప్రియే ।
శిల్పం వ్యాఖ్యాన యోగశ్చ కామోరాగ పరిగ్రహః ॥
అహంకారో మమత్వంచ చికిత్సా ధర్మసాహసమ్ ।
ప్రాయశ్చిత్తం ప్రవాసశ్చ మంత్రౌషధ గతాశిషః ॥
ప్రతిషిద్ధాని చైతాని సేవమానో వ్రజేదధః ।
(నారద పరివ్రాజకోపనిషత్తు 4. 5,6 1/2)

1) ఆశ, 2) క్రోధము, 3) అసత్యభాషణము, 4) మాయ, 5) లోభము, 6) మోహము, 7) ప్రియము, 8) అప్రియము, 9) చిత్రలేఖనము, 10) వ్యాఖ్యానము,

11) కామము, 12) రాగము, 13) పరిగ్రహము, 14) అహంకారము, 15) మమ కారము, 16) వైద్యము, 17) ఆవేశ ధర్మాచరణము, 18) ప్రాయశ్చిత్తము, 19) విదేశ సంచారము, 20) మంత్రములు, 21) ఔషధములు, 22) పరుల నాశీర్వ దించుట – ఇవన్నియు సన్న్యాసులకు నిషిద్ధములు. వీటిని ఆశ్రయించినచో సన్న్యాసి పతితుడగును.

## IV. ధర్మాచరణ యొక్క ఆవశ్యకత మరియు విశిష్టత :

వర్ణాశ్రమ ధర్మములను గురించి, మానవుడు పెంపొందించు కొనవలసిన సద్గుణములను గురించి, వర్జించవలసిన దుర్గుణములను గురించి సనాతన ధర్మము యొక్క ప్రబోధములను విచారించిన అనంతరము ధర్మాచరణ యొక్క ఆవశ్యకతను, దాని యొక్క విశిష్టతను గురించి సనాతన ధర్మము ఏమి బోధించుచున్నదో తెలిసి కొందము.

ధర్మాచరణ వలన మానవునకు సంరక్షణ లభించును, ఆత్మవిశ్వాసము పెంపొందును. ధర్మము నాచరించని వ్యక్తిని ఆ ధర్మమే నశింపచేయును. ఈ విషయమును మనుస్మృతి చక్కగా వర్ణించుచున్నది :

**శ్లో॥ ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః ।**
**తస్మాద్ధర్మో న హన్తవ్యో మానో ధర్మో హతోఽవధీత్ ॥**

(మను. **VIII**–15)

ఎవడు ధర్మమును నశింపజేయునో అతనిని అదే ధర్మము నశింపచేయును. ఎవడు ధర్మమును రక్షించునో అట్టి ధర్మమే అతనిని రక్షించును. కావున ధర్మమును ఎట్టి పరిస్థితిలోను నిర్లక్ష్యము జేయరాదు. అట్లు చేసిన యెడల అది మనలను నశింపజేయును.

పై సూక్తి ధర్మాచరణ యొక్క ఆవశ్యకతను, దానియొక్క విలక్షణ లక్షణమును తెలియజేయుచున్నది.

మనము ధర్మమును రక్షించిన యెడల అది మనలను రక్షించును అను నగ్నసత్యమును శ్రీవాల్మీకి రామాయణము గూడ చాటుచున్నది.

శ్రీరాముడు అరణ్యమునకు వెళ్ళేముందు తల్లియైన కౌసల్య వద్దకు అనుజ్ఞ కొఱకు వెళ్ళెను. పదునాల్గు సంవత్సరములు తనకు దూరముగా పోయే తనయునికి ఏమి ఇవ్వాలి అని ఆలోచించినది కౌసల్యాదేవి. పాపం! కౌసల్యకి ఏమి ఇవ్వాలో తెలియ లేదు. కొంచెముసేపు దీర్ఘముగా ఆలోచించి, ఇట్లు చెప్పినది :

**శ్లో॥ యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ ।**
**స వై రాఘవ శార్దూల ధర్మస్త్వా మభిరక్షతు ॥** (అయోధ్య. 15-3)

రాఘవా! నీ రక్షణ కొఱకు నేను చేయగల్గింది ఏమియు లేదు. ధర్మం ఒక్కటే నిన్నురక్షించునది. ఏ ధర్మాన్నైతే నీవు ధైర్యముగా నియమముగా నిత్యమూ పాలిస్తూ వచ్చావో, ఆ ధర్మమే నిన్ను రక్షిస్తుంది. నేను నీ కిచ్చే ఆశీర్వాదమిదే నన్నది. ధర్మాన్ని మనము కాపాడితే, ధర్మం మనల్ని కాపాడుతుంది.

ఇదియే సనాతన ధర్మము ప్రబోధిస్తున్న అతి ముఖ్యమైన అంశము.

మానవుడు శరీరమును వదలి పరలోకములకు వెళ్ళునపుడు ధనసంపత్తులు వెంటరావు. అతను ఆచరించిన సత్కర్మల లేక దుష్కర్మల యొక్క ఫలితము మాత్రమే అతనిని అనుసరించును. తత్ఫలితముగా స్వర్గసుఖములను గాని లేక నరకయాతనలను గాని జీవుడు అనుభవించవలసియుండును. కావున ధర్మాచరణ మానవునకు అత్యావశ్యకమయినది.

**శ్లో॥ ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః ।**
**శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి ॥** (మను. **VIII**-17)

మానవుడు శరీరమును వదిలివెళ్ళునపుడు తానాచరించిన ఒక్క సద్ధర్మము మాత్రమే అతని ననుసరించును. మిగిలిన వన్నియు శరీరముతోనే నశించిపోవును.

ఇదే విషయమును మరియొక సూక్తి ఇట్లు నుడువుచున్నది :

**శ్లో॥ అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః ।**
**నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మ సంగ్రహః ॥**

శరీరము అనిత్యమైనది (నశించిపోవునది). భోగభాగ్యములు కూడ శాశ్వతములు

కావు. ప్రతి క్షణము మత్యువు మనలను సమీపించుచున్నది. కావున, కాలమును వ్యర్థపరచక ధర్మము నాచరించుటయే మన కర్తవ్యము.

సదాచారము, లేక సత్ప్రవర్తన, లేక సచ్ఛీలము సర్వోత్కృష్టమైన ధర్మమని శ్రుతి, స్మృతులు చాటుచున్నవి.

**శ్లో॥ ఆచారః పరమోధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవ చ।**
**తస్మాదస్మిన్సదా యుక్తో నిత్యం స్యాదాత్మవాన్ద్విజః ॥** (మను. I-108)

'ఆచారము' సర్వోత్కృష్టమైన ధర్మమని శ్రుతి, స్మృతులు చాటుచున్నవి. కావున, తన ఆత్మశ్రేయస్సును వాంఛించు వ్యక్తి ఎల్లప్పుడు సదాచార సంపన్నుడై యుండవలెను.

సదాచారమే శ్రేష్ఠమైన ధర్మమని వ్యాసమహర్షి మహాభారతము-అనుశాసన పర్వములో నుడివినాడు :

**శ్లో॥ ఆచారలక్షణో ధర్మః సంతస్త్వాచార లక్షణాః ।**
**ఆగమానాం హి సర్వేషామాచారః శ్రేష్ఠ ఉచ్యతే ॥**

**శ్లో॥ ఆచార ప్రభవో ధర్మో ధర్మాదాయుర్వివర్ధతే ।**
**ఆచారాల్లభతే హ్యాయురాచారాల్లభతే శ్రియమ్॥**

**(మ.భా..అనుశాసన పర్వం)**

'సదాచారము' ధర్మము యొక్క లక్షణము. మంచికి లక్షణమున్నూ సదాచారమే. అన్ని బోధలకంటె ఆచారము శ్రేష్ఠమని చెప్పబడుచున్నది. ఆచారము నుండియే ధర్మముద్భవించినది. ధర్మము ఆయుస్సు నభివృద్ధిజేయును. సదాచారము వలన మానవునికి ఆయుస్సును, సిరిసంపదలును లభించును.

అన్నివిధములైన తపస్సులకు మూలాధారమైనది సదాచారమేనని స్మృతి నిర్ధారించుచున్నది :

**శ్లో॥ ఏవమాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిమ్ ।**
**సర్వస్య తపసో మూలమాచారం జగృహుః పరమ్ ॥** (మను. I-110)

'సదాచారము నుండియే ధర్మముత్పన్నమగుచున్నది గావున సర్వతపస్సులకు మూలాధారమైనది సదాచారమేనని మునులు నిర్ధారణ చేసియున్నారు.

ధర్మము నాచరించవలసిన విధానమును స్మృతి సోదాహరణంగా వర్ణించు చున్నది:

**శ్లో॥ ధర్మంశనైః సంచినుయాద్వల్మీకమివ పుత్తికాః ।**
**పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్ ॥** (మను. IV-238)

ఏవిధముగ చీమలు పుట్టను కొంచెము కొంచెము నిర్మిస్తూ పూర్తిచేయునో, అదేవిధముగ మానవుడు సమస్త జీవులకు ఎటువంటి కష్టమును కలిగించకుండ, ధర్మమును నిదానముగా రవంత రవంతగా పెంపొందించు కొనవలయును. ఈ ధర్మమే పరలోకములో మనకు సహాయకారి యగును.

మనుమహర్షి ధర్మాచరణ యొక్క ఆవశ్యకతను చాలా విపులంగా విమర్శ నాత్మకంగా విశదీకరించినాడు. మానవుడు పుట్టునప్పుడూ ఒక్కడే, గిట్టునపుడూ ఒక్కడే. తాను చేసిన సత్కర్మల యొక్క సత్ఫలితములను గాని, దుష్కర్మల యొక్క దుష్ఫలితములను గాని తానొక్కడే ఒంటిరిగా అనుభవించుచున్నాడు. వాటిలో భాగము పంచుకొను వారెవరును లేరు. భార్యా, బిడ్డలు, బంధువుల యొక్క సంబంధము ఈ శరీరముతోనే అంతమగును. వారెవరును పరలోకమునకు అనుసరించరు. తానొనరించిన ఒక్క ధర్మము మాత్రమే మానవుని అనుసరించి, పరలోకములో సహాయకారి యగును.

**శ్లో॥ నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః ।**
**న పుత్ర దారా న జ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః ॥** (మను. IV-239)

తండ్రి, తల్లి, కుమారుడు, భార్య మరియు బంధువులు-వీరెవరును పరలోకములో సహాయపడరు. ఒక్క ధర్మము మాత్రమే సంరక్షించును.

ఈ సందర్భములో మనము వాల్మీకి మహర్షి యొక్క పూర్వపుగాథను నెమరు వేసికొనుట ఎంతైనా అవసరము. ఆయన గృహస్థాశ్రమములో నున్నప్పుడు దోపిడి దొంగగా ప్రవర్తించుచూ గడించిన డబ్బుతో భార్య, బిడ్డలను పోషించుచుండెను.

ఒకరోజు, నారద మహాముని యొక్క సలహా ప్రకారము అతను భార్య, బిడ్డల సాన్నిధ్యమునకు వెళ్ళి, "నేనాచరించుచున్న పాపకర్మల యొక్క ఫలితములో మీరు కూడ భాగము పంచుకొనెదరా?" యని ప్రశ్నించెను. దానికి వారు నిర్మోహమాటముగా నిరాకరించిరి. అపుడు అతను తన తప్పిదమును తెలిసికొని, నారద మహాముని చెప్పిన రీతిగా తపమాచరించి, గొప్ప మహర్షియాయెను. కాబట్టి, భార్యబిడ్డల పోషణార్థమై మానవుడు ఎన్నడును ధర్మమార్గమును వదలరాదు.

**శ్లో॥ ఏకః ప్రజాయతే జంతురేక ఏవ ప్రలీయతే ।**
**ఏకోఽనుభుంక్తే సుకృతమేక ఏవ చ దుష్కృతమ్ ॥** (మను. **IV**–240)

మానవుడు ఒక్కడే పుట్టును, ఒక్కడే గిట్టును. తానాచరించిన సత్కర్మల యొక్క పుణ్యమును గాని, దుష్కర్మల యొక్క పాపమునుగాని ఒక్కడే అనుభవించును.

**శ్లో॥ మృతం శరీరముత్సృజ్య కాష్ఠలోష్టసమం క్షితౌ ।**
**విముఖా బాంధవా యాంతి ధర్మస్త మనుగచ్ఛతి ॥** (మను. **IV**–241)

మృతశరీరమును బంధువులు ఒక కట్టెముక్క వలె, లేక ఒక మట్టిముద్ద వలె క్షితిలో పడవైచి, వెనుకకు తిరిగి వచ్చెదరు. ఒక్క ధర్మము మాత్రమే వ్యక్తి నను సరించును.

**శ్లో॥ తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః ।**
**ణ హి సహాయేన తమస్తరతి దుస్తరమ్ ॥** (మను. **IV**–242)

కాబట్టి, మన సహాయార్థము మనము ధర్మమును నిదానముగా, కాని ఎల్లప్పుడు ఆచరించ వలయును. ధర్మము యొక్క సహాయముతోనే మనము దుస్తరమైన గాఢాంధ కారమును దాటగలము.

**శ్లో॥ ధర్మప్రధానం పురుషం తపసా హత కిల్బిషమ్ ।**
**పరలోకం నయత్యాశు భాస్వన్తం ఖశరీరిణమ్ ॥** (మను. **IV**–243)

తపస్సు చేత పాపములన్నింటిని దగ్ధము జేసి అంతరిక్షములో జ్యోతి వలె వెలుగుచున్న సత్పురుషుని ధర్మమే త్వరగా స్వర్గమునకు చేర్చును.

శుద్ధమైన ధర్మము నాచరించదలచిన వ్యక్తి ఏ విషయములను తెలిసికొనియుండ వలయునో స్మృతి బోధించుచున్నది :

**శ్లో॥ ప్రత్యక్షం చానుమానం చ శాస్త్రం చ వివిధాగమమ్ ।**

**త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధిమభీప్సతా ॥** (మను. **XII**-105)

శుద్ధమైన ధర్మము నాచరించదలచిన వ్యక్తి మూడు సాధనములను తెలిసికొని యుండవలయును-(1) ప్రత్యక్షానుభవము, (2) అనుమానము (ఊహ లేక భావన), (3) శాస్త్రములు, వివిధ ఆగమములు'.

ధర్మాచరణ యొక్క అవశ్యకతను, దానియొక్క శ్రేష్ఠత్వము (గొప్పతనము)ను మహాభారతము రామాయణాది ఇతిహాసముల ద్వారా కూడా సనాతన ధర్మము ప్రబోధించుచున్నది.

శ్రీమద్రామాయణ నాయకుడు- శ్రీరామచంద్రుడు వేదోక్త ధర్మములను తు.చ. తప్పక ఆచరించి, మర్యాద పురుషోత్తముడని, ఆదర్శ పురుషోత్తముడని ప్రసిద్ధికెక్కినాడు. మానవజాతికి ఆదర్శపురుషుడు అయినాడు. ఎట్టి దేశ, కాల పరిస్థితులలోను ఆయన మర్యాదను తప్పి ఎరుగడు, ధర్మమును విడనాడి ఎరుగడు.

పితృవాక్య పరిపాలన కొఱకు పదునాల్గు సంవత్సరములు వనవాస మొనర్చి, పుత్రధర్మమును నిభాయించిన పుత్రరత్నము శ్రీరామచంద్రుడు.

తన సోదరులను స్వాత్మ కన్నను మిన్నగా ప్రేమించిన భ్రాతృధర్మ నిరతుడు శ్రీరాముడు. యుద్ధభూమిలో మూర్ఛచెందిన లక్ష్మణునికై కన్నీరు మున్నీరుగా దుఃఖించి, తుదకు ప్రాణత్యాగము జేయుటకు సిద్ధపడిన భ్రాతృవత్సలుడు శ్రీరాముడు.

పదునాల్గు సంవత్సరములు అరణ్యములో సీతాదేవి ప్రక్కన ఉన్నప్పటికి కఠినమైన బ్రహ్మచర్య వ్రతధర్మములను పాటించిన జితేంద్రియుడు శ్రీరాముడు.

గృహస్థ ధర్మములలో కెల్ల అతి ముఖ్యమైన ఏకపత్నీ వ్రత ధర్మమును త్రికరణశుద్ధిగా పాలించిన మహనీయుడు శ్రీరాముడు.

విధ్యుక్త రాజధర్మములను తూ.చ. తప్పక పాటించిన ఆదర్శప్రభువు. ప్రజలను ... స్సల వలె పాలించి, వారి కష్టసుఖములలో తాను పాలు పంచుకొనుచు "రామ

రాజ్యము"ను నెలకొల్పెను. ప్రజాభిప్రాయమునకు అత్యంత మహత్వము నిచ్చు చుండెను. ఒక అతి సాధారణ వ్యక్తి నిందాపూర్వకముగ వచించిన మాటలను సహితము లెక్కించి, ప్రియమైన సీతను అడవులకు పంపిన ఉత్తమ ప్రభువు శ్రీరాముడు.

శ్రీరాముడు యుద్ధ ధర్మములను ఎల్లప్పుడు పాటించెడివాడు. ఎట్టి పరిస్థితిలోను అధర్మ యుద్ధము చేసి ఎరుగడు. ఒకసారి యుద్ధభూమిలో రావణుడు రథమును, ధనుస్సును సకల ఆయుధములను కోల్పోయి, విరథుడై, నిరాయుధుడై, నిస్సహాయ స్థితిలో నుండెను. అట్టి నిస్సహాయ స్థితిలో నున్న రావణుని వధించుట ఉచితము కాదని శ్రీరాముడు భావిస్తాడు. నిస్సహాయుడై నిలిచియున్న రావణునితో "ఓ రాక్షస రాజా! పాపం ! అలసిపోయినావు, లంకాపట్టణము లోనికి వెళ్లి, కొంచెము విశ్రాంతి తీసుకొని,తిరిగి రథారూఢుడవై, ధనుస్సును ధరించి తిరిగి మళ్ళీ యుద్ధభూమికి రమ్ము. అప్పుడు నా పరాక్రమమును చూచెదవు గాక!" అని శ్రీరాముడు ఎంతో హుందాతనముగా, ఔదార్యముతో ప్రవర్తిస్తాడు. పరమ కిరాతకుడైన రాక్షసరాజు తన చేజిక్కినప్పటికి, అవకాశము దొరికనది కదాయని అధర్మంగా రావణుని చంపదలచలేదు. యుద్ధనీతిని, మర్యాదను తూ.చ. తప్పకుండా అనుసరించిన ధర్మశ్రేష్ఠుడు శ్రీరామచంద్రుడు.

'శరణాగత రక్షణ' యను పరమధర్మమును శ్రీరాముడు ఎల్లప్పుడు పాటించెడివాడు. శరణాగతుడై వచ్చిన విభీషణుని స్వీకరించవద్దని వానరవీరులు ప్రతిపాదించగా, శ్రీరాముడు తన పరమధర్మము నిట్లు వెల్లడించినాడు:

**శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ॥**

(వాల్మీకి రామాయణం. **VI**-18.33)

ఏ వ్యక్తియైనను "నేను నీ వాడను, నన్ను రక్షింపుము" అని శరణువేడిన యెడల, అతనిని సమస్త జీవుల నుండి భయరహితుని జేయుదును. ఇది నా యొక్క దృఢమైన వ్రతము.

శ్రీరాముడు మరల సుగ్రీవునితో ఇట్లు చెప్పెను :

**శ్లో॥ ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా ।**
**విభీషణో వా సుగ్రీవ యది వా రావణః స్వయమ్॥**

(వాల్మీకి రామాయణం. **VI**–18.34)

ఓ వానర రాజా! సుగ్రీవా! అప్పుడే నా చేత శరణమొసంగబడినది. కావున, నీవు వెళ్ళి విభీషణుని తీసికొని రమ్ము లేక ఒకవేళ స్వయంగా రావణుడే విభీషణుని వేషములో వచ్చినప్పటికి తీసికొనిరమ్ము.

ఈ విధముగ శ్రీరాముడు 'శరణాగత రక్షణ' యను పరమ ధర్మమును పాలించి, చూపించినాడు.

సుగ్రీవుని కిచ్చిన మాట ప్రకారముగా వాలిని వధించి, సుగ్రీవుని రాజుగా ప్రతిష్ఠించి, స్నేహధర్మమును పాలించినాడు శ్రీరాముడు.

శ్రీరాముడు వివాహధర్మము నెంత చక్కగా పాటించినాడో గమనింపుడు.

సీత తన కళ్యాణగాథను అనసూయతో చెప్పుతూ

**శ్లో॥ దీయమానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః ।**
**అవిజ్ఞాయ పితుశ్ఛంద మయోద్యాధిపతేః ప్రభోః ॥**

(అయోధ్యాకాండ. 118–51))

"తన తండ్రియు, అయోధ్యాధిపతియునైన ఆ ప్రభువు యొక్క అభిప్రాయ మేమిటో తెలియకుండా, మా తండ్రి ఇస్తున్న నన్ను రాఘవుడు స్వీకరించలేదు" అంది.

శివధనుస్సును విరిచి గెలుచుకొన్న సీత అతి సుందరియే గాక, గుణసుందరి కూడ. సీత సుందరి అయినందు వలన రామునికి ప్రియురాలు కాలేదు. మరి యెందుకు ప్రియురాలైంది? **"దారాః పితృకృతా ఇతి"** – తండ్రి ఒప్పుకొని చేసినందుకు. ఇది శ్రీరాముని ధర్మపరాయణత్వం.

వేదోక్త సర్వధర్మములను తు.చ. తప్పక నాచరించి, శ్రీరాముడు **"రామో విగ్రహవాన్ ధర్మః"** అని ప్రసిద్ధి జెందినాడు.

అలాగుననే సర్వధర్మాల సారమయిన మహాభారతము గూడ ధర్మాచరణ యొక్క ఆవశ్యకతను, విశిష్టతను వేయినోళ్ళ చాటుచున్నది. పాండవులు ధర్మాచరణ పరాయణులై అనేక ఇక్కట్లు పాలయినప్పటికి, అంతిమ విజయము ధర్మమునకే లభించునని ఋజువు చేసిరి. అధర్మమార్గ వర్తనులైన కౌరవులు నశింపక తప్పలేదు.

పాండవుల యొక్క ధర్మపరాయణత్వమును ప్రదర్శించిన కొన్ని సన్నివేశములను విచారించెదము.

జూదములో యుధిష్ఠిరుడు తనను, తమ్ములను తుదకు సతీమణిని గూడ ఓడి పోయినాడు. అధర్మపరులైన కౌరవులు పాంచాలిని జుట్టు పట్టుకొని లాగుకొని వచ్చి, నిండుసభలో వస్త్రముల నొలిచి, అవమానము జేయ తలంచిరి. దుశ్శాసనుడు పాంచాలి యొక్క వలువల నొలువ ప్రయత్నించుచున్నప్పటికి వీరులు, ధీరులు, శూరులైన పాండవులు తలలు దించి, మౌనమును వహించిరే తప్ప ఒక్క పల్లెత్తు మాటయయినను మాట్లాడక ఊరకుండిరి. వారు తలంచిన యెడల కౌరవులను, వారి బలగమునంతను క్షణములో సర్వనాశనము చేయగలిగిన పరాక్రమవంతులు. కాని, వారు ధర్మమను త్రాటిచే కట్టివేయబడియుండిరి.

ఈ విధముగ పాండవులు ఆజన్మాంతమూ ధర్మాచరణ యను వ్రతమును నిష్ఠతో పాటించిరి.

రామాయణగాథను పరిశీలించినప్పటికి, లేక మహాభారత గాథను పరిశీలించి నప్పటికి **"యతో ధర్మః తతో జయః"** యను మహాభారత సూక్తి వెల్లడగుచున్నది.

వాల్మీకి రామాయణములోని రావణుడు మహాతేజస్వి, వేదశాస్త్ర పారంగతుడు, నిరుపమాన ధైర్యశాలి, అసమాన బలపరాక్రమ సంపన్నుడు. ముల్లోకములను జయించిన వీరుడు. ఇంద్రాది దేవతలు సహితము యుద్ధములో అతని ముందు నిలువలేకపోయినారు. రావణుని మొదటిసారి హనుమంతుడు చూచినప్పుడు, అతని విలక్షణ లక్షణములను గమనించి ఆశ్చర్యచకితుడయి, ఇట్లు అనుకుంటాడు

**శ్లో॥ అహో! రూప మహోధైర్య మహోసత్త్వ మహోద్యుతిః ।**
**అహో! రాక్షస రాజస్య సర్వలక్షణ యుక్త తా ॥**

(సుందరకాండ. 49-27)

శ్లో॥ యద్యధర్మోన బలవాన్ స్యాదయంరాక్షసేశ్వరః ।
స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా ॥

(సుందరకాండ. 49-28)

"అహో! ఏమి రూపం! ఏమి ధైర్యం! ఏమి కాంతి! ఏమి బలం! రాక్షసేశ్వరుని యొక్క సర్వలక్షణ లక్షితత్వం ఆశ్చర్యకరం. ఈయనలో అధర్మం ఇంత బలంగా లేకపోయినట్లయితే ఈ రాక్షసేశ్వరుడు ఇంద్రునితో కూడిన స్వర్గలోకాన్ని కూడా రక్షించగలడు" అని తలపోస్తాడు హనుమంతుడు.

అలాగుననే, యుద్ధములో మొదటిసారి రావణుని చూచి, రాముడు ఇట్లు అనుకుంటాడు.

శ్లో॥ అహో! దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః ॥
ఆదిత్య ఇవదుష్ప్రే క్ష్యైరశ్మి భిర్భాతిరావణః ॥

(యుద్ధకాండ. 59-26 &27)

"అహో! మహా తేజశ్శాలియయిన ఈ రావణుడు కిరణాలతో సూర్యుడు ప్రకాశించి నట్లు ప్రకాశిస్తున్నాడు" అనుకుంటాడు రాముడు.

శత్రువుల చేత కూడ ప్రశంసింపబడినటువంటి ఆ రావణునికి తుదకు పరా జయము తప్పలేదు. శ్రీరాముని చేతిలో మరణము తప్పలేదు. కారణము అధర్మా చరణయే. శ్రీరాముని విజయమునకు కారణము-ధర్మాచరణయే.

మహాభారతములోని కౌరవసైన్యము భీష్మపితామహ, ద్రోణాచార్య, కృపాచార్య, అశ్వత్థామ, కర్ణ, శల్య మొదలగు అతిరథ మహారథులతో గూడియుండి, పాండవ సైన్యముతో పోల్చినపుడు, చాలా పటిష్ఠమై, దుర్భేద్యమై యుండెను. అయినప్పటికి, కౌరవులకు పరాజయము తప్పలేదు. పాండవుల చేతిలో సమూలముగా మరణించక తప్పలేదు. కారణము-అధర్మాచరణయే. పాండవులు ధర్మాచరణవలన శ్రీకృష్ణ పరమాత్మ యొక్క కృపకు పాత్రులై, విజయమును పొందిరి.

కాబట్టి, ధర్మాచరణ యొక్క ప్రాముఖ్యతను గుర్తించిన మన శ్రుతి, స్మృతులు, ఇతిహాసములు ఎట్టి పరిస్థితులలోను ధర్మమును విడువరాదని ఇట్లు ప్రబోధించుచున్నవి

శ్లో॥ న జాతు కామాన్న భయాన్న లోభాద్
ధర్మం త్యజే జ్జీవిత స్యాపి హేతోః ।
నిత్యో ధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః ॥

(మహాభారతం. స్వర్గారోహణం. 5-63)

శ్లో॥ నాహం కామాన్న సంరమ్భాన్న ద్వేషాన్నార్థ కారణాత్ ।
న హేతువాదాల్లోభాద్ వా ధర్మం జహ్యాం కథంచన ॥

(మ.భా. ఉద్యోగపర్వం. 91-24)

శ్లో॥ ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః । (మనుస్మృతి. -**VIII**-15)

"సత్యం వద, ధర్మం చర" (శ్రుతి వాక్యము)

ధర్మహీనులైన మానవులు పశువులతో సమానమని సనాతన ధర్మము నుడువుచున్నది :

శ్లో॥ ఆహార నిద్రా భయ మైథునాని

ధర్మోహి తేషామధికో విశేషో
ధర్మేణ హీనాః పశుభిః సమానాః ॥

'ఆహారము, నిద్ర, భయము, మైథునము-మానవులకు, పశువులకు సామాన్యములు. ధర్మమును గ్రహించుటయే మానవునిలో విశిష్టమైన లక్షణము. ధర్మహీనులైన మానవులు పశువులతో సమానము'.

కావున, ప్రతి వ్యక్తియు ధర్మము నాచరించి, మానవుడనిపించు కొనవలయును. మానవునకు ఈ శరీరము లభించినది ధర్మము నాచరించుట కొరకేనని శ్రుతి వచించుచున్నది. :

"ఇదం శరీరం ధర్మసాధనమ్"

సాధన కొరకే ఈ శరీరము లభించినది'.

శ్రుతి ఇంకొక సందర్భములో ఇలా చెప్పినది:

**“శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్”**

‘శరీరారోగ్యమును చక్కగ కాపాడుకుంటూ ధర్మాచరణ చేస్తూ ఉండాలి’.

కాబట్టి, మానవులందరు ధర్మాచరణ యొక్క ఆవశ్యకతను తెలిసికొని, ధర్మము నాచరించి, తరింతురు గాక!

## V. సనాతన ధర్మము యొక్క విశిష్టత :

ప్రపంచములో అనేక ధర్మములున్నవి. వాటన్నిటిలో కెల్ల సనాతన ధర్మము శ్రేష్ఠమైనది మరియు శాశ్వతమైనది.

**శ్లో॥ వరిష్ఠోఽఖిలధర్మేషు ధర్మ ఏవ సనాతనః ।**
**జాయన్తే సర్వధర్మాస్తు శాశ్వతో హి సనాతనః ॥**

‘అన్ని ధర్మములలో కెల్ల సనాతనధర్మము మాత్రమే సర్వశ్రేష్ఠమైనది. సనాతన ధర్మము శాశ్వతమైనది అనగ ఎల్లప్పుడు ఉండునది. కాబట్టి, దీని నుండియే అన్ని ధర్మములు పుట్టుచున్నవి’.

ఈ ప్రపంచములో నాల్గు ధర్మములు ముఖ్యమైనవి. అవి సనాతన, ఇస్లామ్, బౌద్ధమతము, క్రైస్తవ మతములు. వీటిలో ప్రతి ఒక్కదానిని కొన్ని కోట్ల ప్రజలు అనుసరిస్తున్నారు. ఈ నాల్గు ధర్మములు అనేక శాఖలను గూడ కల్గియున్నవి. వీనిలో సనాతనధర్మము తప్ప, మిగిలిన మూడును ప్రవక్తల చేత స్థాపింపబడినవి. ఇస్లామ్ మహమ్మదు ప్రవక్త చేతను, బౌద్ధ ధర్మము బుద్ధుని చేతను, క్రైస్తవధర్మము జీసస్ క్రైస్ట్ చేతను స్థాపింపబడినవి. కాని, సనాతన ధర్మమునకు అలాగా స్థాపకుడంటూ లేడు. ఇది ఆద్యంతములు లేని సనాతనమైనది; ఏ ఒక వ్యక్తి చేతను ప్రారంభింప బడినదికాదు. ఎలాగ భగవానుడు శాశ్వతమైనవాడో, అలాగ సనాతన ధర్మము గూడ. భగవానుడు తానే మూర్తీభవించిన సనాతన ధర్మమని గీతలో వెల్లడించినాడు. (గీత. **XIV**–27).

ఏ యుగములోనైనను, ఎప్పుడెప్పుడు ఈ సనాతనధర్మమునకు పీడ సంభవింపనో, అప్పుడు భగవానుడు భువిపై అవతరించి, ధర్మమును సంరక్షించి, పునః స్థాపనజేయును (గీత. **IV**-7,8). ఇచట ఒక విషయమును మనము గమనించవలయును - కలిగిన పీడను తొలగించి, పునఃస్థాపన జేయుచున్నాడే తప్ప క్రొత్తగా ప్రారంభించుట లేదు.

అర్జునుడు గూడ భగవానుని "సనాతన ధర్మ రక్షకుడవు" (శాశ్వత ధర్మ గోప్తా) యని గీతలో పేర్కొన్నాడు. (గీత. **XI**-18).

ఈ సనాతన ధర్మము నుండి అనేక మతములు, సంప్రదాయములు ఉద్భవించినవి. మానవ కళ్యాణము కొరకు అనగా మానవుడు పరమ పదమును పొందుటకు ఈ సంప్రదాయములు వారు వేసిన పలు మార్గములు సనాతన ధర్మము యొక్క ప్రసాదమే. ఈ మార్గములను జాగ్రత్తగాను, నిస్వార్థబుద్ధితోను అనుసరించిన యెడల, అవి తప్పక పరమపదమునకు నడిపించును. దానిలో ఎటువంటి సందేహము లేదు - ఎందువలననగా మానవుల యొక్క మోక్షప్రాప్తి కొఱకు గంభీరముగను,అగాధముగను ఆలోచించి, ఈ మార్గములను సనాతన ధర్మము ఏర్పరచినది. ఈ విషయములో మిగిలిన ధర్మములు కొరతబడియున్నవి. సనాతన ధర్మము యొక్క సిద్ధాంతములు శాస్త్రోక్తమైనవి యగుటచే అవి మానవులను పరమపదము వైపునకు నడిపించును.

సనాతన ధర్మములో వివరించబడిన సిద్ధాంతములు మరియు నియమములు సృష్ట్యాది నుండి ఆచరణలో ఉన్నవి. అవి శాశ్వతములైనవి. గీతలో కృష్ణభగవానుడు జ్ఞానయోగమును గురించి చెప్పబోతూ, ఈ యోగము అవ్యయమైనది అనగా వ్యయము కానిది అనగా శాశ్వతమైనదని వర్ణించినాడు. "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్" (గీత. **IV**-1). మరియు శుక్ల కృష్ణ మార్గములు (దేవయాన, పితృయాన మార్గములు) కూడ శాశ్వతమైనవని వర్ణించినాడు- "శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే" (గీత. **VIII**-26). గీత కృష్ణభగవానుని గూడ సనాతన పురుషునిగా పేర్కొన్నది. **"సనాతనస్త్వం పురుషో"** (గీత. **XI**-18).

శరీరధారియైన జీవుడు గూడ శాశ్వతుడే లేక సనాతనుడేనని గీత వర్ణించు చున్నది. "జీవ భూతః సనాతనః" (గీత. **XV**-7). ధర్మము గూడ శాశ్వతమైనది లేక సనాతన మైనదేనని గీత పేర్కొనుచున్నది. **"శాశ్వతస్య చ ధర్మస్య"** (గీత. **XIV**-27).

జీవుడు సనాతనుడు, జీవుడు ఏ యోగము (జ్ఞానయోగము) నాశ్రయించి పరమ పదమును పొందగలడో ఆ యోగము గూడ సనాతనమైనదే, జీవుడు ఏ మార్గము (దేవయాన) ద్వారా భగవానుని చేరగలడో ఆ మార్గము గూడ సనాతనమైనదే, జీవుడు ఏ ధర్మము నాచరించిన పరమపదమును పొందగలడో ఆ ధర్మము గూడ సనాతనమైనదే, ఆ ధర్మమున కాశ్రయుడైనవాడు కృష్ణ పరమాత్మయేనని గీత పేర్కొనుచున్నది.

సనాతనుడైన కృష్ణ భగవానుని చేత సృష్ట్యాదిలోనే, జగత్తును నియమాను సారముగా నడిపించుటకు, అమలు జరుపబడిన ధర్మమునే 'సనాతన ధర్మ'మని పేర్కొనిరి.

ఇదే విషయమును వ్యాసమహర్షి గూడ ఉటంకించినాడు :

**శ్లో॥ యే చ వేదవిదో విప్రా యే చాధ్యాత్మవిదో జనాః ।**
**తే వదన్తి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్ ॥**

'విష్ణువు లేక కృష్ణుడే సనాతన ధర్మమని వేదములను ఉపనిషత్తులను తెలిసికొనిన పెద్దలు చెప్పుచున్నారు'.

సనాతన ధర్మమును గురించి భవిష్యపురాణం ఇట్లు చెప్పుచున్నది:

**శ్లో॥ ధర్మః శ్రేయః సముద్దిష్టం శ్రేయోऽభ్యుదయ లక్షణమ్ ।**
**సతు పంచవిధః ప్రోక్తో వేదమూలః సనాతనః ॥**

పై సూక్తి ప్రకారము సనాతనధర్మమునకు మూలము వేదమని చెప్పబడుచున్నది.

వేదముల యొక్క మూలము భగవానుడని వేరొక సూక్తి చెప్పుచున్నది. "యస్య నిశ్శ్వసితం వేదాః" అని చెప్పబడినది. అనగా 'భగవానుని యొక్క శ్వాసయే వేదములు' అని అర్థము. కాబట్టి, వేదముల యొక్క మూలము భగవానుడే.

క్లుప్తములో చెప్పాలంటే-సనాతన ధర్మమునకు మూలము వేదములు. వేదములకు మూలము భగవానుడు. కావున, సనాతన ధర్మమునకు మూలము భగవానుడే అయినాడు. **ఈ ధర్మము స్వయం భగవానుని నుండి వచ్చుట, దీని యొక్క విశిష్టతలో ముఖ్య అంశము.**

మనుమహర్షి గూడ ధర్మము వేదముల నుండియే వెలువడినదని దృఢ పరచు చున్నారు.

**శ్లో॥ శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః ।**
**తే సర్వార్థేష్వ మీమాంస్యేతాభ్యాం ధర్మో హి నిర్బభౌ॥**

'వేదములు శ్రుతులుగాను, ధర్మశాస్త్రములు స్మృతులుగాను తెలియబడుచున్నవి. ఇవి రెండును విమర్శించరానివి. ధర్మము వీటినుండియే వెలువడినది'.

కాబట్టి, సనాతన ధర్మమునకు మూలము సాక్షాత్తు పరబ్రహ్మ పరమాత్మయే. ఇది సనాతన ధర్మము యొక్క విశేషత.

మరియొక విశేషమేమంటే- ఇదియే అసలైన ధర్మము, మిగిలినవన్నియు మతములు మాత్రమే. ఇస్లాం, బౌద్ధ, క్రైస్తవ-ఇవి మతములు. ఈ మత, మతాంతరము లన్నియు సనాతనధర్మము నుండియే వెలువడినవి.

కావున, అన్ని మతములకు మూలము సనాతన ధర్మమే నని చెప్పవచ్చును.

మరియొక విశేషము-ఇతర మతముల ఉపదేశముల కంటె సనాతన ధర్మము యొక్క ఉపదేశములు విశాల దృక్పథముతో గూడినవియు, విశ్వజనాత్మక మైనవియునై యున్నవి. క్రైస్తవ మతము ఈ ప్రపంచములోని ప్రజలనందరిని సోదర, సోదరీ మణులుగా భావించమని ప్రబోధించుచున్నది. కాని, గీతలో కృష్ణ పరమాత్మ ఇట్లు చెప్పినాడు.

**శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః ॥ (గీత. VI-29)**

'యోగముచే సమాహితచిత్తుడును, సమస్త భూతములయందు సమభావము గలవాడునగు యోగి, సర్వభూతములయందు తనను, సర్వభూతములను తన యందును దర్శించును'.

సోదర భావమును కలిగియుండుటలో ఒక ప్రమాదమున్నది. సోదరులలో కలహము సంభవించుట కవకాశము గలదు. కాని, ఆత్మభావము కలిగియున్నప్పుడు అనగ అందరిలో ఉన్నది ఒకే ఆత్మయనియు, అందరిలోను ఆత్మస్వరూపుడైన భగవానుడు స్థితుడై యున్నాడను భావము కలిగినప్పుడు కలహములు సంభవించుట కవకాశము లేదు.

ఇదే భావమును శ్రీ తులసీదాసు ఇట్లు ప్రకటించినాడు :

**"సీయ రామమయ సబ జగ జానీ ।**

**కరఉ ప్రణామ జోరి జుగ పానీ ॥"**

ప్రపంచమంతయు సీతారామ మయమని తెలిసికొని, ప్రణామ మాచరించుమని ఈ కవి పుంగవుడు చెప్పుచున్నాడు.

"సర్వభూతములను అనగా సమస్త ప్రాణులను నీ యొక్క ఆత్మతో సమానముగా చూడుము" అనెడి ఉపదేశము వేరే మతములలో ఎచటను కనిపించదు.

అన్ని దేశముల వారు తమ తమ దేశముల యొక్క ఉన్నతిని కోరుదురు. కాని, మన శాస్త్రము ఏమి చెప్పుచున్నదో గమనింపుడు:

**శ్లో॥ మాతా చ కమలాదేవీ పితా దేవో జనార్దనః ।**

**బాంధవా విష్ణుభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥**

'లక్ష్మీదేవి మా యొక్క తల్లి, భగవానుడు శ్రీమహావిష్ణువు మా యొక్క తండ్రి, విష్ణు భక్తులందరును మా యొక్క బంధువులు, మూడు లోకములు మా యొక్క స్వదేశమే'.

పై సూక్తి 'అన్ని దేశములను మన దేశముగానే భావించి, అన్ని దేశముల ప్రజలను ప్రేమింపుము' అని బోధించుచున్నది. ఇది ఎంతటి మహత్తరమైన ఉన్నత భావన! ఎంత విశాల దృక్పథము.!

ఇదే భావనను మరియొక సూక్తి గూడ చక్కగా వర్ణించుచున్నది.

**శ్లో॥ అయం నిజః పరోవేత్తి గణనా లఘుచేతసామ్ ।**

**ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥**

'ఇది నాది, అది వానిది' అను భావన సంకుచిత మనస్తత్వం గలిగిన జనులు కలిగియుందురు. ఉదారచరితులు అనగా విశాల దృక్పథము గలిగిన వ్యక్తులు ఈ ప్రపంచమంతయు తమ కుటుంబముగా భావించుదురు.

సనాతన ధర్మము ప్రపంచ ప్రజలందరి యొక్క ఆధ్యాత్మిక జ్ఞానవికాసమును, సామాజిక పురోభివృద్ధిని మరియు నైతికోన్నతిని దృఢముగా వాంఛించుచున్నది.

దేశ, కుల, మత, జాతి భేదము లేకుండా ప్రపంచములోని ప్రతి ఒక్కరి క్షేమము కొరకు ప్రార్థించునది ఒక్క సనాతన ధర్మమే. మిగిలిన మతములలో ఏ ఒక్కటియు ఇట్లు చేయుట లేదు. సనాతన ధర్మము యొక్క ప్రార్థనా విధానమును గమనింపుడు

**"సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చి ద్దుఃఖభాగ్భవేత్ ॥"**

**"స్వస్త్యస్తు విశ్వస్య ఖలః ప్రసీదతాం**
**ధ్యాయంతు భూతాని శివం మిథో ధియా ।"** (భాగవతం **V**-18-9)

**"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం**
**న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।**
**గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం**
**లోకా స్సమస్తాః సుఖినో భవన్తు ॥** (వాల్మీకి రామాయణము)

ఈ విధముగ సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని కాంక్షించుటయే సనాతన ధర్మము యొక్క ప్రధానమైన విశిష్టత.

సనాతన ధర్మము యొక్క మరియొక విశేషత-యజ్ఞాచరణ. మన శాస్త్రాలలో పంచమహాయజ్ఞములు చెప్పబడినవి. దేనివలన ఇతరులకు భోజనము లభించునో అది యజ్ఞము. దేని వల్లనైతే పూర్తి ప్రపంచానికే భోజనము లభించునో అది మహాయజ్ఞము. గీతలో భగవానుడిట్లు నుడివినాడు :

**శ్లో॥ యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుంజతే తే త్వఘం పాపాయే పచంత్యాత్మకారణాత్ ॥** (గీత **III**-13)

'యజ్ఞశేషమును భుజించు సత్పురుషులు సర్వపాపముల నుండి ముక్తులగుదురు. కాని కేవలము తమ కొఱకే అన్నాదులను వండుకొనువారు పాపమునే భుజించుచున్నారు. అట్టి వారు దురాచారులగుదురు.'

**శ్లో॥ యజ్ఞ శిష్టా మృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయంలోకోఽస్త్య యజ్ఞస్యకుతోఽన్యః కురుసత్తమ ॥** (గీత **IV**-31)

'కురుకులోత్తమా! యజ్ఞము చేయగ మిగిలిన ఆహారము అమృతము వంటిది. దానిని భుజించువారు సనాతన బ్రహ్మమును బొందుదురు. ఏ యజ్ఞమునూ చేయని వానికి అల్ప సుఖకరమగు ఈ మనుష్యలోకమే లభింపనపుడు దేవాదిలోకము లెట్లు లభించును?'.

పరోపకారార్థమై ఆచరింపబడు ఏకార్యమైనను 'యజ్ఞ'మనియే చెప్పబడును. సదాచారుడైన వ్యక్తి పదిమందికి తినిపించిన తరువాత కాని తాను తినడు. అటువంటి సత్పురుషునకు ఇహపర సౌఖ్యములు రెండును లభించును. అట్లుగాక, లోభియైన వ్యక్తి తన కొఱకే వండుకొని భుజించును. అట్టివానికి ఈ లోకములోనే సుఖము లభించదు. ఇక పరలోకము సంగతి చెప్పవలయునా! అనగా లభించదుఅని యర్థము.

ఇట్టి ఉపదేశములు మన సనాతన ధర్మములోనే కనిపించును. ఇతర మతముల యందు కనిపించవు.

సనాతన ధర్మము మన కొసంగు మరియొక మహత్త్వపూర్ణమైన ఉపదేశమేమనగా- సర్వభూతములయందు ద్వేషమును వీడి, ప్రేమింపుమని ప్రబోధించుచున్నది. కృష్ణ భగవానుడు గీతలో ఇట్లు చెప్పుచున్నాడు :

**శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః ।**
**నిర్వైరః సర్వభూతేషు యః స సమామేతి పాండవ॥** (గీత **XI**-55)

'అర్జునా! నన్నే సేవించువాడు, నన్నే పరమగతియని తలంచువాడు, నా యందు

భక్తిగలవాడు, స్వజనులయందు ఆసక్తిని వదలినవాడు, సర్వభూతములయందు వైరము (ద్వేషము) లేనివాడు నగు మానవుడు నన్ను పొందగలడు'.

ఏ ప్రాణియందును వైరములేని వ్యక్తికి భగవత్ప్రాప్తి కలుగును. కాని, ఇచట ఒక ముఖ్యమైన విషయమును గమనించవలయును. పొరపాటుననైనను ఒక్క ప్రాణితో వైరమున్న యెడల ఫలితము లభించదు. ఎందువల్లననగా– అందరిలోను పరమేశ్వరుడు స్థితుడైయున్నాడు. మనము ద్వేషించుచున్న ఆ ఒక్క ప్రాణియందు గూడ భగవంతుడున్నాడు గనుక మనము భగవంతునే ద్వేషించినట్లగును. భగవానుడు **"మమైవాంశో జీవలోకే"** 'ఈ లోకములోని సర్వజీవులు నా యొక్క అంశయే' నని స్వయముగా చెప్పియున్నాడు. ఉదాహరణకు : మనము ఒక వ్యక్తిని సాదరముతో పూజించుచున్నాము, అదే సమయములో అతని ఒక వ్రేలిని కాల్చినామనుకోండి. ఆ వ్యక్తి సంతోషించునా? తప్పక బాధపడును. అలాగుననే, అందరిని ప్రేమించుచు ఒక్క ప్రాణిని ద్వేషించినను భగవానుడు మెచ్చడు. దాని వలన భగవత్ప్రాప్తి కలుగదు. కావున, సమస్త ప్రాణులను ప్రేమించవలయునని సనాతన ధర్మము బోధించుచున్నది.

సనాతన ధర్మములో మాత, పిత, ఆచార్య, అతిథులు దేవతలుగా చెప్పబడినారు. **మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ,** వీరి నల్గురిని దేవతలుగా భావించి, అన్ని విధముల సేవల నాచరింపుమని మన సనాతనధర్మము బోధించుచున్నది. ఇది చాలా అత్యున్నతమైన భావన. ఇది వేరే మతములలో కనిపించదు. ప్రత్యేకముగా అతిథి సేవ చాలా మహత్త్వపూర్ణమయినది. నిత్యము అతిథి సేవ చేయువాని ఇంటికి ఏదో ఒక రోజు స్వయం భగవానుడే అతిథి రూపములో రావచ్చును. కావున, అతిథి సత్కారమునకు చాలా మాహాత్మ్యమున్నది.

సనాతనధర్మము యొక్క మరియొక విశేషమేమంటే – పరమగతిని పొందుటకు తేలికయైన, సరళమైన మార్గము చెప్పబడినది. గీతలో భగవానుడిట్లు బోధించినాడు:

**శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥** (గీత 8-13)

'బ్రహ్మవాచకమగు ఓంకారమును ఉచ్చరించుచు, నన్ను చింతించుచు, ఎవడు

దేహమును వదలుచున్నాడో, వాడు పరమగతియగు మోక్షమును బడయ గల్గుచున్నాడు'.

ఒకసారి యీ పరమగతిని పొందిన వ్యక్తి జనన మరణచక్రము నుండి తప్పించుకొని, శాశ్వత శాంతిని బొందును.

మరియొక విశేషము-సనాతన ధర్మము 'స్వధర్మము'నకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చుచున్నది. స్వధర్మము నాచరించుచు మరణించిన వ్యక్తికి సద్గతి లభించునని బోధించుచున్నది. గీతలో భగవానుడిట్లు చెప్పినాడు :

**శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**

**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥** (గీత **III**-35)

'పరధర్మమును లెస్సగా ఆచరించుగాక! అయినను దానికంటె స్వధర్మమే మేలు. స్వధర్మమునందు కొన్ని అంశముల లోపములుండిన నుండుగాక! స్వధర్మము నాచరించుచు మరణించినను మేలే. పరధర్మము ముప్పు కల్గించును'.

ఎట్టి పరిస్థితులలోను స్వధర్మమును పాలించుచు, దానితో పాటు భగవానుని యందు భక్తిని గలిగియుండవలయునని సనాతనధర్మము బోధించుచున్నది. గీతలో భగవానుడు అర్జునునకు ఇట్లు చెప్పినాడు:

**శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।**

**మయ్యర్పిత మనోబుద్ధిః మామేవైష్య స్యసంశయః ॥** (గీత **VIII**-7)

'కావున, హే అర్జునా, ఎల్లప్పుడును నన్నే అనుసంధించుచు, యుద్ధము చేయుము. మనోబుద్ధులను నా కప్పగించి నిక్కముగ నీవు నన్నే పొందగలవు'.

అనగా, 'ముహం మే రామ్ హాథ్ మే కామ్' అను హిందీ సూక్తి ఇచట వర్తించును. ఎవడైతే నోటితో భగవన్నామ స్మరణ చేస్తూ, చేతులతో విధ్యుక్త కర్మాచరణ గావించునో వాడు తప్పక పరమపదమును బొందును.

## ధర్మాచరణ యొక్క ఫలితము :

రాక్షసులకు ఆచార్యుడైన శుక్రాచార్యుడు సహితము ధర్మాచరణ యొక్క మహత్తును కొనియాడుచూ, స్వధర్మాచరణ యొక్క సత్ఫలితము నిట్లు వర్ణించినాడు:

**శ్లో॥ తపః స్వధర్మరూపం యద్వర్థితం యేనవై సదా।**

**దేవాస్తు కింకరాస్తస్య కిం పునర్మనుజా భువి ॥** (శుక్ర నీతిసార. **I**-24)

'ఎవడైతే 'స్వధర్మాచరణ' రూపములో తన తపఃశక్తిని వృద్ధిజేసికొనునో, వానికి దేవతలు కింకరులై (దాసులై) సేవ చేయుదురు, ఇక ఈ లోకములోని మనుష్యుల సంగతి 'ఏమని చెప్పవలెను"!.

ఇట్టి సనాతన ధర్మమును మన పూర్వీకులు తు.చ. తప్పక ఆచరించినంతకాలము మన భారతదేశము ఉచ్ఛస్థితిలో ఉండియున్నది. కాని, ఈనాడు మనము దానిని త్రోసిపుచ్చి యిష్టానుసారముగా ప్రవర్తించుటచేత మనదేశము రోజు రోజుకు అథోగతి పాలగుచూ వచ్చుచున్నది.

## VI. ధర్మరాహిత్యము యొక్క దుష్ఫలితము :

ఏ మానవుడైతే ధర్మశాస్త్రముల నుల్లంఘించి, తన మనస్సునకు నచ్చినట్లు ప్రవర్తించునో, వాడు తప్పక అథోగతి పాలగును. కృష్ణభగవానుడు గీతలో ఇట్లు చెప్పినాడు :

**శ్లో॥ యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామ కారతః ।**

**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్**

**శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।**

**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥** (గీత **XVI**-23&24)

'శాస్త్రపద్ధతిని అతిక్రమించి మనస్సుకు వచ్చినట్లు ప్రవర్తించువానికి సిద్ధియు లేదు; సుఖమును లేదు; పరమగతియును లేదు. కావున, అర్జునా! ఇది చేయదగును-ఇది చేయరాదని నిర్ణయించుకొనుటకు శాస్త్రమే నీకు ప్రమాణమై

యున్నది. కాబట్టి, శాస్త్రము విధించి చెప్పిన కర్మము నెఱిగి, దానినే నీవు చేయుట మంచిది'.

కావున, శ్రీకృష్ణ పరమాత్మ నుడివిన రీతిగా ప్రతి మానవుడు సనాతనధర్మము యొక్క ప్రబోధముల నెఱింగి, విధ్యుక్త కర్మముల నాచరించి, పరమ పదమును పొందును గాక!

ఓం తత్ సత్

శ్రీకృష్ణార్పణమస్తు

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

స్వభాను సంవత్సర భాద్రప్రద బహుళ దశమి 21-09-2003